ఓల్ ఈ రోల్‌వాగ్

# నేలను పిండిన ఉద్దండులు

అనువాదం :
బి. వి. సింగరాచార్య




యం. శేషాచలం అండ్ కంపెనీ
మచిలీపట్టణము - సికింద్రాబాదు - మద్రాసు

# ఒకటవ భాగము

## ౧

పొద్దు వాటారుతూంది. మైదానంలో ఎత్తుగా పెరిగిన గడ్డిమీంచి దారికాని దారివెంట కొన్ని పెట్టెబళ్ళు మెల్లగా సాగిపోతున్నాయి. విశాల వక్షంగల ఒక బలిష్ఠుడు బళ్ళకు ముందు నడుస్తున్నాడు. ఆయనకి పదడుగులు వెనగ్గా నడచి వస్తున్నాడు—తొమ్మిదేళ్ల కుర్రాడు. వాళ్లు తండ్రికొడుకులు.

వాళ్లిద్దరి వెనుక కొన్ని ఎడ్లు పెద్దపెట్టెబండి లాక్కొస్తున్నాయి. ఆబండి ఏనాడో విరిగి మూలపడవలసిన బాపతు; పాతడొక్కులా కనిపిస్తూంది. కొయ్యచట్రం కప్పుమీద ఒత్తుగా గొంగళ్లు కప్పివున్న ఆ బండీలో ఒక సంసారానికి కావలసిన సామాగ్రి—పనిముట్లు, గుడ్డలు వగైరా—వున్నాయి. దాని వెనక వస్తున్న చిన్నబండీనిండా తిండిగింజలు గట్రావున్నాయి. బళ్లు ముందుకు సాగిపోతున్నాయి. కొయ్యచక్రాలు ఎడతెగకుండా రొదచేస్తున్నాయి. బళ్ల వెనుక వస్తూన్న ఆవు అక్కడక్కడ ఓక్షణం ఆగి, నోటెడు గడ్డి పీక్కుని నవులుతూ నడుస్తూంది. ముందున్న బండీకి ముంధు

అడ్డంగా ఒక చెక్క వుంది. దానిమీద ఒక పక్కగా కూర్చున్న స్త్రీ బండి తోలుతోంది. ఓ చిన్నపిల్ల ఆమె మీదకివాలి పడుకుని నిద్రపోతోంది. రెండోపక్కన ఓ చిన్న కుర్రాడు,—ఏడేళ్ళుండొచ్చు—ఎదటికి సూటిగా చూస్తున్నాడు.

పెర్హాంసాకుటుంబం అది. ఆయన పెద్దకొడుకుపేరు ఓల్, భార్య బెరెట్. చిన్నపిల్ల అన్నామేరీ. చిన్నకొడుకుపేరు హాన్స్. పూచిక పుల్లకూడా విడిచిపెట్టకుండా సరంజామా అంతా కట్టుకుని మిన్నెసోటానించి డకోటా ప్రాంతానికి తరలి పోతున్నారు. అక్కడ బంజరుభూమి సంపాదించి దున్నుకుంటూ ఇల్లూ వాకిలి కట్టుకుని జీవనం చెయ్యాలని బైలుదేరాడు పెర్హాంసా. ఆ కొత్తగడ్డమీద బంగారం పండించగలనని ఆయన ధీమా. అక్కడ అలాంటి అవకాశం కావలసినంత ఉంది.

ఆదీ అంతూలేని ఆ మైదానంలో ఆబళ్ళు బాగా చిన్నవిలాగా కనిపిస్తున్నాయి. ముక్కుకు సూటిగా, మెల్లిగా కదలిపోతున్నాయి బళ్ళు. ఇంచు మించు నాలుగు వారాలుగా సాగుతున్న యాత్ర—ఇది. కొన్నాళ్ళక్రితం దారి తప్పింది. ఇంత వరకు మళ్ళీ దారి దొరకలేదు. అలాగే ప్రయాణం సాగుతూంది. ఎక్కడున్నదీ ఎక్కడికి పోతున్నది అంతుపట్టడం లేదు. స్ప్లిట్ రాక్ ఏటికి చేరుకుంటే మళ్ళీ దారికిమళ్ళడం తేలికే. రెండు మూడు రోజులక్రిందటే అక్కడికి చేరవలసింది. పెర్హాంసాకి ఆందోళనగా ఉంది.

చాలాసేపట్నించి, పెర్హాంసా మౌనంగా నడుస్తున్న వాడల్లా, వెనక్కితిరిగి, "ఇంకనువ్వు కాసేపు బండితోలు. ఒంటరిగా ఉంటే మీ అమ్మకితోచదు. ఏవైనా కబుర్లు చెపుతూండు," అన్నాడు ఓల్‌తో.

వాడికి తండ్రితో నడవటమే సరదాగాఉంది. అయినా వెనక్కితిరిగి పోబోతూ, "ఈరాత్రికైనా మనకి వాళ్లు కనిపిస్తారానాన్నా?" అన్నాడు.

"ఊఁ హుఁ వాళ్లు చాలాముందుకి వెళ్లిపోయుంటారు. అయినా, నీకు దూరాన ఏదైనా కనిపిస్తే వెంటనే నాకు చెప్పు." అని ముందుకు నడిచిపోతున్నాడు.

ఓల్ వెళ్లి బండిముందు చెక్కమీది కెక్కాడు. "ఏదైనాజాడ కనిపించిందా?" తల్లి ఆందోళనగా అడిగింది.

"ఏం కనిపించలేదమ్మా!" అన్నాడు ఓల్ మెల్లగా.

అమ్మ ఎందుకలా భయపడుతూందో, చిన్న కుర్రాడు హాన్స్‌కి అర్థం కావడంలేదు. వాడికి తండ్రిమాట మీదగురి. సరైన దారినే వెడుతున్నామని నాన్న తనకి చెప్పాడుగా. వాడు బండిదిగి వెళ్లి తండ్రిచెయ్యిపట్టుకుని పక్కన నడుస్తున్నాడు.

తల్లి చాలా అలిసిపోయినట్టు వెనక్కి ఆనుకుంది. అన్నామేరీ తల్లితొడమీదే పడుకుని నిద్రపోతూంది. ఓల్ ఎడ్లని తల్లికన్న చురుగ్గా తోలుతూ, ఆ మైదానంలోకి పరీక్షగా చూస్తున్నాడు. ఎదట దూరాన ఒకచోట నేలక్రమంగా

పైకి లేస్తున్నట్టు కనిపిస్తూంది. అద్ది సరిగా వాళ్లు వెళుతున్న దిక్కుకి సూటిగా కాకప్రక్కగా ఉన్నా పెర్హాంసా ఆమెరక వేపు నిదానించి చూశాడు. సూర్యుడు అస్తమిస్తున్నాడు. బాగా సాయంకాలం అయింది. ఆకాశంలో క్రమంగా చీకట్లు ముసురుకుంటూ, ఆ నిర్జన ప్రాంతమంతటినీ అధీరతతో, ఆం దోళనతో నింపేస్తూంది. ఓల్ కి ఆదృశ్యం అందంగా కని పిస్తూంది. ఆ చదును నేలమీద బాగా దిగువగా కనబడు తూన్న మబ్బు తునకలవేపు చాలాసేపు అలాగే చూస్తున్నాడు.

తల్లి పైకి వినపడకుండా ఏడుస్తూంది. బాగా అలసి పోయినట్టు కనిపిస్తూంది. అన్నా మేరీ ఆమెతొడమీదే పడు కునిఉంది. "ఏవండీ! తర్వాలో ఎక్కడైనా ఆగుదామా?" అంది భర్తని ఉద్దేశించి.

"ఆగుదాం ఆగుదాం,"—అన్నాడు పెర్హాంసా ఏదో ఆలోచిస్తూ.

తల్లి ఏడుస్తూందని ఓల్ గ్రహించాడు. తనుగ్రహిం చిన సంగతి తల్లికి తెలియనీయలేదు. సూటిగా ఎదురుగా చూస్తున్నాడు. "అదుగో! ఏదో అడవిలాగ కనిపిస్తూంది నాన్నా!" అని అరిచాడు.

"అవును! నేను, హాన్సూ దాన్ని చాలాసేపట్నించీ చూస్తున్నాం. మనం ఇప్పుడు ఆవేపే వెళ్లాలి. అదే సరైన దారి."

"నాన్నా, వాళ్లుకూడా ఈదారినే వెళ్లారంటావా?" హాన్స్ అడిగాడు.

"అవును, బహుశః ఇటే వెళ్లి ఉంటారు."

"ఇక్కడ దగ్గర్లో ఎవరైనా మనుషులు ఉన్నారా నాన్నా?"

"లేరు. మనం తప్ప ఎవ్వరూ లేరు," అన్నాడు తండ్రి. చివరికి, పెర్వాంసా ఆరోజుకి ప్రయాణం ఆపుచేశాడు. అంతా బాగా అలసిపోయిఉన్నారు,— మనుష్యులు, పశువులు కూడా.

దార్లో వెనక చిట్టచివరసారి కనిపించిన చెట్లగుంపు నించి వాళ్లు తీసుకొచ్చిన కట్టెలమోపు చిన్నకుర్రాడు తీసుకు వచ్చాడు. ఓల్ మంటచేసి, మూడు ఇనపచువ్వలు పైకొనలు కట్టి ఆ మంట చుట్టూ గుచ్చాడు. తండ్రి ఎడ్లను విప్పి మేతవేశాడు. తర్వాత, పాలుతీసి ఆవునికూడా వదిలాడు. తర్వాత, వాళ్లంతా పడుకుంటానికి బండికింద పక్కలు వేశాడు. నేలపైన పరిచిన గొంగళిమీద తల్లి భోజనాల బల్ల వేసింది. చిన్నపిల్ల లేచి ఆ గడ్డిలో పడుతూ లేస్తూ నడుస్తూంటే తల్లి చూస్తూంది. మంచి చలాకీ పిల్ల. కింద పడ్డా కిలకిల నవ్వుతూంది.

చివరికి, భోజనం సిద్ధమయింది. పెద్దగిన్నెలో తండ్రికీ ఇద్దరుకొడుకులికీ, చిన్నగిన్నెలో తల్లికీ, చిన్నపిల్లకీ పెట్టు కున్నారు. భోజనంతో తాగడానికి పాలు ఆక్టేలేవు. ఆవు

నడిచి నడిచి అలసి ఉంది. పట్టుమని పదిపరకలు గడ్డికూడా మేయలేదు. ఏంపాలిస్తుంది? పాలు పిల్లలకి ఉండాలని తండ్రి నీళ్లు తాగి ఊరుకున్నాడు. ఆ పాలు తనకి రుచిగా లేవని. సాకు చెప్పాడు. అన్నంకూడా సరిగ్గా తినలేదు.

ఎవళ్లూ ఏమీ మాట్లాడకుండా భోజనాలు ముగిం. చారు. అంతుపంతులేని ఆ విశాలమైదానం మధ్య నలకల్లా. గున్న తమ ఉనికి గుర్తించినవాళ్లకి తిళ్లు అయినతర్వాత కూడా మాట్లాడటానికి ఏమీ కనిపించలేదు. చిన్నపిల్ల అంది: "ప్రభువుకి, మన సృష్టికర్తకి ధన్యవాదాలు..." అని తల్లి ఒళ్లోపడుకుని నిద్రపోయింది. తక్కినవాళ్లు అల్లాగే మౌనంగా కూచుని అప్పుడే ఉదయిస్తూన్న చంద్రుణ్ణి చూస్తున్నారు. గుండ్రంగా పెద్దచందమామ ఉదయిస్తూ, వెన్నెలవచ్చేసరికి వాళ్లు కొంత తేరుకున్నారు.

ఆనాటికి విశ్రాంతి తీసుకోనడానికి అందరూ బండీ కింద వేసివున్న పక్కలమీదికి పాకిపోయారు. పిల్లలందరికీ నిద్రపట్టినతర్వాత, "మనం వాళ్లని కలుసుకోగలమంటారా?" అంది భార్య.

"తప్పకుండా కల్సుకుంటాం", అన్నాడు పెర్హాంసా. అని ఇంకోవేపు తిరిగి కళ్లు మూసుకున్నాడు. బెరెట్ ఇంకేమీ మాట్లాడలేదు.

# 7

## ౨

నిజానికి పెర్హాంసా అలసిపోలేదు. తానీ ప్రయాణం మళ్లీ సాగించడం భార్యకి నిజంగా ఇష్టంలేదు. ఆయన ఈ విషయమే ఆలోచిస్తూ పడుకున్నాడు. పైగా, బెరెట్ చాలా తెలివైంది. ఆమె అభిప్రాయమే సరైనదేమో అనే భావం పెర్హాంసాని కలతపెడుతూంది. అసలు బయలుదేరడం తోనే, అడుగులోనే హంసపాదు అన్నట్టు పెద్దబండీ విరిగింది. అప్పటినించీ పెర్హాంసాలో ఈ ఆందోళన ప్రారంభమయింది. బండీ మరమ్మతుచేసుకోడానికి తాను కొంచెం వెనకబడి పోవలసివచ్చింది. తమతో బయలుదేరినబళ్ళన్నీ ముందుకి వెళ్ళిపోయినయి. తనను, తన కుటుంబాన్నీ ఒంటరిగా వదిలి వెళ్ళడం మిగిలినవాళ్ళకి ఇష్టంలేదు. "మాకోసం మీరు ఆగొద్దు. మీబళ్ళు సాగిపోతూండనివ్వండి, మేం వెనకనించి వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాం," అని తనే వాళ్ళని ప్రోత్సహించి పంపాడు. నిజానికి వాళ్ళబళ్ళన్నీ కొత్తవి; చురుకుగా ముందుకి సాగిపోయినయి.

ఇప్పుడు తను చిక్కులో పడ్డాడు. సరైనదారిని బడి పోతున్నా బాగుండును. ముందువెళ్లిన వాళ్ల జాడలైనా కనిపిస్తూ ఉండేవి. తన చిరకాలప్రియమిత్రుడు హాన్సోల్సా, ఆయన భార్య ఉన్నారు. అమెరికాలో పుట్టి అమెరికాని గురించి తనకన్న బాగా తెలిసిన సోలం యువకులు, టాన్ సైన్ దంపతులు, జెర్స్టీ ఉన్నారు. వాళ్లతోకూడా పోతే

నప్పుడు తనెందుకు బైలుదేరాలి ? మిన్నెసోటాలోనే ఉండి పోవలసింది. మనస్సంతా ఆందోళనగా వుంది. నిద్ర రావడం లేదు.

రాత్రి గడిచిపోయింది. పిల్లలకి తల్లికికూడా త్వరగానే నిద్రపట్టింది. పెర్వాంసా మెల్లమెల్లగా జరుగుతూ వచ్చి, లేచి బట్టలువేసుకున్నాడు. ఆ నిర్జన నిశీథంలోకి నడిచిపోతున్నాడు. ధ్రువనక్షత్రాన్ని బట్టి దారి గుర్తు పెట్టుకుంటూ అడవిలాగా కనిపించిన ఆ ఎత్తుగా దిబ్బలాగవున్న ప్రాంతంవైపుగా చకచకా నడుస్తున్నాడు. ఆత్రంగా గడ్డి మేస్తున్న ఆవుని, ఎడ్లను దాటిపోయాడు. క్షణం ఆగకుండా చకచకానడిచి చివరికి ఆ అడవిదగ్గిరికి చేరుకున్నాడు. అక్కడికి వెళ్ళేసరికి తనబళ్ళు కనుచూపుమేరలో ఎక్కడా కనిపించటం లేదు. తల ఎత్తి ధ్రువనక్షత్రంవేపుచూసి మళ్ళా వెనక్కిపోవడానికి దారిగుర్తుపెట్టుకున్నాడు. అప్పటికి తాను సుమారు నాలుగుమైళ్ళు నడిచిఉంటాడు.

ఆ అడవినిబడి ఈ కొసనించి ఆ కొసదాకా నడిచాడు—పెర్వాంసా, జాగ్రత్తగా చుట్టూ చూసుకుంటూ, ప్రతిశబ్దం వింటూ, నేలమీాదకు వంగి చూసుకుంటూ. ఎక్కడా ఏమీా కనిపించలేదు, చాలాసేపటివరకు. తర్వాత విశాలంగా, అడవి నరికి శుభ్రంచేసినట్టుఉన్న ఒకచోటికి చేరుకున్నాడు. కొన్నాళ్ళక్రితం అక్కడ ఎవరో నిప్పుముట్టించి వంటచేసుకున్న జాడలు కనిపించినయి. కొత్తబూడిదవాసనే

వస్తోంది. పట్టరాని ఆనందంతో పెర్హాంసా కేకలు పెట్టాడు. తన మిత్రులు ఆ దారినే వెళ్లారని ధ్రువపరుచుకున్నాడు.

మర్నాడు ఉదయం మళ్లీ అనవసర కాలయాపన కాకుండా స్ప్లిట్ రాక్ యేరునుకూడా అప్పుడే చూసిపోవా లనుకున్నాడు. ఆట్టే కష్టపడకుండానే అదీ కనిపించింది. వాళ్లు తనతో చెప్పిన ప్రకారం ఆ యేటిని ఎక్కడ దాటిందీ కూడా చూసుకున్నాడు. ఇంతలో ఆ యేటిఒడ్డున, పెర్హాం సాకి ఆశ్చర్యకరమైన వస్తువేదో కనిపించింది. వంగి దాన్ని తీశాడు. సంశయంలేదు—అది, హాన్స్ ఓల్సా తెచ్చుకున్న ఎండబెట్టిన మాంసపుకాళ్లలో ఒకటి. ఎంత మంచివాడు ఓల్సా! తనకోసం, కావాలని దాన్ని అక్కడ వదిలివెళ్లాడు.

మళ్లీ బళ్లదగ్గిరికి తిరిగి వెళ్లేటప్పుడు పెర్హాంసా మెల్ల గానే నడిచివెళ్లాడు. అతని సంతోషం సంతోషం కాదు. అన్నీ తనకు అనుకూలంగానే పరిణమిస్తున్నాయి. పోతే, తన బండీ మళ్లీ కూలబడకుండా ఉండాలి, అంతే. ఇక, అది ఆట్టే మన్నదు. తీరా పెర్హాంసా, తిరిగి తన బళ్లసమీపానికి వచ్చేసరికి, మళ్లీ ఆందోళన ప్రారంభం అయింది. అక్కడ చీకట్లో ఎవరో కూచుని ఉండటం చూశాడు.

"బెరెట్! అర్ధరాత్రి ఏమిటి అలా కూచున్నావ్?" ఆమె మేలుకుని ఉండటం అతణ్ణి కంగారు పెట్టింది.

"మీరు వెళ్లాక, ఇక అక్కడ పడుకోలేకపోయాను," మెల్లగా నీరసంగా అంది. ఆమె చాలాసేపట్నించి అలా

కూచుని ఏడుస్తూన్నట్టు గ్రహించాడు. పెర్హ్యాంసాకి కూడా దుఃఖం పొంగి వచ్చింది. కాని తమాయించుకున్నాడు. సాధారణ స్వరంతో అన్నాడు—"నువ్వు మేలుకుని కూచున్నావా? పైగా, నీకు నిద్ర బాగా అవసరం ఇప్పుడు."

"మీరు ఆందోళనపడుతూండటం చూస్తూ, నా కెలా నిద్రపడుతుంది? మీరు నా కేమీ చెప్పరు. అసలు నాకు తెలుసు, దీనంతటికి కారణం..." వెక్కి-వెక్కి ఏడుస్తూ పెర్హ్యాంసామీదికి వాలిపోయింది.

ఏదో మాట్లాడటానికి ప్రయత్నించాడు పెర్హ్యాంసా. కొంతసేపటివరకు ఏమీ మాట్లాడలేకపోయాడు. చివరికి, "ఇక నువ్వు ఓర్పుతో ఉండాలి. ఇదుగో చూడు, మన ఓలా తెచ్చుకున్న ఎండుమాంసపు కాలొకటి నాకు దొరికింది." అని చూపించాడు.

---

## రెండవ భాగము

### ౧

ఆ మైదానంలో ఒక కొండ చరియమీద, ఒకవాగు ప్రక్కనహాన్సబిల్సా అడుసుతో మట్టిఇల్లు కడుతున్నాడు. సగం లేచింది ఇల్లు. ఇల్లుపూర్తిచేయడానికి అవసరమైన మట్టి పక్కనసిద్ధంగాఉంది. హాన్స్భారీమనిషి. సాధారణంగా చాలా చురుగ్గా పనిచేయగలడు. కాని, ఈవేళ మెల్లగా పనిచేస్తున్నాడు. మధ్యమధ్య పూర్తిగా పని ఆపేసి, ఆ నిర్జన మైదానంలోకి నాలుగు వేపులా దేనికోసమో, ఆదుర్దాగా చూస్తున్నాడు. ఎన్నిసార్లో అలా చూశాడు. ఏమీ కనిపించి నట్లు లేదు. ఆ విధంగా వ్యర్థం చేసినకాలాన్ని కూడ దీసు కుంటానికి మళ్లీచురుగ్గా పని ప్రారంభించాడు. ఆకడుతూన్న యింటికి అవతలివైపున ఒకగుడారం ఉంది. దానిపక్కన ఒకపెట్టెబండి నిలబడిఉంది. నేలమీద ఒకకుంపటి, కొన్ని కుర్చీలు చిన్నచిన్న క్రమాను ఉన్నాయి. నిశ్చింతగా, ఆనందంగా కనిపిస్తూన్న ఒకస్త్రీ కూనురాగాలుతీస్తూ వంట

చేస్తూంది. సుమారు పది హేను, పదహారేళ్లు వయస్సుగల ఆడపిల్ల సోఫీ ఆమెకి అవీఇవీ అందిస్తూంది.

ఈ ఇళ్లకి కొంచెందూరంలో మరోగుట్టమీాద పూర్తిగా కట్టిన ఇంకోమట్టి యిల్లు ఉంది. దానిపైన పొగ గొట్టంలోంచి సన్నగా పొగపైకి లేస్తూంది. అదిసైవెర్ట్ టాన్సెటెన్ కట్టుకున్న ఇల్లు. ఉత్తరపు వేపున ఉన్నమరో పెద్దగుట్టమీాద ఇంకో రెండుమట్టి ఇళ్లు లేస్తున్నయి. సోలం యువకులు కట్టుకుంటున్నారవి. స్ప్రింగ్ క్రీక్ ఒడ్డున కొత్తగా వెలుస్తూన్న ఆ వలసపల్లెలో అప్పటికి లేచిన ఇళ్లు అవే.

ఆ స్త్రీ వంట అయిందని, భర్తని హెచ్చరించింది. ఆయన వస్తూ దారిలో ఒక్కనిమిషం నిలబడి, ఆవిశాలమైదానం అంతా మళ్లీ ఓసారి పార చూశాడు. ఆయనకి ఏమీా కనిపించలేదు.

గుడారం బయటికి బాగానే ఉంది. లోపల మాత్రం బాగా వేడిగాఉంది. తీక్ష్ణమైన ఎండలోపలికి దూసుకొస్తూంది. ఓల్సాకుటుంబానికి చెందిన కుర్చీలు బల్లలువగైరా లోపల అందంగా అమర్చి ఉండటంవల్ల గృహ వాతావరణం కనిపిస్తూంది. భార్య సిద్ధంగా పెట్టిన చెంబులో నీళ్లతో చేతులు, ముఖం కడుక్కున్నాడు హాన్సోల్సా. తరువాత వచ్చి బయటే కిందకూచున్నాడు భోజనానికి. గుడారంలోకన్న బయటే హాయిగా, చల్లగాఉంది.

"వాళ్ల జాడేమీ కనిపించలేదండీ?" భార్య అడిగింది.

"లేదు—ఇంతవరకు ఏం కనపడలేదు."

"మరి వాళ్లు ఏమయినట్టు?"

"ఏమోనాకు మాత్రం ఏం తెలుసు?" భర్త ఆందోళనపడతున్నాడని గ్రహించింది. ఆమె మరిమాట్లాడలేదు. ఆమె మాత్రం ఉత్సాహంగానే ఉంది. ఎందుకో, పెర్హాంసా కుటుంబంకూడా త్వరలోనే అక్కడికి చేరుకుంటారని తనికి అనిపిస్తూంది. ఆయన ఆందోళన పడుతూనే ఉన్నాడు. మాటా పలుకూ లేకుండా భోజనంచేసి లేచాడు. వెంటనేమళ్ళీ, తానుకడుతూన్న మట్టి యింటికి వెళ్లికూచుని, తదేకదీక్షగా తూర్పుదిశగా చూస్తున్నాడు. "పెర్హాంసా ఏమయినట్టు?" తనను తానే ప్రశ్నించుకున్నాడు.

ఆయన అక్కడ కూచుని చూస్తూండటం భార్య చూసింది. వెంటనే అక్కడికివచ్చి "ఏమండీ! పోనీ మీరలా కొంతదూరం వెళ్లి వాళ్ల జాడ ఏమైనా కనిపిస్తుందేమో చూసి రాకూడదూ?"

"ఎక్కడని చూడను? ఈ మైదానానికి ఎక్కడైనా అంతు పంతు ఉంటేనా! ఏమీ ప్రయోజనంలేదు," అంటూ లేచి నుంచున్నాడు.

"కావచ్చు కాని. మనం ఏదో ప్రయత్నం చేస్తూంటే మనస్సుకు ఆందోళన ఉండదు."

హాన్సబీల్సా అటువైపే చూస్తున్నాడు. పెర్షాంసా తెలివైనవాడు. మనం ఇక్కడికి చేరి ఐదురోజులయింది కద, ఈ సరికి వాళ్లుకూడా ఇక్కడికిచేరి ఉండవలసింది. దారి తప్పి మనల్ని దాటి ఇంకా పడమటికి వెళ్ళి పోయాడేమో అని అనుమానం. భారంగా, దిగులుగా మళ్ళీ కూచున్నాడు. భార్యకూడా కూచుంది, అలాగే మౌనంగా.

"పాపం! బెరెట్ ఆస్థితిలో పిల్లల్తో ఏం అవస్థపడుతూందో!—ఓపలేని మనిషి చూడండి. అంచేత మెల్లగా వస్తున్నారేమో!"

ఇంతలో బొద్దుగా పొట్టిగా ఉన్న ఎర్రగడ్డపు మనిషి దక్షిణపు వేపునఉన్న యింటినుంచి మెల్లగా తమగుట్ట ఎక్కి వస్తూండటం ఆమె చూసింది. ఈయన ఆప్రక్కన మట్టి ఇల్లు కట్టుకున్నటాన్సెటెన్. మంచి కబుర్లరాయుడు. హాన్స బీల్సాకూడా అతణ్ణి చూశాడు.

టాన్సెటెన్ వాళ్లకు అభివాదాలు తెలపకుండానే, "ఇంకా వాళ్లు కనిపించలేదా?" అని ప్రశ్నించాడు.

"నీకు కనిపించారా?"

"నాకా? అవును. ఆమాటే చెప్పటానికి వచ్చాను. వాళ్లు ఈవేపు వస్తూండటం ఇప్పటికి గంట సేపటినించి నేను చూస్తున్నాను. ఇక పదినిమిషాల్లో వాళ్లు ఇక్కడ ఉంటారు."

ఈ మాటలు వాళ్ళకి అమితానందం కలిగించాయి. "ఎక్కడ, ఎటు వస్తున్నారు?" భార్య భర్త ఒకేసారి అడిగారు.

"అదుగో కాస్త అలావచ్చి, పడమటి దిక్కుగా చూడండి, కనపడ్తారు. పెర్హాంసా కొంచెం దారితప్పినట్టున్నాడు."

హాన్స్ఓల్సా, ఆయనభార్య కళ్లారా చూస్తూకూడా నమ్మలేక పోయారు. మైదానంలో వాళ్లబళ్లు తమవైపే వచ్చేస్తున్నాయి. ఆ ఆనందంలో వాళ్లేమీ మాట్లాడలేక పోయారు. భార్యగబగబా వెనక్కివెళ్లి పోయింది, వాళ్లకి కాఫీచేసి, తమగుడారంలో ఉన్న ఆహారపదార్థల్లో మంచి మంచి వన్నీతీసి వాళ్లకోసం తయారుగా ఉంచడానికి. హాన్స్ఓల్సా పరమానందంతో వెళ్లిపోయి, ఇంటిపని అమితవేగంగా చేసేస్తున్నాడు. టాన్సెటెన్ ఆయనకి సాయం చేస్తున్నాడు.

మరికొంతసేపటికి బళ్లు బాగా దగ్గిరికి వచ్చేశాయి. పెర్హాంసా ముందు నడిచివస్తున్నాడు. చిన్నకుర్రాడు హాన్స్ ఆయన వెనుకనడుస్తున్నాడు. ఓల్ పెద్దబండి తోలుతున్నాడు బెరెట్, పసిపిల్ల అన్నామేరీ బండీలో కూచున్నారు. వాళ్లకి స్వాగత మివ్వడానికి ఔత్సుక్యంతో, అటేచూస్తు నిలబడి ఉన్నారు ఆ వలసలోని మిత్రులంతా. క్రమంగా వాళ్లు దగ్గరగా వస్తున్నారు.

"మొత్తానికి, ఎలాగో మళ్లీ మాలో కలిశారు!" అత్యుత్సాహంగా నవ్వుతున్నాడు హాన్స్ ఓల్సా. పెర్హాం సాతో ఆయన కరచాలనం చేశాడు. ఎంతకీ మిత్రుడి చేయి విడిచి పెట్టడంలేదు.

"అయినా, ఏమంత కష్టపడలేదు. మీరు వచ్చిన దారి ఉందిగదా? సూక్స్‌ఫాల్స్ (జలపాతం) దిక్కుగా పడమటికి కొంచెం ఎక్కువదూరం వెళ్లిపోయాం. అంతే,"— అంటూ చిరునవ్వునవ్వుతూ, చుట్టూచూసి, "అయితే, ఇదన్న మాట మనవలస! బాగుంది, అద్భుతంగాఉంది," అన్నాడు పెర్హాంసా.

బెరెట్, చిన్నపిల్లతో పెట్టెబండిలోంచి దిగింది. బెరెట్ తక్కిన వాళ్లతో కలవలేదు. కొంచెం వెనగ్గానుంచుంది. ఇక్కడన్నమాట ఇక తమజీవనం! ఆమెనమ్మలేకపోతూంది. ఇక్కడ ఏదో పెద్దఘోరం జరుగుతుందని ఎందుకో ఆమెకి హఠాత్తుగాగట్టి అనుమానం ఏర్పడింది. సంతోషంగా కనబడటం ఆమెకు సాధ్యంకాలేదు. మిగిలిన వాళ్లంతా అంత ఆహ్లాదంగా కనబడుతూండటంచూసి, తాను కన్నీళ్లు మాత్రం ఆపుచేసుకుంది. చివరికి, మిగిలిన ఆడవాళ్లతో కలిసి గుడారంలోకి వెళ్లింది. వాళ్లు ఆమెను విశ్రాంతి తీసుకోమనీ బట్టలుమార్చుకోమనీ చెప్పి, స్నానం చేయడానికి ఆమెను ఒంటరిగా విడిచి వచ్చేశారు.

పిల్లాజెల్లాతో అక్కడఉండి పోవటమనేమాట బెరెట్‌కి తలవరాని తలపుగా ఉంది. తాను ఎలా ఉండగలదు? ఇక్కడ

ఎవరుగాని తలదాచుకునేందుకూ్కడా ఏమీలేదు. మిగిలిన వాళ్ళందరు ఎలా ఒడబడ్డారో ఆమెకి అర్థం కావడం లేదు.

బయట మగవాళ్ళంతా కూచుని, అక్కడ భూమీ పుత్రునిగురించి కబుర్లాడుకుంటున్నారు. హాన్స ఓల్సా తన భూమి పక్కభూమిని పెర్హాంసాకి మంజూరు చెయ్యాలని తనే దరఖాస్తు పెట్టినట్టు చెప్పాడు. పెర్హాంసా అంతకన్న మంచి భూమి చూసుకుంటే, ఈదరఖాస్తు వదులుకోవచ్చు. ఈభూమి మంజూరు చేయించుకుంటే ఇద్దరూ ఇరుగు పొరుగున ఉండొచ్చు. తన విషయంలో హాన్స ఓల్సా ఎంత శ్రద్ధ తీసుకుంటున్నదీ గ్రహించి, పెర్హాంసా అమితానందం పొందాడు.

మరికొంతసేపటికి వాళ్ళంతా మధ్యపరిచిన తెల్లటి దుప్పటి చుట్టూకూచుని, భోజనం చేస్తున్నారు. ఎండబెట్టిన ఒక కాలుమాంసం, రొట్టె, వెన్న, మీగడ, పెద్దగిన్నెనిండా తియ్యనిపాలు. కుంపటిమీది కాఫీ కమ్మటివాసన. తృప్తిగా మృష్టాన్నభోజనం చేస్తున్నారు. మనసారా నవ్వుతూ కబుర్లాడుకుంటున్నారు. తర్వాత హాన్సఓల్సా భార్య సొరీనా ఒక విస్కీసీసా, చిన్నగ్లాసూ తీసుకొచ్చి మగవాళ్ళిద్దరికీ రవంత పానీయంకూడా ఇచ్చింది.

హాన్సఓల్సా తాను భోజనంచేసినప్పటి మౌనవ్రతం వదిలేశాడు. ఇప్పుడాయన నవ్వులో మిగిలినవాళ్ల నవ్వులేవీ వినిపించటంలేదు. ఆయన సంతోషంతో ఊగులాడి పోతున్నాడు. మాటిమాటికీ పెర్హాంసాను చూస్తున్నాడు. పెర్హాంసా మరోమాంసం ముక్కకోస్తూ, హాన్సఓల్సావంక చూసి

నవ్వుతూ, "నువ్వుపట్టుకొచ్చిన ఆహార సామగ్రంతా భద్రంగా ఇక్కడికి చేరినట్టేనా?" అని అడిగాడు.

హాన్సబిల్సా కొంచెం నిదానించి, జవాబు చెప్పాడు. "ఆ వచ్చినట్టేలే. ఒక్క ఎండుమాంసం కాలు కావాల్సి మైదానంలో ఎక్కడో జారిపోయినట్టుంది."

ఆ ఎండుమాంసం కాలు, ఓల్సా అనుకున్నట్టు తనకే దొరికిందని ప్రశంసా చెప్పేశాడు, హాన్సబిల్సా గడుసుతనం తాను గ్రహించక పోలేదన్నట్టు. తనపట్ల ఓల్సా స్నేహ భావానికి ప్రశంసా కృతజ్ఞతకు మేరలేదు. వాళ్లంతా స్నేహితులు, పరస్పరం అలా సాయంచేసుకోనడం అవసరమే!

౨

సాయంకాలందాకా వాళ్లేవో మంచీ చెడ్డా మాట్లాడుకుంటూ అలాగే కూచున్నారు. కొంతసేపు, ముఖ్యమైన విషయాలమీద చర్చసాగింది. ఈవలసను ఎలా వాసయోగ్యంగా చేయవలసిందీ, ఏ యే పంటలు పండించవలసిందీ, ఈ చిన్నవలసపల్లె క్రమంగా ఎలాపెరిగి పెద్దదయేదీ చర్చించారు. ఇక చీకటి పడుతూందనగా, కబుర్లు కట్టిపెట్టి, అస్తమిస్తూన్న సూర్యుడికేసి చూస్తూకూచున్నారు. ఆదీ అంతూకనిపించని ఆమైదానంలో, అంతకన్న అనంతంగా కనిపించే ఆ విశాల నీలాకాశంక్రింద తమ అకించనతనుగురించిన దైన్యం మళ్లీ వాళ్ల నావహించింది. చుట్టూ అపారనీరవ వాతావరణం. వాళ్లు భయపడుతున్నారని కాదు. కాని, అంతా

సుముఖంగా ఉంటుందనే ధీమా వాళ్లకు అంతగా లేదు. ఏం జరిగినా జరగవచ్చు. తోటిజనం ఎక్కడో దూరాన ఉన్నారు. అయితే, అకస్మాత్తుగా తనలో రేగిన ఈ నిర్వేదాన్ని మిగిలిన వారికి వ్యక్తం చేయడంమాత్రం అందులో ఎవ్వరికీ ఇష్టంలేదు.

చివరికి పెర్హాంసా, తటాలున లేచాడు. ఈ విజనభూమిలో తమ ప్రవాసాన్ని గురించి తనకు గల అనుమానమే భర్తకు కూడా ఉన్నట్లు ఆయనభార్య పసికట్టింది. కాని, మిగిలిన వాళ్లందరినీ మళ్లీ ఉత్సాహపరచాలని పెర్హాంసా ప్రయత్నం. "ఇక మనం లేద్దాం. మా కొత్తభూమి మాకు చూపించండి మరి!" అన్నాడు. మగవాళ్లంతా పెర్హాంసాకు తప్పకుండా నచ్చుతుందని హాల్సఓల్సా నిర్ణయించిన భూమి చూసిరావడానికి బయలుదేరారు. "నువ్వు ఈ భూమే తీసుకోవలసిన అవసరమేమీ లేదు,"అని ఓల్సా మళ్లీ చెప్పాడు. "ఈ భూమి నీకు నచ్చితేమాత్రం నువ్వు వెంటనే సూక్స ఫాల్సకి వెళ్లి, ఇంకోళ్లెవరూ ఈ గడ్డ కాశపడకముందే, సంతకాలు పూర్తిచేసుకురావాలి."

అన్నీ తనకు అంత అనుకూలంగా కలిసివస్తూండటం పెర్హాంసా నమ్మలేక పోతున్నాడు. అతిసారవంతమైన ఇంత పెద్దక్షేత్రం తనసొంతం అయిపోతుంది. తన ఆప్త మిత్రులు తన పొరుగున ఉంటారు. జీవితంలో తనకు పెద్ద అదృష్టంపట్ట బోతూంది ఇక! తన భూమంతా చక్కగా మెరకన ఉంది. పక్కన నీటివనరు ఉంది. చక్కని వ్యవసాయక్షేత్రం లాగ కనిపిస్తూంది.

హాన్స్ ఓల్సా యింటికి వీలయినంత దగ్గరగా తనుయిల్లు కట్టాలి. ఆడవాళ్లు తరుచువస్తూ పోతూండటానికి వీలుగా ఉండాలి. ఈ మాటలు అనుకున్న క్షణంలో పెర్హాంసా కొత్త మనిషి అయిపోయాడు. ఇంత భూమి తన సొంతం అవుతుంది! తాను దున్నుకుంటాడు. ఇష్టంవచ్చిన పంటలు పండించు కుంటాడు, ఎవరికి మాత్రం నమ్మడానికి శక్యమా యిది?

## 3

ఆ భూమిని తనపేర రాయించుకోటానికి మర్నాడే బయలుదేరి సూక్స్‌ఫాల్స్ వెళ్లాడు పెర్హాంసా. ఆయన వెళ్ల గానే, బెరెట్ తమకొత్తకాపరానికి అన్నీ సిద్ధంచేసి పెట్టటం ప్రారంభించింది. తాము అక్కడే ఉండి పోతామని మాత్రం ఆవిడ ఇప్పటికీ అనుకోటంలేదు. మహాఉంటే ఆ వేసవిపొడు గునా అక్కడ ఉంటారేమో. ఆ తర్వాతమళ్లీ తూర్పుకి ప్రయాణంకట్టాల్సిందే. అదే ఆమె మనసులో ఆశ. ఇక్కడ ఈ అడవిబ్రతుకు దుర్భరం. తలదాచుకునేందుకు కూడా ఇక్కడ ఏమీలేదనేమాటే ఆమె మాటి మాటికి అనుకుం టూంది.

పిల్లలకి అక్కడ సరదాగానే ఉంది. అన్నీ సర్దటం లాంటిపనులు ఉత్సాహంగా చేస్తున్నారు. బళ్లలో సామాను చాలాభాగం వాళ్లే క్రిందికి దింపారు. కొత్తయిల్లు కట్టుకునే వరకు ఆ బండీనే పడకగదిగా వాడుకుంటానికి వీలుగా సర్దారు. ఇప్పుడు అది చాలా బాగుంది. బెరట్ మనసుమాత్రం ఏమిటా

మారలేదు. ఆమె ముఖంలో విషాదరేఖ చెక్కు-చెదరకుండా అలానేఉంది. ఒకనాడు సాయంకాలం ఆమె తన భూమిలో ఉన్న గుట్టకొనపైకి వెళ్లి చుట్టుపట్ల ప్రదేశమంతా చూసింది. ఆ దృశ్యాలు ఎంతో అందంగా ఉన్నయి. దాంతో, తనకి ఎంతో యిష్టమైన సముద్రదృశ్యాలు జ్ఞాపకం వచ్చినయి.

ఆసముద్రానికి, ఈ భూమికి ఎక్కడా పోలికలేదు. ఇక్కడ అంతాభయంకర నిశ్శబ్దంగా,—అసహజంగా కనిపిస్తూంది. పక్షుల కలకలలు లేవు. ఎగిరేపురుగులైనా కనిపించడం లేదు. ఇక్కడ అవేవీ అసలుబ్రతకవేమో, అని బెరెట్ అనుమానం. పిల్లలంతా కులాసాగా ఆడుకుంటున్నారు. చూసింది. మళ్లీ ఆమె ఆలోచనలు, తాము మళ్లీ తూర్పుకి దీర్ఘయాత్రచేసి వెళ్లి ప్రజల్లో పడటంమీదికి మళ్లినయి. ఇక ఇక్కడే ఉండి పోవాలేమో అనేభయం తప్ప నిజానికి ఆమెకు పెద్ద కష్టమేమీ లేదు. పుట్టబోయే తనబిడ్డకి ఈ నిర్జనారణ్యమా జన్మభూమి! వీల్లేదు.

చీకటిపడిన కొద్ది ఆమైదానంలోకి చూస్తూంటే ఆమెకి భయమేస్తూంది. వెల్లికిలా పడుకుని ఆకాశంకేసి చూసింది. అదీ నీలంగా, నిరామయంగా కనిపిస్తూంది. ఈ భూమ్యాకాశాలమధ్య తాను ఏకాకి—అనే దుస్సహాభావనతో ఎక్కడలేని దిగులు ఆమెను కుంగదీస్తూంది.

నార్వేనించి బయలుదేరి అప్పుడే చాలాకాలం అయింది. అప్పటినించి జరిగిన కథంతా ఆమె కళ్లముందు దాడుతూంది. ఆ అంతులేని సముద్రంమీద నెలలతరబడి,—ఇక

రోజులు లెక్క పెట్టడం కూడా అసాధ్య మయేటంత కాలం–ఆ ప్రయాణం, అంత వింతగా ఉన్న ఒక నగరంలో దిగటం!– పోనీ అక్కడితో అయినా ఆ యాత్ర అంతమయిందా? అక్కణ్ణించి పడమటి దిక్కుగా మళ్లీ ఎడతెగని యాత్ర. ఎక్కడా ఆగడం, అలుపుదీర్చుకోడం అనేది లేకుండా, అంతా ప్రయాణమే లాగ అనిపిస్తూంది. ఎప్పటికప్పుడు, "ఇక నేనీ ప్రయాణం చేయలేను, అని స్పష్టంగా చెప్పేద్దా మనుకునేది. అనుకుంటూనే, అలా ప్రయాణం సాగిపోతూండేది. చివరికి మిన్నెసోటా చేరారు. అక్కడ కూడా వాళ్లు ఆట్టే రోజులు ఉన్నది లేదు. ఆఖరికి ఇక్కడికి చేరుకున్నారు. స్వదేశం. ఇక మళ్లీ కళ్లబడదు. ఆమెకి ఒక్కసారిగా వార్ధక్యం వచ్చి, పైబడ్డట్టనిపించింది.

ఇంక వచ్చేయమని పిల్లలిని మెల్లగా పిలిచింది. "మళ్లీ రేపువచ్చి ఆడుకుందురుగాని," అంది. వాళ్ళంతా చీకటి రాత్రిని వెంటబెట్టుకుని మళ్లీ బళ్లదగ్గిరికి చేరారు. చుట్టూ అంతా నిశ్శబ్దం.

ఆ మర్నాడు పెర్హాంసా తిరిగి వచ్చాడు. బెరెట్టూ, పిల్లలంతా కలిసి చేసిన పని చూసి సంతోషించాడు. అంతా తనకు అనుకూలంగానే కనిపిస్తూండటంతో, అమితోత్సాహంలో ఉన్నాడు. ఎక్కడా ఆగకుండా మాట్లాడేస్తున్నాడు. ఇక తనను అడ్డుకోనగలిగేది ఏమీలేదు. ఆ భూమి తన పేర వ్రాయించి తెచ్చుకొన్న దస్తావేజు బెరెట్ కి ఇచ్చి, జాగ్రత్తగా దాయమన్నాడు. "కావాలన్నంతమాత్రాన,-చక్కగా

వ్యవసాయంచేసుకుంటూ నన్నంతమాత్రాన ఇంత భూమి ఒక మనిషికి రాసిచ్చేశారు. ఎంత చిత్రం! ఏమి అద్భుతమైన దేశం!'' అనుకున్నాడు.

భర్తకి ఇప్పుడు తను ఏం చెప్పినా ప్రయోజనం లేదు. భవిష్యత్తుని గురించిన ఊహల్లో ఉయ్యాలలూగిపోతూన్న ఆయనకి ఇప్పుడు తను ఏం చెప్పినా అసలు వినిపించదు. అయినా, తన ముఖంలో దిగులు గీతలు చెరుపుకోనడం మాత్రం తనశక్తికి మించినపని. ఎలాగైనా ఆమెకు ఉత్సాహం కలిగించాలని ప్రయత్నించాడు పెర్హాంసా.

''నిన్న ఆదస్తావేజు చేతికి రాగానే నాకో అద్భుతమైన ఉపాయం తట్టింది. వెంటనే వెళ్లి పదిబస్తాలబంగాళదుంపలు కొనేశాను. మిగిలినవాళ్లలాగ ముందు ఇల్లుకట్టుకోడం కాదు మనం చేసేపని. రేపుపొద్దున్నే మొదలుపెట్టి, ఈ బంగాళ దుంపలచేను వేద్దాం. సెప్టెంబరునాటికి పంట చేతికొస్తుంది. ఈ వేసవిలోనే, కొన్నాళ్లుపోయాక, తీరుబడిగా ఇల్లు కట్టు కోవచ్చు.''

పెర్హాంసాకి ఆరాత్రి నిద్రపట్టలేదు. ముందు ముందు తాను చేయవలసినపనులతో, ఉపాయాలతో, ఊహలతో ఆయన తల బరువెక్కిపోయింది. మొదట కొన్నాళ్లు ఇక్కడ జీవితం చాలా కష్టంగానే ఉంటుంది. కాని, చివరికి ఎంతో బాగుంటుంది. తెల్లటిగోడలు, మధ్య మధ్య ఆకుపచ్చరేఖ లతో తను పెద్ద ఇల్లు కడతాడు. పెద్ద గాదె ఒకటి కట్టాలి.

గాదెకి తెలుపు, ఎరుపురంగులు అయితే బాగుంటుంది. తన కుటుంబానికి అప్పుడిక లేందేమిటి!

మర్నాడు తెల్లవారుజామునే లేచి నాగలికోసం హాన్సబిల్సా ఇంటికి వెళ్ళాడు పెర్హాంసా. తన ఎడ్లను ఆ నాగలికి కట్టి దున్నడం మొదలుపెట్టాడు. ఆ వలసలో అంతా ఇంకా నిద్రపోతున్నారు. పెర్హాంసా ఒక్కడే మేల్కొని పని చేస్తున్నాడు. అంతా బలమే అయిన ఆ నేలలో కొంత మేర దున్నేశాడు. తర్వాత పారతీసుకుని గడ్డ తిరగేశాడు. అందులో ఇంటిగోడలకు పనికివచ్చే గడ్డివేళ్ళతో కూడిన మట్టిపెళ్లలు ఏరి వేరుగా పోగుపెట్టాడు. రెండు పనులు ఒకేసారిగా జరుగుతున్నాయి. ఉదయభోజనంవేళకి పని ఆపి వెళ్లి, వెంటనే మళ్లీ కొడుకులిద్దర్నీ కూడా తీసుకువచ్చి పనిలో దిగాడు. ఏనాడూ నాగలికి ఎరగని గట్టినేల అవడం వల్ల, దుక్కిదున్నడం కష్టంగానే ఉంది. అయినా, తండ్రీ, ఇద్దరుకొడుకులూ మధ్యాహ్నభోజనంవేళదాకా క్షణం ఆగకుండా పనిచేశారు. అప్పటికి, ఇంటిగోడలకు ఒక బండెడు పెళ్లలు తయారయినయి. చాలా చాళ్లు దుక్కిదున్నడం అయింది. కాఫీవేళకి ఇంకో బండెడు పెళ్లలు, సాయంకాల భోజనంవేళకి మరో బండెడు పోగుపడినయి. మొదటిరోజునే పెర్హాంసా మొదట అనుకున్నదానికంటె చాలా ఎక్కువపని జరిగింది.

ఆ రోజు సాయంకాలమే ఇల్లు కట్టడం ప్రారంభించాడు. బెరెట్ వచ్చి కాస్త విశ్రాంతి తీసుకోమంది. పొలం దున్నే

వాడికి ఇల్లు కట్టడం విశ్రాంతే అన్నాడు పెర్హాంసా. వాళ్లందర్నీ వచ్చి తనకు సాయం చేయమన్నాడు. అందరూ కలిసి బాగా చీకటి పడేదాకా పనిచేశారు. తర్వాత సొమ్మసిల్లినట్టు, పడుకోగానే నిద్రపోయారు.

రోజూ ఉదయభోజనానికి ముందు, సాయంకాల భోజనం అయింతర్వాత ఇల్లుకట్టడం పనిచూస్తున్నాడు పెర్హాంసా. వేరే పనేమీ లేనప్పుడు పిల్లలూ, తల్లీకూడా వచ్చి సాయపడుతున్నారు. ఆ వలసలో మిగిలినవాళ్లందరికీ పెద్ద వింతగా ఉంది. పగళస్తమానం ఇంటిల్లపాదీ పొలం పని చేస్తున్నారు. అయినా, చకచకా ఇల్లుకూడా లేస్తూంది.

పెర్హాంసా రోజుమొత్తంమీద క్షణంకూచోకుండా పనిచేస్తున్నాడు. నిద్రపోవడంకూడా ఆయనకి ఇష్టంగా లేదు. జరుగుతూన్నపని మరింత ఉత్సాహం కలిగిస్తూంది. ఆ ఉత్సాహం ఆయనకి క్రొత్తశక్తినిఇస్తూంది. చివరికి బెరెట్ కూడా తాను చేయదగినపనికంటె చాలా ఎక్కువే చేస్తూంది. నిజానికి, అలాంటి భార్య దొరకటం తన అదృష్టం! చివరికి పెర్హాంసా దుక్కి చాలించాడు. ఇంటికి గోడలు లేచినయి. పూరిగడ్డి తెచ్చి కప్పువేయడమే తరువాయి. వలసలో మిగిలినవాళ్లు అప్పుడే ఇల్లుకప్పుకుని, దుక్కి ప్రారంభించారు. ఒకరోజు సాయంకాలం, పెర్హాంసా తాను దున్నినపొలంలో బంగాళదుంపలు నాటాడు. ముఖ్యమైన పని చాలాభాగం అయిపోయినట్టే అనుకున్నాడు.

బెరెట్ చాలా అలిసిపోయింది. పని చేసి చేసి ఆమెకి నడుం పట్టేసింది. అయినా, ఆమె ఏమీ అనకపోవడం మిగిలినవాళ్లకి ఆనందం కలిగించింది. పైగా, ఆరోజురాత్రి భోజనంలో వాళ్లందరికీ ఆమె కొంచెం కొంచెం వెన్న, పంచదారకూడా తీసి వేసింది. రోజంతా కష్టపడినందుకు వాళ్లకు ఆమె బహుమానం అది. భర్త, పిల్లలు ఆనందంగా కనపడుతూండటం ఆమెకి ఆనందం.

పెర్హాంసా ఇల్లు చూసి మిగిలినవాళ్లు ఆశ్చర్యపడ్డారు. అది మిగిలిన అన్నిఇళ్లకంటె పెద్దది. అందులో రెండు గదులు, మధ్య గోడా, రెండుతలుపులు ఉన్నాయి! ఇంత ఇంటికి కప్పువెయ్యడానికి వాసా లెక్కడ దొరుకుతయ్యన్నాడు టాన్సెటెన్. వెంటనే బయలుదేరి హాన్సఓల్సా ఇంటికి వెళ్లాడు టాన్సెటెన్. అంత ఇల్లువేయడం మంచిది కాదని ఆయనచేత పెర్హాంసాకి చెప్పించాలని, ఆతని ఆదుర్దా. "ఔను, పెర్హాంసా కుటుంబం పెద్దది, అతనికిపెద్ద ఇల్లే కావాలి," అనేశాడు ఓల్సా. సోలం యువకులు కూడా ఆ మాటే అన్నారు. అంచేత టాన్సెటెన్ తనలో తానే సణుక్కుంటూ ఊరుకున్నాడు. పెర్హాంసా తెలివైనవాడని తక్కినవాళ్లకి తెలుసు. అది అసలు సంగతి.

నిజానికి, పెర్హాంసా కడుతున్న ఇల్లంతా అతను ఉండటానికి కాదు. పశువుల పాకకూడా ఇంటితో కలసి ఒకేకప్పు కిందఉంటే బాగుంటుందని అలా వేశాడు. ఇతర దేశాల్లో ధనవంతులుకూడా కొందరు ఇలావేసుకుంటం ఆయన చూశాడు..

అలా వేసుకుంటే ఇంట్లోను, పశువులపాకలోనుకూడ వెచ్చ గాఉంటుంది. తనఆవు రోజీ, తమకు దగ్గరగా ఉంటుంది. పైగా, ఇంకా పశువులపాకమాట తలపెట్టని మిలిగిన వాళ్ల కంటె తాను ఒకఅడుగు ముందువేసినట్టూ అవుతుంది.

మొదట, దీనికి బెరెట్ ఒప్పుకోలేదు. మనుష్యులు, పశువులు ఒకే ఇంట్లో నివసించటం ఆమెకి మనస్కరించ లేదు. కాని, రోజీ ఎప్పుడూ తనకి దగ్గరగా ఉండటం మం చిదే అని చివరికి ఒప్పుకుంది. అంత మంచిభార్య దొరికినం దుకు పెర్హాంసా మరోసారి సంతోష పడ్డాడు.

౪

ఇంటికప్పుకి వాసాలు వగైరా తెచ్చుకోవాలి. దగ్గరలో దొరికే కలప చాలా సన్నగాఉంది. పైగా, అదీ తగినంత దొరికేటట్టులేదు. ముప్ఫయిమైళ్ల దూరంలో సూక్స్ నదికి అవతల కావలసినంత మంచికలప దొరుకుతుందని పెర్హాంసా విన్నాడు. అక్కడికి ప్రయాణం కట్టాడు. పైగా, అక్కడ ఇంకో వలసపల్లెఉంది. అందులో చాలామంది నార్వే దేశంలో మరోప్రాంతంనించి వచ్చినవాళ్లు. తాను ఎక్కడికి వెళుతున్నదీ హాన్స్ఓల్సాకి మాత్రమే చెప్పాడు పెర్హాంసా. మిగిలిన వాళ్లెవరికీ చెప్పలేదు. ఈ ప్రయాణం కనీ సం రెండురోజులు పడుతుంది.

చిన్నకొడుకు హాన్స్ నికూడా తనతో తీసుకు వెళ్లదలచు కున్నాడు పెర్హాంసా. ఓల్ పొలంపని చూడాలి. ఓల్ కి ఇది

ఇష్టంలేదు. తననికూడా తీసికెళితే బావుణ్ణు. హాన్స్ తనకంటె చిన్నవాడు. వాణ్ణి తీస్కెళ్ళడం ఎందుకు? కాని, లాభం లేదు. తనని తీసికెళ్ళడు తండ్రి. తండ్రితో వెళ్తున్న హాన్స్ తను పెద్దవాడయిపోయినట్టు సంతోషపడ్తూ, తనుచెయ్యగల పన్లన్నీ చెకచెకా చేసేస్తున్నాడు.

బెరెట్ కి ఈ ప్రయాణం ఇష్టంలేదు. మళ్ళీ తనుఒంటరిగా ఉండాలి. అయినా, భర్త వెళ్ళక తప్పదని ఆమెకి తెలుసు. తోచనప్పుడు ఓల్సావాళ్ళఇంటికి వెళ్ళి కూచుంటూ ఉండమని పెర్హాంసా అన్నాడు. తానువెళ్ళదలచుకోలేదు. వాళ్ళకోసం ఎదురుచూస్తూ ఇంట్లోనే కూచుంటుంది.

పాపం, ఆమె చాలాకాలం ఎదురుచూడాల్సి వచ్చింది. తొలినాటి రాత్రంతా ఎదురుచూస్తూనే కూచుంది. ఆరోజు వాళ్ళు రారని తెలిసినా, రెండోరాత్రి ఎదురు చూసింది. మూడోరోజు వచ్చింది. పెర్హాంసా రాలేదు. బెరెట్ బయలుదేరి హాన్స్ ఓల్సా ఇంటికి వెళ్ళింది. కంగారు పడొద్దని ఆయన ధైర్యంచెప్పాడు. శీతకాలానికి కట్టెలుకూడా కొట్టుకొని రావాలని పెర్హాంసా ఆగి ఉండొచ్చు. బెరెట్ ఆ విషయం ఇంతవరకు ఆలోచించలేదు. ఔను, శీతకాలానికి కట్టెలు జాగ్రత్త చేసుకోవలిసిందే.

ఆరోజు సాయంకాలానికి పెర్హాంసా తిరిగివచ్చాడు. బండీనిండా ఎద్దు లాగలేనంత కలప, కట్టె తెచ్చాడు. వాళ్ళకి ఎక్కీ తక్కీగా సరిపోయేటంత కట్టె వచ్చేసింది. అదికాక, తన ఇంటిచుట్టూ పాతడానికి ఆరు పండ్ల మొక్కలు తెచ్చాడు.

బండీ వెనుక రెండు నిండు బస్తాలుఉన్నాయి. అందులో చిత్రమైన వస్తువులు ఉన్నాయి. ఒక బస్తానిండా చేపలు, రెండో బస్తాలో ఒక అడవిదున్నదూడ శరీరం ఉంది. ఈదూడ ఎక్కడిదీ? కుర్రాడు హాన్స్ ఇక ఊరుకోలేక పోయాడు. "అదే నాన్న వేటాడిచంపిన అడవిదూడ," అన్నాడు.

పచ్చిచేపలు పాతపద్ధతిలో వండుకుని సాయంకాల భోజనం చేశారు. పెర్హాంసా స్నేహితులందరికి అమితోత్సాహం కలిగింది. వాళ్లుకూడా సూక్సనదికి పోయిరావాలని పించింది. కాని, ఏనాటికీ వాళ్లకి వ్యవధి దొరికేటట్టు కనిపించలేదు. ఆవలస అంతటిలో పెర్హాంసా ఇంటిచుట్టు మాత్రమే చెట్లు పెరుగుతున్నాయి.

అన్నింటికంటె ముఖ్యమైన సంగతి, సూక్సనది దగ్గఱ ఉన్న నార్వేదేశపు రైతులతో పెర్హాంసా స్నేహంచేసుకున్నాడు. ఈ వింతదేశంలో ఒకళ్లకొకళ్లు సహాయం చేసుకోవాలని వాళ్లుకూడా ఉత్సాహంగా అన్నారు.

౩

రోజులు గడిచిన కొద్దీవాళ్లు తెచ్చుకున్న ఆహారపదార్థాలు నిండుకుంటున్నాయి. అందరికంటె ఎక్కువ తెచ్చుకున్న హాల్స్ ఓల్సాకూడా కంగారు పడుతున్నాడు. పట్నంవెళ్లికొని తెచ్చుకోవాలి. ఎవరు వెళ్లాలి, ఏమేమి తెచ్చుకోవాలి, అన్నవిషయం అందరు కలిసికూచుని చర్చించాధు. ఆహార పదార్థాలు, వ్యవసాయ సామగ్రి, బట్టలుకూడా కావాలి.

పట్నం చాలాదూరం ఉంది. రెండురోజులు వెళ్లి, రెండురోజులు రావాలి. ఆడవాళ్లని పిల్లల్ని కనిపెట్టుకొని కొంతమంది మగవాళ్లు వలసలోఉండాలి. కాని, ఇందుకు ఎవరూ ఒప్పుకోటంలేదు. మళ్లీ అందరికీ భయంగానే ఉంది. దేశంకాని దేశం. క్రితంవారం ఒకతుపాను గాలికి హాన్స ఓల్సా గుడారం-లోపలున్న ఆయన భార్యతోసహా-కొట్టుకు పోయింది. ఆమె ఇప్పుడు కులాసాగానే ఉంది గాని, తుపాను పేరు చెబితే హడిలిపోతూంది. మిగిలిన వాళ్లకి రెడ్డిండియన్ల భయం. రెడ్డిండియన్లని గురించి నదిఒడ్డున నార్వే దేశీయులు పెర్హ్వాంసాకి చాలా సంగతులు చెప్పారు. అక్కడికి దగ్గర్లోనే రెడ్డిండియన్ల పల్లెలు కొన్నిఉన్నాయి. వాళ్లు ఏటేట పడమ టికి పోతూంటారు. ఆ రెడ్డిండియన్లు పడమటికి వెళ్లేటప్పుడు తమవలస మీాదుగానే వెళ్లాలనికూడా పెర్హ్వాంసాకి తెలుసు. అయినా పెర్హ్వాంసాకి వాళ్ల భయమేమీాలేదు.

చివరికి, పెర్హ్వాంసాని, హాన్ సోలంని వలసలో ఉంచి తక్కిన మగవాళ్లంతా పట్నానికి వెళ్లటానికి తీర్మానించారు. ఆ మిగిలిన వాళ్లు ముగ్గురికీ గుర్రాలు ఉన్నాయి. మూడుపెట్టె బళ్లు, మూడుగుర్రాలు,—వాళ్లు ఎన్నిసరుకులు కొన్నా భద్రంగా ఇంటికి జేర్చుకోవచ్చు. పెర్హ్వాంసాకి మనస్సు బాగుండలేదు. తనకి వెళ్లాలనిఉంది. ఎంతగాఉన్నదో... ఆయనే చెప్పలేడు. మిగిలిన వాళ్లంతా తనను చిన్నచూపు చూస్తున్నా రనుకొన్నాడు. వాళ్లంతా వెళ్లినరోజున ఆయన పెందరాడేలేచి, నాగలికట్టి ఎకరన్నర నేల—అంటే

ఇంత వరకెవ్వడూ దున్ననంత నేల దున్నేశాడు. దాంతో అతనికి కొంత మనస్స్వాస్థ్యం కల్గింది.

పెర్హాంసా ఎడతెగకుండా కష్టపడి పనిచేస్తున్నాడు. ఈపొలం దున్నడంతో, మిగిలిన వాళ్లందరిలో తనదే ముందడుగు అవుతూందనే భావం ఆయనకు బలం ఇస్తూంది. మరు నాడు పొలంనించి ఉల్లాసంగా ఇంటికి వస్తున్నాడు. చిన్న కొడుకు హాన్స అతనికి ఎదురుగా పరుగెత్తుకుంటూవచ్చి," "నాన్నా! నాన్నా! ఎవళ్లో వచ్చేస్తున్నారు!" అని కంగారుగా చెప్పాడు. మొదట పెర్హాంసా నమ్మలేదు, కాని తానే చూశాడు. ఒకపెద్దగుంపు మెల్లగా తమవలస వైపే వస్తూంది. "రెడ్డిండియన్లుట నాన్నా! రెడ్డిండియన్లు! అమ్మ చెప్పింది!" అన్నాడు మళ్లీ హాన్స.

త్వరగా ఇంటికిచేరుకోవాలని పెర్హాంసా చకచకా నడిచాడు. బెరెట్ చిన్నపిల్ల నెత్తుకొని నిలబడి ఆ వస్తూన్న వాళ్ల వేపేచూస్తూంది. ఆమె చాలావిచారంగా కనిపిస్తూంది. రెడ్డిండియన్లువచ్చి అందర్నీ చంపేస్తారని ఆమె అభిప్రాయం.

పెర్హాంసా ఆమెని వెళ్లి వంటపని చూసుకోమని పంపాడు. శామ్‌సోలంకికూడా ఈ విషయం చెప్పి రమ్మని హాన్సని పంపాడు. అవసరమైతే ఉంటుంది, తుపాకి తీసుకు రమ్మని ఓల్‌ని పంపాడు. ఆ వచ్చేవాళ్లని చూస్తూ తాను ఇల్లునేయడం మొదలుపెట్టాడు. వాళ్లు దగ్గిరికి వచ్చేస్తున్నారు. కాని వాళ్లు కుటుంబాలతోసహా ఆ మైదానంలో తిరుగుతూన్న రెడ్డిండియన్లేనని గ్రహించాడు. వాళ్లు తమని

చంపడానికి రావడంలేదు. పెర్హాంసా పెద్దగా నవ్వి, ఓల్‌ని. "తుపాకి తీసుకుపోయి మళ్లీ ఇంట్లోపెట్టేసి, సారీనాదగ్గిరికి వెళ్లి, రెడ్డిండియన్లు వస్తున్నారని చెప్పి, రావాలనుకుంటే. ఆమెనికూడా ఇక్కడికి రమ్మను," అని చెప్పి పంపాడు. ఓల్ పరిగెత్తాడు.

శామ్‌సోలం తుపాకి తీసుకుని పరుగెత్తుకొచ్చాడు. అతని ముఖమంతా భయంతో పాలిపోయినట్టుంది. పెర్హాంసా నవ్వి, "సరేగాని, ఆ తుపాకి అవతలపడేసి, నాయిల్లునేసుకుంటానికి సాయంచెయ్యి," అన్నాడు. ఇంతలో జెర్‌స్టీ కూడా ఆ రెడ్డిండియన్లని చూసి అక్కడికొచ్చింది, వాళ్ల ఆవునికూడా వెంటబెట్టుకుని. సారీనాకి వాళ్ల ఆవుసంగతి జ్ఞాపకంలేకపోయింది. వాళ్ల ఆవు ఇంటికి కొంచెందూరంలో మైదానంలో మేస్తూంది.

ఆడవాళ్లంతా హడిలిపోతూ ఒక గుంపుగా నిలబడ్డారు. ఒకళ్లకొకళ్లు ధైర్యం చెప్పుకొనడానికి ప్రయత్నిస్తున్నారు. బెరెట్‌మాత్రం ఏమీ మాట్లాడ్డంలేదు. వాళ్లు వచ్చి అందరినీ చంపేస్తారనే ఇప్పటికీ ఆమె భయం. ఈ నిర్జన మరుభూమిలో ఎంత దురంతం జరిగినా జరగొచ్చు. "మీరంతా వెళ్లి మీపన్లు చూసుకోండి. నాకాకలేస్తూంది!" అన్నాడు పెర్హాంసా.

రెడ్డిండియన్లు క్రమక్రమంగా దగ్గిరికి వచ్చేస్తూండటం వాళ్లంతా చూస్తున్నారు. చివరికి, వాళ్లు గుట్టకి అవతలి వేపున ఆగిపోయారు. ఇవతలివేపు పెర్హాంసా యిల్లుంది.

ఆగి, వాళ్ల గుర్రాలను మేతకు వదిలారు. వాళ్లెవరికీ హాని చేసేవాళ్లు కారు.

కాని, సారీనా ఆవు అంతదాకా తలవంచుకుని మేస్తూన్నదల్లా, ఒకసారి పెద్దగా అరిచి, పారిపోయింది. వెంటనే, మిగిలిన ఆవులుకూడా దాని వెంట బడినయి. అన్నీ ఆ రెడ్డిండియన్ల మకాంవేపే పరిగెత్తుతున్నయి. పడమటిదిక్కు-ప్రయాణం వాటికి బాగా అలవాటయిపోయింది. పోతూన్న బళ్లు ఏవి కనపడినా, వెంటనే ఆవులు వాటివేపు పరుగెత్తుతున్నయి. ఈసారి వీళ్లు ఆవుల్ని కట్టేయటం మరిచిపోయారు. ఆడవాళ్లంతా ఏడుపులు మొదలుపెట్టారు. ఇక ఇక్కడ ఎవరికీ పాలుండవు. అంతలో, బెరెట్ ఆ రెడ్డిండి యన్ల మకాంవేపు నడిచిపోతూంది. ఆవుల్ని తోలుకు రావ డానికి మగవాళ్లు వెళ్లకపోతే, తనైనా వెళ్లి ఆ ప్రయత్నం చెయ్యాలి మరి!

పెర్హాంసా ఆమెని ఆపుచేశాడు. "రాత్రి భోజనా లయినతర్వాత మగవాళ్లే వెళ్లి తోలుకొస్తారు," లెమ్మ న్నాడు. భోజనాలుచేస్తున్నంతసేపూ పెర్హాంసా రెడ్డిండి యన్లకబుర్లే చెపుతున్నాడు. "మీరే అందర్నీ హడల గొట్టేస్తున్నారు," అంది బెరెట్. ఆమె నలుగురిలో భర్తని మందలించడం అదే మొట్టమొదటిసారి. పెర్హాంసా మనస్సు నొచ్చుకుంది. ఆ సంగతి ఆయన ఎవరికీ తెలియనియ్యలేదు.

చివరికి పెర్హాంసా బయలుదేరాడు. చిన్నకుర్రాడు హాన్స్, "నాన్నా నేనూ వస్తా," నన్నాడు. "నువ్వెళ్లొద్దు.

వెనక్కి—రా!'' అని బెరెట్ కేకవేసింది. అయినా, పెర్హాంసా కొడుకు చెయ్యిపట్టుకుని తీసుకు వెళ్లిపోయాడు.

దార్లో హాన్స్ తండ్రిని ప్రశ్నలడగటం మొదలు పెట్టాడు. రెడ్డిండియన్ల దగ్గిర తండ్రి ఏంచేస్తాడో చూడాలని వాడి ఉబలాటం. పెర్హాంసా మనస్సు వాళ్లందరిలో బెరెట్ అన్నమాటచుట్టూ తిరుగుతూంది. కొడుకు ప్రశ్నలకు జవాబు చెప్పడంలేదు. వాళ్లు రెడ్డిండియన్ల మకాందగ్గిరికి వచ్చేస్తు న్నారు. పిల్లలంతా ఉరుకులు గంతులువెడుతూ ఆడుకుంటు న్నారు. ఆడవాళ్లు ఏవోపన్లు చేసుకుంటున్నారు. అంతా శాంతంగా ఉంది. కొందరు మగవాళ్ళు చలిమంటవేసుకుని చుట్టూ మౌనంగా కూచుని తృప్తిగా చుట్టలు కాల్చుకుంటు న్నారు.

పెర్హాంసాకి కొంచెంగా ఇంగ్లీషువచ్చు. అజ్ఞానంతో ఇంగ్లీషులోనే వాళ్లతో మాట్లాడాడు. మొగవాళ్లలో ఒకడు సమాధానం చెప్పాడు. అక్కణ్ణించి ఆరెడ్డిండియను ఒకడు ఇంగ్లీషులో మాట్లాడటం మొదలుపెట్టాడు. పెర్హాంసాకి అర్థంకాలేదు. కుర్రాడు హాన్స్ దుబాసీగా తండ్రికి సాయ పడ్డాడు. ఈ విధంగా పెర్హాంసా ఎక్కడ ఉంటున్నది, మంచీ—చెడ్డా రెడ్డిండియన్లు తెలుసుకున్నారు. ఆతర్వాత మాట్లాడేందుకు ఏమీలేకపోయింది. ఆవులు నాలుగు సిద్ధంగా ఉన్నాయి. తోలుకుపోవచ్చు. కాని, అంత తొందరగా వెళ్లి పోవాలనిలేదు పెర్హాంసాకి. ఆయనకి ఉత్సాహంగా ఉంది. మంచిపొగాకు కాస్త అడిగి, కాల్చాలని ఉంది. అప్పటికి

పొగాకు తనకళ్లబడి కొన్ని వారాలయింది. తన పైప్‌లోకి కొంచెంపొగాకు కావాలని ఆరెడ్డిండియన్లకు సూచించాడు. పైప్‌నింపి ముట్టించాడు. వాళ్లతోపాటు మంటదగ్గిరకూచుని కమ్మగా పొగలాగుతున్నాడు. ఆమధ్య ఎప్పుడూ ఎరగనంత ఉల్లాసంగా ఉందతనికి.

ఇక వెడదామని లేచాడు. ఇంతలో ఆమంట దగ్గిరగా ఒక రెడ్డిండియను గొంగళి చుట్టబెట్టుకుని దొర్లుతూ మూల్గుతూ ఉండటం చూశాడు. పాపం ఏదో జబ్బుతో, బాధతో అవస్థ పడుతున్నట్టుంది. కొడకు వీపుమీద తట్టి, "ఆ అబ్బాయి ఎందుకు మూలుగు తున్నాడో కనుక్కోరా?" అన్నాడు.

ఆకుర్రాడు ఇంగ్లీషులో అడిగికనుక్కొని, "ఆఅబ్బాయి చెయ్యి నెప్పిటనాన్నా!" అన్నాడు.

ఆ చెయ్యి తనకి చూపించమన్నాడు పెర్వాంసా— కట్లన్నీ ఊడదీసి, చెయ్యి చూపించాడు ఆరెడ్డిండియను— మణికట్టు మొదలు మోచేతివరకు బాగావాచి ఎర్రగా ఉంది. చేతికిపెద్దగాయం ఉంది. రక్తం విషకలుషితమైనట్టు కనిపించింది పెర్వాంసాకి. వెంటనే కొడుకుతో, "కొంచెం వేణీళ్లు, తెల్లటి శుభ్రమైన గుడ్డ కావాలని చెప్పరా వాళ్లతో," అన్నాడు. గుడ్డంటే ఏమిటో వాళ్లకి అర్థంకాలేదు. "ఒరేయ్ దీనికి ఏంచెయ్యాలో మీ అమ్మకి బాగా తెల్సుగానీ, నువ్వు ఇంటికెళ్లి, కొంచెం తెల్లటిగుడ్డ, ఉప్పు, మిరియాలు, హాన్సెటిల్లా ఇంట్లోంచి నాలుగు చుక్కలు విస్కీ తీసుకుని

మీ అమ్మని కూడా రమ్మని చెప్పు. వెళ్లు! ఇక్కడున్నట్టు రావాలి,'' అన్నాడు.

త్వరగానే వచ్చేసింది, బెరెట్ హాన్స్ వెంట. కాని, ఆమె ఉత్సాహంగా లేదు. ఆమెకి ఇంకా కోపంగానే ఉంది. తనతో కూడా భర్తని వెంటనే ఇంటికి వచ్చేయమంది. పెర్హాంసా వినలేదు. భార్య తెచ్చిన కుండలో ఆమంటమీద నీళ్లు కాచి, అందులో కొంచెం ఉప్పు వేశాడు. ఒకగిన్నెలో మిరియాల పొడి వేసి, నాలుగుచుక్కలు విస్కీ వేసి, ఆ రెడ్డిండియన్ని తాగమన్నాడు. రోగి మొదట సందేహించాడు గాని, చివరికి తాగేశాడు.

తర్వాత బెరెట్ ఆగాయంమీద ఒకచుక్క విస్కీ వేసింది. పెర్హాంసా అతని చెయ్యిపట్టుకుని బాగా రుద్దాడు. బెరెట్ కి అమితభయంగా ఉంది. కాని, ఏమీ అనలేదు. తర్వాత పెర్హాంసా ఆ తెల్లగుడ్డను వేణ్ణీళ్లతో తడిపి అతని చేతికి చుట్టాడు. ఆ రెడ్డిండియను విపరీతమైన బాధపడు తున్నాడు. ''ఇక మీరిద్దరు ఇంటికి వెళ్లిపొండి,'' అన్నాడు పెర్హాంసా, భార్యతో. ''నేను ఈవేళ రాత్రంతా ఇక్కడ ఉండాలి. ఏం భయం లేదని చూశావుగా. పొద్దున్నే నేను వచ్చేటప్పుడు ఆవుల్ని తోలుకువస్తాను,'' అన్నాడు.

ఆ రెడ్డిండియన్ల మకాంలో అంతా నిద్రపోయారు. పెర్హాంసా మాత్రం మేలుకొని కూచున్నాడు. ఆ రెడ్డిండియను చేతివాపూ, నెప్పీ తగ్గేదాకా నిద్రపోదలచుకోలేదు. అప్పటికి తానూ బాగా అలసిపోయాడు. ఇంతలో హఠాత్తుగా అటు

నించి ఎవరో ఆ గడ్డిలో మెల్లగా నడిచి వస్తూండటం చూశాడు. ఎవరై ఉంటారబ్బా? రెడ్డిండియన్లంతా నిద్ర పోతున్నారు. లేచి, అలు రెండడుగులు వేసి చూశాడు. ఆ వస్తూంది బెరెట్. ఎంతసేపటినించో అలా ఏడుస్తూన్నట్టు కనిపిస్తూంది. ఆమె విపరీతంగా భయపడుతూంది. పెర్హాంసాకి ఆమెస్థితి చూసి తగనిజాలి కలిగింది. చేతులుచాపి కౌగిలించు కున్నాడు. ఆమె ఏడవటం తప్ప మాట్లాడ లేకపోయింది. అయినా, ఇప్పుడు కనీసం ఇద్దరూ ఒకచోట ఉన్నారు. ఆజబ్బుమనిషికి బాధ క్రమంగా తగ్గుతూందని పెర్హాంసా ఆమెకి చెప్పాడు.

మరో రెడ్డిండియను రెండు పెద్ద గొంగళ్లు తెచ్చి వాళ్లకిచ్చాడు. అవికప్పుకుని వాళ్లు అక్కడే పడుకున్నారు. బాగా అలిసిఉండటంవల్ల ఇద్దరికీ వెంటనే నిద్రపట్టింది. బాగా తెల్లవారిన తర్వాతగాని మెళుకువరాలేదు.

రెడ్డిండియన్లు ఆపైన ఒకరోజు పూట అక్కడ ఉన్నారు. తర్వాత వెళ్లి పోయారు. పెర్హాంసా వాళ్లతో బాగా స్నేహం చేశాడు. పిల్లలికి కూడా రెడ్డిండియన్లతో పరిచయం ఏర్పడింది. శామ్‌సోలం, ఆడవాళ్లు మాత్రం ఇళ్లల్లోనే ఉండి పోయారు. రెడ్డిండియన్లు ఆయిళ్ళ వేపు వెళ్లలేదు. ఇప్పుడు, వాళ్లు బయలుదేరి పోవడానికి సన్నాహాలు చేసుకుంటున్నారు. వాళ్ల బళ్లన్నీ వరసగా నిలబడి ఉండటం పెర్హాంసా చూశాడు. ఇంతలో, ఆ జబ్బు మనిషి జీనుకట్టిన ఒకగుర్రాన్ని కళ్లెంపట్టుకుని నడిపించుకుంటూ తమ ఇళ్ళవేపు వస్తున్నాడు.

"పాపం! నాకు కృతజ్ఞత తెలిపిపోవడానికి వస్తున్నట్టున్నాడు. అనుకుని నాలుగడుగులు ఎదురువెళ్లాడు. ఆరెడ్డిండియను సరాసరి పెర్హాంసా దగ్గిరికేవచ్చి ఆ గుర్రంకళ్లెం పెర్హాంసా చేతికి అందిస్తూ ఏదోఅన్నాడు. పెర్హాంసాకి అర్థంకాలేదు.

"ఈ గుర్రం నీకు భామతీటనాన్నా!" అన్నాడు హాన్స్.
పెర్హాంసా నమ్మలేకపోయాడు. తనకు వద్దని తిరిగిఇచ్చివేద్దామనుకున్నాడు. కాని, అప్పటికే ఆరెడ్డిండియను మళ్లీ మాట్లాడకుండా వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. పెర్హాంసాకి, ఆయనకుటుంబానికి అమితాశ్చర్యం కలిగింది. హాన్స్ సంతోషంతో గంతులుపెట్టడం మొదలుపెట్టాడు.

౬

మర్నాడు పట్నం వెళ్లిన మగవాళ్లంతా వచ్చేశారు. వాళ్లుకూడా చాలా సంగతులు మూటకట్టుకొచ్చారు. హాన్స్‌ఓల్సా మొట్ట మొదట పెర్హాంసా ఇంటికే వచ్చాడు. పెర్హాంసాకోసం కొన్ని బస్తాలు సామానుతోపాటు, ఒక నాగలి, ఒక గుంటక (Rake) కూడా తీసుకువచ్చాడు. అందరూ, అనేక అద్భుతవస్తువులు పట్టుకొచ్చారు.

ఆరోజున వాళ్లందరికి హాన్స్‌ఓల్సా తనయింట్లో విందు చేశాడు. పట్నాన్నిగురించి అక్కడ వాళ్లు కలుసుకున్న మనుష్యుల్నిగురించి చాలా విషయాలు తెలుసుకోవాలని పెర్హాంసా తొందర. ముందు, పెర్హాంసాచెప్పిన కథంతా తక్కిన వాళ్లు విన్నారు. మధ్య మధ్య ఔత్సుక్యంతో ప్రశ్నలు

అడుగుతూ, నిజానికి వాళ్లు చెప్పబోయే విషయాలన్నింటికన్న ఇదే అద్భుతంగా ఉంది—అన్నారు. సారీనాకి భర్త తెచ్చి పెట్టిన కొత్తవస్తువులన్నీ చూడడానికి ఆడవాళ్లంతా లోపలికి వెళ్లారు. మగవాళ్లు, పశువుల పాకలో కూచుని మాట్లాడుకుంటున్నారు. మధ్య మధ్య ఓ చుక్క మద్యం సేవిస్తున్నారు. ఆడవాళ్లు ఇది చూడటం వీళ్లకి ఇష్టం లేదు.

చివరికి సారీనా ఒక సీసా మద్యం, ఒక గ్లాసు పట్టుకుని పశువుల కొట్టం దగ్గిరికి వచ్చింది. "సంతోషసమయం. ఇది మంచిమద్యం. తలా కాస్త పుచ్చుకోండి," అంది. మగవాళ్లు తమకు అవసరం లేదన్నట్టు నటించి, ఆ సీసా తీసుకుని, అందులో సరుకు కూడా తలా కాస్తా చప్పరించి, చిలిపి పిల్లల్లాగ నవ్వుకుంటూ మళ్లీ పశువుల పాకలోకి వెళ్లారు.

అంతా సంతోషంగా ఉన్న ఈ సమయంలో పానకంలో పుడకలాగ మరో సంఘటన; జెర్ ట్రీ ఓ వార్త పట్టుకొచ్చింది. ఆమె పొలంలో ఉన్న మగవాళ్లకి భోజనం తీసుకు వెళ్తూండగా, వాళ్ల ఆవుకోసం చూస్తే ఎక్కడా కనిపించలేదు. ఆ మైదానం అంతటా పారజూసింది. ఎక్కడా అయిపులేదు. పైగా, మిగిలినవాళ్ల ఆవులు కూడా కనపడలేదు.

జెర్ ట్రీ వెంటనే సారీనాదగ్గిరికి పరిగెత్తి, "ఆవులెక్కడైనా కనిపించాయటమ్మా?" అంది. ఆమె చూసింది. ఎక్కడా అయిపులేవు. "అన్నీ కలిసి పారిపోయుండాలి," అంది జెర్ ట్రీ.

"మగవాళ్లకి చెప్పేద్దాంపద," అంది సారీనా.

వెంటనే సారీనా బయలుదేరి భర్తదగ్గిరికి వెళ్లింది. హాన్సఓల్సా పొలం దున్నుతున్నాడు. తను కొనుక్కొచ్చిన నాగలిపసందుగా పనిచేస్తూందనే సంతోషంలో ఉన్నాడు. ఆడవాళ్లు ప్రతిదానికి ఎందుకు కంగారు పడుతున్నారో అతనికి అర్థంకాలేదు. "పాలుతీసేవేళకి అవే తిరిగివస్తయి," అన్నాడు. కాని, భార్యగాభరాచూసి, నాలుగు వేపులా పారజూశాడు. ఎక్కడా ఆవులజాడ కనిపించక పోయేసరికి ఓల్సాకికూడా అనుమానంవేసింది. పెర్హాంసా యింటికివెళ్లాడు. అక్కడ ఎవరూ ఆవులు కనపడలేదన్న సంగతే గమనించినట్టులేదు.

ఈ మాటవినగానే, పెర్హాంసా పెద్దకొడుకుని పిలిచి, "ఈ ఆవులు మాటికిముందూ ఆ యేటిఒడ్డుకి పోతూఉంటాయి, వెళ్లిచూసిరారా, అక్కడున్నయ్యేమో! ఒకవేళ అక్కడ కనిపించకపోతే వెంటనేవచ్చి చెప్పు. వాటిసంగతి చూడాలి," అన్నాడు.

అందరికళ్లు ఆమైదానం అంతా వెతుకుతున్నయి. పొద్దుగ్రుంకిపోతున్నా ఆవులు ఇళ్లకిరాలేదు. హాఠాత్తుగా అన్నీ ఒక్కసారిగా మాయమై పోయినయి. ఏమయి పోయయ్యో ఎవరికీ అంతుపట్టడంలేదు. అంతా చిత్రంగా ఉంది. పెర్హాంసా ఇంట్లో వాళ్లఆవు రోజీకోసం అన్నామేరీ ఏడుపు మొదలుపెట్టింది. చిన్నకుర్రాడు హాన్స ఆబెంగతో అన్నం తినలేదు. ఓల్ మాత్రం పెద్దవాళ్లలాగ బింకంగా నటిస్తున్నాడు. కాని, అన్నంతింటూ తింటూ, మధ్యలో

లేచిపోయి ఎక్కడో ఒంటరిగా కూచున్నాడు. రోజీ ఇంటికి రాకపోయేసరికి అందరికి బెంగగానేఉంది.

రాత్రి భోజనాలయిన తర్వాత, అందరు పెర్ర్లంసా యింటికి వచ్చారు, ఆవులసంగతి ఆలోచించడానికి. రాత్రి చీకట్లు బాగా దట్టమవుతున్నయి. హోరుగాలి, వీస్తూంది. ఎత్తుగా పెరిగినగడ్డి ఇటూ అటూ ఊగిపోతూంది. ఎవరూ ఏమీ మాట్లాడటంలేదు. తమ ఆవులన్నిటినీ చిత్రంగా తోలుకు పోయారని మనసులో ఎవరికివాళ్లు అనుకుంటున్నారు. ఆ విషయం పైకి చెప్పరు.

చివరికి, శామ్సోలం ఇలా అన్నాడు, "ఆరెడ్డిండి యన్ల పనే! ఆవుల మీద కన్నేసి మళ్లీ వెనక్కొచ్చి, తోలుకుపోయుండాలి. ఆహా! నామాట కరక్టే!"

ఈ విషయాన్ని గురించి ఆలోచించిన కొద్దీ మిగిలిన వాళ్లకికూడా, శామ్మాట నిజమే కావచ్చునిపిస్తోంది. రెడ్డిండియన్లే వాటిని తోలుకు పోయుంటే, పెర్ర్లంసా వెళ్లి వాటిని తోలుకు రావడానికి ప్రయత్నించాలి. ఆయనే రెడ్డిండియన్లతో శాస్త్ర స్నేహం చేసినవాడు. వాళ్లీ మాట అనేసరికి పెర్ర్లంసాకి కోపంవచ్చింది. "వట్టిమూర్ఖులు," అనుకున్నాడు. తానక్కణ్ణించి లేచి వెళ్లేలోగా, ఇంచుమించు ఈ అభిప్రాయం చాలావరకు వ్యక్తంచేశాడు.

ఇక పెర్ర్లంసా ఇంట్లో అంతకంటె అయోమయంగా ఉంది. ఎవరూ నిద్రపోయేటట్టులేదు. చిన్నకుర్రాడు గట్టిగా

ఏడవటం మొదలుపెట్టాడు. పెడ్రోంసా వాణ్ణి సముదాయించి, "భయంలేదు నాన్నా!...ఆవు లెక్కడున్నాయో నాకు తెలుసులే! రేపుపొద్దున్నే నేను గుఱ్ఱంమీద వెళ్లితోలుకొస్తాగా!" అన్నాడు.

"ఆ రెడ్డిండియన్లే తోలుకు పోయారా నాన్నా?" అని అడిగాడు కుఱ్ఱాడు.

"లేదు. నాకు తెలుసు. వాళ్లు ఎంతో మంచివాళ్లు. నువ్వూ చూశావుగా వాళ్లని!"

చిన్న కుఱ్ఱాడిగొడవ తగ్గింది. మెల్లగా వెళ్లి పడుకుని నిద్రపోయాడు. రోజీ కనబడకపోవడం వాడికి ఇంకా బెంగగానే ఉంది.

మర్నాడు తెల్లవారగానే పెడ్రోంసా బయలుదేరాడు. బెరెట్ ఉదయభోజనం తయారుచేసింది. ఆమె ఆ రాత్రంతా మేలుకునేఉంది. ఇదంతా శని మహిమ అనీ, తలదాచుకొన డానికి నీడైనాలేని ఈ నిర్జన భూమికి అంతదూరంనించి వచ్చినందుకు, శాస్తిగా శనిగాడే ఆవుల్ని మాయంచేశాడని ఆమె గట్టినమ్మకం. ఇప్పుడు తనభర్త ఆవుల్ని వెతుక్కురావడానికి వెళుతున్నాడు. ఎక్కడికి ఆయన వెళ్లడం? ఎప్పటికి ఆయన తిరిగిరావటం? ఇది నివాసయోగ్యమైన భూమికాదని ఇదివరకు కంటె ఎక్కువగా ఇప్పుడు బాగా ధ్రువపరచుకుంది ఆమె. ఆవులు దొరక్కపోతే, బహుశః పెడ్రోంసాకికూడా ఈ విషయం తెలిసిరావచ్చు.

"మీరు వెళ్లటం మంచిదికాదు," అంది బెరెట్ చివరికి భర్తతో, "నన్నిక్కడ విడిచిపెట్టి మీరు వెళ్లకండి! మళ్లీ ఎప్పటికి తిరిగి వచ్చేదీ మీకే తెలియదుకాదూ! ఇంకెవరైనా ఎందుకు వెళ్లకూడదు? పోయింది మనావే కాదు, వాళ్ల ఆవులూ పోయినయి!"

"హాన్స్ఓల్సా తప్ప ఇందుకు తగిన వాళ్లెవరూ లేరు. ఆయన గడ్డిమేటి పనిలో ఉన్నాడు. మన ఆవుల్ని తిరిగి తెచ్చుకోవాలంటే నేను వెళ్లక తప్పదు."

బెరెట్ ఏడుస్తూ అంది, "ఇంకెవర్నయినా వెళ్ల నివ్వండి, మీరు నాదగ్గర ఉండాలి."

"అవకాశం లేదు బెరెట్! నేను వెళ్లక తప్పదు. నువ్వింత బేలగా మాట్లాడ్డం బాగుండలేదు," తన భార్యేనా ఇలా మాట్లాడుతూంది, అని పెర్హంసా ఆశ్చర్యపోయాడు. నిజానికి, ఈస్థితిలో ఆమెను విడిచిపెట్టి వెళ్లడం పెర్హంసాకీ ఇష్టంలేదు. ఇదివరకు, తను ఏంచెప్పినా బెరెట్ చక్కగా అర్థంచేసుకునేది. అయినా, తను వెళ్లక తప్పదు, భార్య ఏమనుకున్నా సరే, తప్పదు.

పెర్హంసా బయలుదేరబోతూండగా, హాన్స్ఓల్సా మాట వినిపించింది. ఏమిటికథ?—మన ఆవులకి మొగ పశువుల సాంగత్యంలేదు. అందుకోసం అవి పారిపోయి ఉండాలి. నేం చెప్పింది అర్థమయిందా?" అన్నాడాయన వస్తూనే.

పెర్హ్యాంసా నవ్వాడు, "సరిగ్గా నేననుకుంటున్నదీ అదే. ఇప్పుడు నేను వెళ్లేది ఎక్కడికో తెలుసా? తూర్పున ట్రాండర్స్ పల్లెకి వెళ్లి అక్కడ కనుక్కుంటాను ముందు. అయితే, నేను మళ్లీ ఎప్పుడు వచ్చేదీమాత్రం చెప్పలేను. ఓల్సా! నువ్వు నీపని చూసుకో. రాత్రికిమాత్రం సొరీనాని కాస్త ఇక్కడికి పంపు. బెరెట్‌కి ధైర్యంగా ఉంటుంది," అన్నాడు.

గుర్రంమీద బయలుదేరి, మళ్లీ ఇంటిదగ్గిరగా వచ్చి, కాసేపు విని, తర్వాత వెళ్లిపోయాడు పెర్హ్యాంసా. ఇంట్లోంచి బెరెట్ దూరంగా వెళ్లిపోతూన్న భర్తవేపు చూస్తూ కూచుంది. క్రమంగా భర్తరూపం చిన్నదై చిన్నదై, కన పడకుండా పోయేవరకు చూసింది. దుఃఖం ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్చింది.

పెర్హ్యాంసా ఎక్కడికి వెళ్లిందీ విని, తక్కినవాళ్లంతా ఏమీ పనిపాట్లు మాని ఆయన రాకకోసం ఎదురుచూస్తూ కూచున్నారు. నిస్సందేహంగా ఆ రెడ్డిండియన్లే ఆవుల్ని తోలుకుపోయారని టాన్సెటెన్ అభిప్రాయం. పెర్హ్యాంసా వట్టిఅమాయికుడనీ, ఆ రెడ్డిండియన్లని వెతుక్కుంటూ వెళ్లడానికి బదులు, ట్రాండర్స్ పల్లెకి వెళ్లడం శుద్ధ తెలివి తక్కువనీ అతని తీర్మానం. "రెడ్డిండియన్లతో స్నేహం చేశాట్ట స్నేహం! అదంతా వొట్టి భ్రమ," అనుకొన్నాడు.

ఆ రోజు సాయంకాలం, కాసేపు కబుర్లు చెప్పి వద్దామని అంతా బెరెట్ దగ్గిరికి వచ్చారు. ఆమె ఏమీ మాట్లాడ

కుండా, ఎక్కడో ఏదో ఆలోచిస్తున్నట్టు కూచుంది. మిగిలిన వాళ్లంతా ఇక్కడ కూచుని కబుర్లు చెప్పుకుంటూఉంటే, ఆవులకోసం పెర్హాంసాయే ఎందుకు వెళ్లాలి. వాళ్ల ఆవులు మాత్రం పోలేదూ? ఈ అభిప్రాయాలను ఆమె పైకి కూడా వెల్లడించింది. ఆమెకి ఎవ్వరూ జవాబు చెప్పలేకపోయారు. మరికొంతసేపటికి ఎవరిదారిని వాళ్లు వెళ్లిపోయారు, ఆమెని ఒంటరిగా వదిలిపెట్టి.

మర్నాడు ఉదయం పెర్హాంసా కొడుకులిద్దరు ఇంటి కప్పుమీదికెక్కి, సాయంకాలందాకా అక్కడే కూచున్నారు తండ్రికోసం ఎదురుచూస్తూ. చివరికి, చిన్నకుర్రాడు హాన్స్ కేకపెట్టాడు, "నాన్నొచ్చేస్తున్నాడూ! అదుగో...వచ్చేస్తున్నాడు!" ఓల్ కూడా ఇంకో కేకపెట్టాడు. ఇద్దరూ గబగబా కిందికి దిగివచ్చారు, ఈ వార్త అందరికీ చెప్పడానికి. ముందుగా వెళ్ళి తల్లికి చెప్పారు. "ఆవులుకూడా వస్తున్నయ్యమ్మా!" అన్నారు.

ఆవలసలో స్నేహితులంతా పెర్హాంసా వాకిట్లో గుమికూడి చూస్తున్నారు. వాళ్ళ నాలుగు ఆవులే కాకుండా వాటికి వెనక ఇంకోటికూడా ఉంది. పెర్హాంసా దగ్గరికి వచ్చిన కొద్దీ ఆ ఐదోదీ ఆవుకాదని, చిన్నఆబోతని తేలింది. మళ్ళీ ఆబోతుకోసం ఆవులు పారిపోకుండా ఉండాలంటే ఇదే ఉపాయం. పెర్హాంసా బాగా అలిసిపోయినట్టు కనిపిస్తున్నాడు. బట్టలన్నీ దుమ్ముకొట్టుకుని ఉన్నాయి. ఏమీ మాట్లాడలేనంతగా అలసిపోయి ఉన్నాడు. వస్తూనే బెరెట్ దగ్గరికి

వెళ్ళి తన ఛాతీకి కట్టుకునిఉన్న పెట్టె తీసి ఆమెకిచ్చాడు. లోపల కొన్ని కోడిపిల్లలు ఉన్నాయి. "అవి నీకోసం, అన్నీ బతికే ఉన్నాయిగా!" అన్నాడు, ఆయాసపడుతూ.

మిగిలినవాళ్లంతా పెర్వాంసాని ఏవేవో ప్రశ్నలు అడగాలనుకొన్నారు. కాని, ఆయన ఆట్టె మాట్లాడే స్థితిలో లేడు. తను ట్రాండర్స్ పల్లెనించే వస్తున్నాడు. ఆవులు అక్కడే దొరికినయి. "ఈ ఆబోతుని మనం ఒక సంవత్సరం ఇక్కడ ఉంచుకుందాం. అందుకోసం మనం వాళ్ళకి పది డాలర్లు ఇవ్వడానికి ఒప్పుకొచ్చాను. మనం ఒక్కొక్కళ్ళం రెండున్నర డాలర్లు వేసుకుంటే సరిపోతుంది. రోజూ ఆవుల్ని వెతుక్కుంటూపోవడంకంటె ఇది మంచిది కాదూ?" అని క్లుప్తంగా చెప్పేశాడు పెర్వాంసా. పెర్వాంసా తెలివితేటలకు వాళ్ళంతా గర్వపడ్డారు.

# మూడవ భాగం

## ౧

ఆ వేసవంతా పెహ్లాంసా విసుగువిరామాల్లేకుండా పని చేశాడు. ఎన్నడూ రవంత అలసినట్టు కూడా కనిపించలేదు. చెయ్యగలిగినంతసేపు పనిచేసేవాడు. ఆపైన ఒడలు తెలియని నిద్రపోయేవాడు. మర్నాడు నిద్రలేవగానే మళీ పన్లో దూకేవాడు. పనిచేస్తూంటే ఆయనకి అమితోత్సాహంగా ఉంటూంది. ఆయన పెద్దపెద్ద కలలు కంటున్నాడు. ఈ ప్రపంచంలోకల్లా మంచి భూమి నూటఅరవై ఎకరాల సుక్షేత్రానికి నేడు తను యజమాని. కొన్నాళ్లకి ఇంకా భూమి సంపాయిచ్చొచ్చు. మరింతభూమి సంపాదించాలనే ఉంది; కాని ముందుగా బెరెట్‌కి మంచి ఇల్లొకటి,—బెరెట్ ఎన్నడూ ఊహించనంత అందమైన యిల్లు కట్టాలి. ఇంటిచుట్టూ పూల మొక్కలు, పండ్ల చెట్లతో కలకల్లాడే పెద్దతోట పెంచాలి. చుట్టూ చల్లని నీడలతో, ఘుమఘుమలాడే పరిమళాలతో— అందమైన తన గ్రీన్‌బంగళా దివ్యభవనంలాగ ఉండాలి.

అతని చేతులు క్షణం ఊరుకోటం లేదు. ఆయన క్షణం విశ్రమించడం లేదు. ఆ ఉత్సాహం అనుపమానం.

ఒకరోజున ఓల్, హాన్స్ బాతుల్ని గురించి మాట్లాడుకుంటూ ఇంటికి వచ్చారు. ఆ నాడు వాళ్లు ఆ మైదానంలో చాలాదూరం వెళ్లారు. ఒకచోట పెద్దసరస్సు కనిపించింది. దానినిండా అడివి బాతులు లెక్కలేనన్ని ఉన్నాయి. అవి నిర్భయంగా యించుమించు చేతికికూడా దొరికేటట్టుఉన్నాయి. వాటిని కొట్టుకుని రావాలి. ఎల్లా? అన్న, తమ్ముడు ఆ బాతుల్ని గురించి తప్ప ఇంకేమీ మాట్లాడటం లేదు. వాళ్లకి తుపాకి ఉంది. గుళ్లుమాత్రం కొద్దిగానే ఉన్నాయి. వాటిని ఈ బాతుల్ని కొట్టటానికి ఉపయోగిస్తే ఎలా? మరి ఎల్లా బాతుల్ని కొట్టటం? ప్రతి ఆదివారం వాళ్లిద్దరు బాతుల్ని చూడటానికి వెళ్లి వస్తున్నారు. ఆ బాతుల్ని కొట్టడమెల్లాగా అనే అస్తమానం వాళ్ల ఆలోచన.

ఒక ఆదివారం హాన్స్‌తో పెర్హాంసా కూడా ఆ బాతుల్ని చూడటానికి వెళ్లాడు. ఓల్ తల్లికి సాయంగా ఇంటిదగ్గర ఉండిపోవలసి వచ్చింది. ఓల్‌కి తగనికోపంగా ఉంది. ఇద్దర్నీ చెరోసారి తనతో తీసుకెళతానని పెర్హాంసా హామీ ఇచ్చాడు. హాన్స్‌వంతు ముందు; వాడు చిన్నవాడు గనక.

వాళ్లు సరస్సు దగ్గిరికి వెళ్లేసరికి, ఆ బాతుల్ని చూసిన పరమానందంతో హాన్స్‌కి నోట మాటరాలేదు. "ఆ బాతుల్ని పట్టడమెలా నాన్నా", అని తండ్రిని ఎన్నిసార్లు అడిగాడో

పెర్హాంసా ఏంచెప్పలేదు. ఏదైనా ఉపాయం ఆలోచిస్తానని మాత్రం హాన్స్‌కి హామీ ఇచ్చాడు. తర్వాత తండ్రీకొడుకులు ఇంటికి వెళ్ళి పోయారు. హాన్స్ ముందు పరిగెత్తుకెళ్ళి ఇల్లు చేరుకున్నాడు. పెర్హాంసా మెల్లగా నడుస్తూ, దార్లో సంతోషంగా తనభూమీ, ఇరుగు పొరుగు వాళ్ళ భూములూ చూస్తూ వస్తున్నాడు.

ఈ చూడటంలో పెర్హాంసా ఒక దారుణమైన వింత విషయం కనిపెట్టాడు. టాన్సెటెన్ చేను బాగున్నదనుకుంటూ చుట్టూ తిరిగి చూస్తూండగా, ఎత్తుగా పెరిగిన గడ్డిలో పెర్హాంసా కాలికి ఒక సరిహద్దుకొయ్య తగిలింది. టాన్సెటెన్ ఇక్కడో సరిహద్దుకొయ్య పాతాడా? దాన్ని చూడటానికి క్రిందికి వంగిన పెర్హాంసా తనకళ్ళను తాను నమ్మలేక పోయాడు. ఆ కొయ్యచెక్కమీద ఉన్నది టాన్సెటెన్ పేరు కాదు. "ఓహారా" అని రాసిఉంది. ఏమిటీదారుణం? ఆలోచించడానికి పెర్హాంసా ఒక్కక్షణం ఆగలేదు. చకచకా హాన్స్ ఓల్సా చేనువేపు వెళ్ళి దానిచుట్టూ గడ్డిలో సరిహద్దు కొయ్యల కోసం వెతికాడు. కొంపమునిగింది. ఇంచు మించు బెరెట్‌లాగ ఏడ్చాడు పెర్హాంసా. ఈ కొయ్య చెక్కమీద హాన్స్ ఓల్సా పేరు లేదు, "జోగిల్" అని చెక్కి ఉంది. ఏమిటీదురంతం? ఒక్కసారిగా పెర్హాంసాకి ముసలితనం వచ్చి పైబడ్డట్టుంది. మిగిలిన వాళ్ళ చేలు, తనచేనుకూడా వెతికాడు; అక్కడ కూడా అలాంటి సరిహద్దు కొయ్యలేమైనా కనబడతాయేమో అని. అక్కడ ఏమీకనపళ్ళేదు. చీకటిపడేదాకా

పశువుల వసారాలోనే కనబడుతున్నయి. భర్త బయటికి వెళ్లిపోయాడు. పెర్హాంసా ఆమెకి ఏమీ చెప్పకపోవడంతో, ఆమె ఆందోళన, బెంగ ఎక్కువయింది. ఆ ఉదయం పెర్హాంసా తిరిగి ఇంటికి రాలేదు.

పెర్హాంసా ఆరోజు ప్రొద్దున్నంతా చేలలోనే తిరుగుతున్నాడు. తనని ఎవరైనా చూస్తున్నారేమో అనిచుట్టూ చూసి, చేలలో సరిహద్దు కొయ్యలన్నీ పీకేసి, ఆగుంటల్లో మట్టి కూరేశాడు. తర్వాత గడ్డితో ఉన్న మట్టిపెల్లలు తెచ్చి వాటిమీద అదిమాడు. గడ్డిలో గడ్డి కలిసిపోయినట్టు కనిపిస్తూంది. అక్కడున్న దేదో పీకేసినట్టు ఇక ఎవరూగుర్తుపట్టలేరు.

చివరికి, ఉదయోపాహారానికి ఇంటికి వచ్చాడు. ఆయన ఏదో తీసుకువచ్చి గొడ్లవసారాలో పెట్టటం బెరెట్ చూసింది. మళ్లీ చిత్రంగా ఆయన మారిపోయాడు. ఎప్పటి మనిషిలాగ కనిపిస్తున్నాడిప్పుడు. ఉదయోపాహారం పూర్తి కాగానే కొడుకులిద్దర్నీ వెంటేసుకుని చేను దున్నడానికి బయలుదేరాడు.

బెరెట్ పశువుల వసారాలోకి వెళ్లింది, తను కుడుతూ కుడుతూ అక్కడ వదిలి వచ్చిన గుడ్డలు తీసుకుంటానికి. పెర్హాంసా చేలల్లో పీక్కువచ్చిన సరిహద్దు కొయ్యలు ఆ గుడ్డలకింద పడేశాడు. అవి ఏమిటో బెరెట్‌కి అర్థంకాలేదు. వాటిమీద చెక్కిఉన్న పేర్లు సాధారణంగా మనుష్యులు పెట్టుకునే పేర్లలాగలేవు. అవి ఏమిటో! ఆమె గుడ్డలు తీసుకుని

ఇంట్లోకి వెళ్లిపోయింది, కట్టుకుంటానికి. ఆకొయ్యల్ని గురించే ఆలోచిస్తూంది. పెర్హాంసా ఆ కొయ్యల్ని చేలల్లోంచి పెళ్ల గించుకొచ్చి అక్కడ దాచి ఉండాలి. ఏమిటీపని ? భర్త నడగాలనుకుంది. ఆయన భోజనానికి ఇంటికి వచ్చినప్పుడు, ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు. అంచేత బెరెట్ ఏమీ అడగలేక పోయింది.

ఆరోజున రాత్రి భోజనం అయిన తర్వాత, పెర్హాంసా పశువుల వసారాలోకి వెళ్లి ఆ కొయ్యలు తీయడం బెరెట్ చూసింది. పెర్హాంసా ఆకొయ్యలన్నిటినీ బయటికితీసి, అన్నిటినీ జాగ్రత్తగా చిన్నచిన్న ముక్కలుగా నరికేశాడు. తర్వాత వాటితో మంటవేశాడు. ఇదంతా చూస్తూన్న బెరెట్ తనకళ్లని తాను నమ్మలేక పోతూంది. పరాయి వాళ్ల సరిహద్దు కొయ్యలు పీక్కొచ్చి తగల బెట్టడంకంటె దారుణమైన దుర్మార్గం ఏమి ఉంటుంది ? పరాయివాడి భూమి అపహరించడ మన్నమాటే. ఇలాంటి పెద్దమనిషినా తను కట్టుకున్నది ? ఇక తను ఆ మనిషితో కాపరం చెయ్యడం అసాధ్యం.

౨

పెర్హాంసా మళ్లీ ఉదయాస్తమానం ఎడతెరిపిలేకుండా కష్టపడుతున్నాడు. అయితే, అతనిలో ఉల్లాసంగాని, శాంతి గాని కనిపించడం లేదు. ఆసరిహద్దు కొయ్యల్ని పాతినవాళ్లను గురించిన ఆలోచన తప్ప మరోవిషయం మీదికి పోవడం

లేదు ఆయన మనస్సు. వాళ్లు మళ్లీ వస్తారా? కేవలం సరిహద్దు కొయ్యల్ని పాతినంత మాత్రాన ఏమీ అయిపోదని పెర్గాంసాకి తెలియదు. వాళ్లకి నిజంగా ఏదైనా హక్కు ఉంటే, టాన్సెటెన్ కి, హాన్స్ ఓల్సాకి ఆభూమి ఎలా మంజూరయింది? ఏమో! పెర్గాంసాకి ఏమీ అంతు పట్టడంలేదు.

బెరెట్ విచారం మరీ ఎక్కువయింది. పెర్గాంసా ఆ సరిహద్దు కొయ్యల్ని తమ భూమిలోనించే పీక్కొచ్చాడని ఆమె నమ్మకం. మరొకరి భూమిని తాను ఆక్రమించుకొన్నాడన్నమాట! కాని, క్రమంగా ఆమె ఈ విషయం ఆలోచించడం మానేసింది. ఎవరైనా ఈ సంగతి కనిపెడితే ఏమవుతుంది? ఈప్రశ్నే ఆమెని వేధిస్తూంది. పెర్గాంసాకి ఇంగ్లీషు మాట్లాడటమైనా రాదు. తమగతి ఏమవుతుంది? ఈప్రశ్నలే మళ్లీ మళ్లీ సుళ్లు తిరుగుతున్నాయి ఆమె తలలో.

వాళ్లు ఆమైదానంలో నివాసమేర్పరచుకొని అప్పుడే నాలుగు నెలలయింది. బెరెట్ సరిహద్దు కొయ్యల్ని గురించి ఆలోచించడం మానేసింది. ఇక్కడ ఎంతమంది వచ్చినా కావలసినంత భూమిఉంది. పైగా, ఇంతవరకు మరోళ్లెవరూ రానూలేదు. వాళ్ల కర్మాన వాళ్లు బ్రతుకుతున్నారు.

అలా ఉండగా, ఒకరోజున కొందరు వింత మనుష్యులు అక్కడికి వచ్చారు. వాళ్లని చూడటానికి వలసలో వాళ్లంతా వెళ్లారు. ఈ వలసలో జీవించటానికి ఇంకా ఎవళ్లో వస్తున్నట్టున్నారు! వాళ్లు నలుగురు మనుష్యులు. తూర్పునించి వస్తున్నారు. వాళ్లింకా డెబ్బయిమైళ్లు పడమటికివెళ్లి అక్కడ

స్థిరపడాలనుకుంటున్నారు. వీళ్లే అయి ఉంటారు ఆ సరిహద్దు కొయ్యలు పాతినవాళ్లు అనుకున్నాడు మొదట పెర్హాంసా. వాళ్లని గురించి తెలుసుకున్న తరువాత ఆయన మనస్సు కుదట బడింది. వాళ్లు జర్మనీదేశపు వాళ్లు. వాళ్లు ఇంకా డెబ్బయిమైళ్లు పడమటికి వెడుతున్నారని తెలియగానే వలసలో వాళ్లంతా సంతోషించారు. "కనక, ఈ మైదానంలో చిట్టచివరి వాళ్లం మనమే కాదన్నమాట!" అనుకున్నారు.

తర్వాత ఒకవారం రోజులకి, తూర్పునించి మళ్లీ కొన్నిబళ్లు వచ్చినయి. వలసలో వాళ్లు వాళ్లని చూసేసరికి చీకటి పడుతూంది. "మనకు అతిథులొస్తున్నట్టున్నారు," అన్నాడు పెర్హాంసా హాన్స్ ఓల్సాతో. అయితే, ఆబళ్లు వీళ్ల ఇళ్లదగ్గిర ఆగలేదు. పక్కగా వెళ్లిపోతున్నట్టు కనిపించినయి. తను ఎదురు చూస్తున్న వాళ్లు వీళ్లే అని పెర్హాంసాకి గట్టిగా అనిపిస్తూంది. ఆయన మౌనంగా, కోపంగా, చిరాకుగా కనపడుతున్నాడు.

వాళ్లు హాన్స్‌ఓల్సా భూమి సరిహద్దు దగ్గిర ఆగి, అక్కడ చలిమంట వేశారు. వాళ్ల సంగతి సందర్భాలు తెలుసుకోవాలని పెర్హాంసా ఆదుర్దా. "పదండివాళ్ల దగ్గిరికి వెళ్లి, మన బంగాళదుంపలేమైనా కొనుక్కుంటారేమో అడుగుదాం" అన్నాడు. చివరికి మిగిలినవాళ్లు ఒప్పుకున్నారు. ఇంగ్లీషులో వాళ్లతో మాట్లాడటానికి టాన్సెటెన్, బంగాళా దుంపలబేరానికి పెర్హాంసా వెళ్లారు. ఎప్పటిలాగే టాన్సె

సెన్‌కి తగని భయంగాఉంది. పెర్హాంసా అతన్ని వెనకడుగు వేయనీయలేదు.

పదిమంది మగవాళ్లు, నలుగురు ఆడవాళ్లు కనిపిస్తున్నారు. టాన్సెసెన్ వాళ్లతో ఇంగ్లీషులో మాట్లాడుతున్నాడు. పెర్హాంసాకి వాళ్ల మాటలన్నీ అర్థంకాలేదు. కాని, వాళ్లే వీళ్లనిమాత్రం గ్రహించాడు. "నాభూమి. హాన్సెఓల్సా భూమికూడా తమదని వీళ్లు అంటున్నారు." అని చివరికి టాన్సెసెన్ పెర్హాంసాకి చెప్పాడు. వాళ్లతో మాట్లాడే టప్పుడు టాన్సెసెన్ బిగ్గరగా తొందరగా మాట్లాడేస్తు న్నాడు. పెర్హాంసా సలహామీద ఆజోరు కొంతతగ్గించాడు.

"ఈ భూమంతా వాళ్లదేనంటున్నారు. వాళ్లు సైని కులుట. అంచేత భూమిదున్ని పండించకపోయినా, వాళ్ల హక్కు వాళ్లకి ఉంటుందిట. వెనకటి వేసవిలోను, మళ్లీ ఈ వసంతఋతువు ప్రారంభంలోనూకూడా వాళ్లిక్కడికి వచ్చారుట. హత్యలు, జైలుశిక్షలు అంటూ ధూకుడుగా మాట్లాడుతున్నారు. ఏం చేద్దాంమనం?" అన్నాడు.

"దస్తావేజులున్నయ్యేమో అడుగు," అన్నాడు పెర్హాంసా.

"ఉన్నయ్యంటున్నారు. రేపొద్దున చూపిస్తారుట."

"అయితే, మనం ఇళ్లకిపోదాం. సరిహద్దుకొయ్యలు కూడా ఉన్నయ్యేమో?"

"ఉన్నయ్యంటున్నారు," టూన్సెటెన్ భయంతో వణికిపోతున్నాడు. కళ్ల నీళ్ల పర్యంతం వచ్చేట్టుంది. ఆ ప్రబుద్ధుడు వాళ్ల ఎదట ఏడుపుకి లంకించుకోకముందే ఇంటికి మళ్లడం మంచిది అనుకున్నాడు పెర్హాంసా. ప్రొద్దున హాన్సోల్సాకి అంతా చెప్పి ఆపైన ఆవింతమనుష్యులకి ఏంచెప్పాల్సిందీ ఆలోచించుకోవచ్చు.

ఇప్పుడు, వాళ్ల ఆనుపాన్లు కొంత అర్థమవడంతో పెర్హాంసా ఉల్లాసంగా ఉన్నాడు. వాళ్లకు దస్తావేజులు ఉన్నట్టు లేదు. ఉంటే, అప్పుడే చూపించేవాళ్లు. వాళ్లెంతదురుసుగా మాట్లాడినా వాళ్లవల్ల తమకేమీ ప్రమాదంలేదని కని పెట్టాడు. ఇంటికి చేరేసరికి, ఆయన ముఖంలో మార్పుచూసి, బెరెట్ సంతోషించింది. తమకేమీ ప్రమాదం లేదన్న మాట!

ఆ వింతమనుష్యులను గురించి భర్త నడిగింది. కాని, కుర్రాళ్లిద్దరూ గబగబా, గట్టిగా మాట్లాడేస్తున్నందువల్ల, ఆమె మాటే పెర్హాంసాకి వినిపించలేదు. ఆకొత్త వాళ్లని గురించి అంతా తెలుసుకోవాలని వాళ్లతొందర. పెర్హాంసా ఉల్లాసంగా వాళ్ల ప్రశ్నలన్నిటికీ ఛలోక్తుల్తో జవాబులు చెపుతున్నాడు. ఆకొత్త వాళ్ల సంగతి సందర్భాలన్నీ వాళ్లకి చెప్పాడు.

ఆ మర్నాడు, తూరుపు తెల్లవారకముందే లేచాడు. కొంచెం ఏదో ఉపాహారం తీసుకుని, సోలంయువకుల్ని లేపడానికి బయలుదేరాడు. వాళ్లని వెంటబెట్టుకుని హాన్సోల్సా

ఇంటికి వెళ్తూ దార్లో జరిగిన సంగతంతా వాళ్ళకి చెప్పాడు. టాన్సెటెన్ తేలికగా ఆవేశపడిపోతున్నాడు; అందువల్ల హెన్రీసోలం వాళ్ళతో ఇంగ్లీషులో మాట్లాడాలి. సోలం వాళ్ళ మాటల్ని నార్వేజియన్ భాషలోకి తర్జుమాచేసి పెర్హాంసాకి, హాన్సోల్సాకి చెప్పాలి. సోలంయువకులకి ఇదంతా తమాషాగాఉంది. అంతులేని భూమితప్ప జనంకనిపించని ఈ దేశంలో భూమికోసం ఈ తగాలాటేమిటి!

హాన్సోల్సా బాగా భారీమనిషి. ఆయనతో మాట్లాడేటప్పుడు అంతా తలపైకెత్తి మాట్లాడాలి. అంత పొడగరి. అంత బలమైన మనిషికూడాను. ఆయన ఆలోచనా ధోరణిమాత్రం మందంగా, భద్రగజంలాగ నడుస్తుంది. ఏ విషయమైనా నిశ్చయించుకోనడానికి చాలాసేపు పడుతుంది. నిశ్చయం జరిగినమీదట ఆచరణమాత్రం చాలా చురుగ్గా చకచకా సాగిపోతుంది. పెర్హాంసా వచ్చేసరికి సొరీనాకూడా నిద్రలేచింది. ఆమె యెదట ఆ కొత్తవాళ్ల సంగతి చెప్పడం నిజానికి పెర్హాంసాకి ఇష్టంలేదు. కాని, ఇప్పుడు వ్యవధిలేదు. ఆమె మంచిది. అట్టే మాట్లాడేస్వభావం కాదు. అంచేత కథంతా ఓల్సాకి చెప్పేశాడు. హాన్సోల్సా అదంతా పూర్తిగా అర్థంచేసుకోడానికి, ఆకథలో చాలా భాగాలు మళ్లీమళ్లీ చెప్పవలసి వచ్చింది. చివరికి, ఆయన ఆ ఐర్లెండు దేశీయులతో మాట్లాడటానికి పెర్హాంసాతో బయలుదేరాడు. అన్నివిషయాలు స్పష్టంగా వ్రాసివున్న పొలందస్తావేజు ఆయనచేతులో ఉంది. అందరుకలిసి వెళ్లారు. ఎప్పటిలాగే.

టాన్సెటెన్ గాభరాగా గబగబా మాట్లాడేస్తున్నాడు. ఆయన తనదస్తావేజు తీసుకురాలేదు. ఒక వేళవాళ్లు తనదస్తావేజు లాగేసుకుంటే! ఆపైన తనపని ఏంగాను? అతని ఆందోళన చూసి, ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అయినా, దస్తావేజుకోసం ఆతన్ని యింటికి పంపాడు పెర్హంసా. "వాళ్లతో ముఖ్యమైన విషయాలన్నీ హెన్రీ సోలంమాట్లాడుతాల్లే" అని కూడా పెర్హంసా అన్నాడు. ఇది టాన్సెటెన్‌కి ఇష్టంలేదు. అయినా, ఆకంగారులో ఏమీ అనలేదు.

ఆగంతకుల మకాంలో మగవాళ్లంతా అప్పుడేలేచి, ఏవోపన్లు చేసుకుంటున్నారు. వాళ్లు ఈ వలసదారుల వంక చూడలేదు. హెన్రీసోలం వాళ్ల దగ్గిరికివెళ్లి, "పరాయివాళ్ల భూమికాజేయడానికి వచ్చిన పెద్దమనుషులు ఏంచేస్తున్నారు?" అని అడిగాడు. ఆగంతకులు నవ్వారు. ఆనవ్వులో నీచత్వం ధ్వనిస్తూంది. "మీ కాగితాలు చూపించండి," హెన్రీ గట్టిగా అడిగాడు. వాళ్ల కాగితాలన్నీ పెట్టెల్లో ఎక్కడో ఉన్నాయనీ, ఇప్పుడు బయటికి తియ్యడానికి వీల్లేదనీ, కావాలంటే సరిహద్దు కొయ్యలు చూపిస్తామనీ వాళ్లన్నారు.

"సరే మంచిది! పదండి సరిహద్దు కొయ్యలు చూద్దాం," అన్నాడు పెర్హంసా. వాళ్లంతా బయలుదేరి హాన్సెటల్సా భూమిలోకి వెళ్లారు. సరిహద్దు కొయ్యలున్న చోటికి చేరుకునేసరికి, పెర్హంసా ముఖంలో చిరునవ్వు తొంగి చూస్తూంది. అక్కడ ఎప్పుడుగాని అలాంటి కొయ్యలున్న జాడ కూడా ఏమీ లేకుండా గడ్డిలోగడ్డికలిసి పోయింది.

చుట్టుప్రక్కలఉన్న భూమిలాగే అక్కడా ఉంది. ఆ ఐర్లెండు వాళ్లకి సరిహద్దుకొయ్య లెక్కడా కనపడలేదు. చుట్టుప్రక్కల అంతట గాలించారు. ఏమీకనిపించలేదు. వాళ్లకి కోపం ఎక్కువై పోతూంది. ఇంతలో వాళ్ల బళ్లదగ్గిర మిగిలిన వాళ్లు కూడా అక్కడికి వచ్చారు. వాళ్లంతా వాళ్లల్లో వాళ్లు ఏదోమాట్లాడుకున్నారు. కొందరు హాన్సఓల్సాకేసి చూస్తూ ఆయన్ని తిడుతున్నారు. కొంతసేపటికి ఓల్సా గ్రహించాడు, వాళ్లు తనను దొంగఅనీ, దగాకోరని తిడుతున్నారని.

ఆ ఐర్లెండు దేశస్థులతోపాటు వలసలోని వాళ్లు కూడా మళ్లీ బళ్లదగ్గిరికి వెళ్లారు. ఐర్లెండు దేశీయులు పదిమందీకలిసి వీళ్లతో మాట్లాడటానికి వచ్చారు. అందులో ఒకడిచేతిలో బరువైన పెద్దకొయ్య పలకఉంది. ఆమనిషి హాన్సఓల్సాని గురించి దురుసుగా మాట్లాడేస్తున్నాడు. "మీరు బ్రతికి బాగుపడదలచుకున్నవాళ్లైతే నా భూమిలోంచి వెంటనే అవతలికి పొండి," అన్నాడు ఓల్సా. ఆ ఐర్లెండు మనిషి ఇదివిని ఆయనదగ్గిరికి వచ్చాడు. వచ్చి ఆకొయ్యపలక పైకెత్తాడు. మిగిలిన వాళ్లంతా దూరంగా తప్పుకున్నారు. ఒక నిర్ణయానికి వచ్చాడంటే, ఆపైన ఓల్సా చాలాచురుగ్గా వ్యవహరిస్తాడు. ఆయన ఎడంచెయ్యిలేచి, ఆ ఐర్లెండు మనిషి ఎడమ చెవికింద ఫెడేల్మంది. ఆమనిషి పెద్దకేకపెట్టి కిందపడి పోయాడు. పడినమనిషి పడ్డట్టు చలనంలేకుండా ఉండి పోయాడు.

మిగిలిన నార్వే దేశస్థులంతా దెబ్బలాటకి సిద్ధంగా నిలబడ్డారు. కాని ఆ ఐర్లెండు పెద్దమనుషులు మెదలకుండా అలాగే నిలబడిఉన్నారు. హాన్సెబిల్సా కిందపడి ఉన్న మనిషిని బాగా పైకెత్తివాళ్లందరి తలలమీదుగా ఒకబండీ మీదికి విసిరి కొట్టాడు. ఆశరీరం ధబీల్మని ఆ బండీకి కొట్టుకుంది. మరుక్షణంలో తక్కిన ఐర్లెండు పెద్దమనుషులంతా కాలికి బుద్ధిచెప్పి, తిరిగి చూడకుండా పారిపోయారు.

"తీరిపోయింది. మళ్లీ వీళ్లు చస్తే మన జోలికి రారు," అన్నాడు పెర్హాంసా. నార్వే దేశీయులంతా ఇళ్లకి బయలు దేరారు. ఒక్కటానెసెటెక్ మాత్రమే వాళ్లల్లో లేడు. అతడు ఇంటికి చేరుకుని అప్పుడే చాలాసేపయింది.

చివరికి, ఆ ఐర్లెండు దేశస్థులు హాన్సెబిల్సా భూమికి ప్రక్కనున్న భూమి సంపాదించుకుని అక్కడే స్థిరపడ్డారు. పెర్హాంసా రోజూ కుర్రాళ్లని తీసుకుని వాళ్లదగ్గిరికి వెళ్లేవాడు. మొత్తం పదిడాలర్లదాకా బంగాళదుంపలు ఆయన వాళ్లకి అమ్మాడు. దానికి వాళ్లు ఎంతో సంతోషించారు.

ఈ జరిగిన కథంతా విని, ఆడవాళ్లూ ఊరుకోలేదు. బెరెట్‌కి విషయమంతా అర్థమయింది. ఇదన్నమాట తన భర్తచేసినపని. అలాంటి నీచపుపని తనభర్త చేస్తాడని తాను అనుకోలేదు. అయినా, భర్తతో తాను ఏమీ అనలేదు. ఆ ఐర్లెండు వాళ్లకి ఈ భూమిమీద ఏమీ హక్కులేదని బెరెట్‌కి ఇప్పుడు అర్థమయింది. అయితే; ఆ సరిహద్దు

కొయ్యలు పీక్కొచ్చినప్పుడు పెర్హాంసాకి ఈ సంగతి తెలియదుగదా! ఇదే ఆమె మనస్సుని వేధిస్తూంది.

చివరికి, పెర్హాంసా తను చేసినపని అందరికీ చెప్పాడు. ఒకరోజున వలసలో వాళ్లంతా కులాసాగా నవ్వుకుంటూ, కూనిరాగాలు తీస్తూ పెర్హాంసా ఇంటికి వచ్చారు. పెర్హాంసా తనకి ఆసరిహద్దుకొయ్యలు కనపడటం. ఆపైన తనుచేసిన పనీ, అంతా వాళ్లకి వివరంగా చెప్పాడు. అందరూ ఆయన్ని ఎంతో మెచ్చుకున్నారు. ఆయనతో •గాఢకరచాలనాలు చేశారు. బెరెట్‌కి ఇదంతా మనస్కరించలేదు. ''నేను పుట్టి పెరిగిన దేశంలో ఇతరులపొలాల్లో సరిహద్దుకొయ్యలు మాయంచేయటం మహాపాతకం. ఇక్కడ ఆ పనిచేయడం మహాఘనకార్యంగామాలు!'' అంది.

బెరెట్ విపరీతవైఖరి చూసి, అంతా తల్లక్రిందులయ్యారు. మరి కాసేపటికి అంతా చల్లగా వెళ్లిపోయారు. బెరెట్ ఎక్కడికో వెళ్లింది. పెర్హాంసా ఆమెకోసం ఎదురు చూడలేదు. తనకర్మాన తాను పడుకుని నిద్రపోయాడు. ఆ తర్వాత కొన్నాళ్లపాటు వాళ్లిద్దరూ మాట్లాడుకోలేదు.

---

## నాల్గవ భాగం

### ౧

శరత్కాలం వచ్చింది. పగటి పొద్దు నిలవడంలేదు. భారంగా జారిపోతూంది. బెరెట్ మౌనముద్ర, మనోవేదన నానాటికి సాంద్రమవుతున్నాయి. పాపకి, పిల్లలకి, పెర్హాంసాకి ఏవో గుడ్డలు కుడుతూ, అల్లుతూ రోజులు గడుపుతూంది. కుడుతూన్నప్పుడుకూడా గంటలకొద్దీ ఆవిశాలమైదానంలోకి చూస్తూంటుంది.

ఒకరోజున ఒంటరిగా కూచుని కిటికీలోంచి బయటికి చూస్తూంది. పెర్హాంసా, ఓల్ శీతకాలానికి కట్టెలు కొట్టుకు రావడానికి వెళ్లారు. ఆ మైదానంలోంచి తమ వలసవేపుకి కొన్ని పెట్టెబళ్లు వరసగా వస్తున్నాయి. ఆ దృశ్యం బెరెట్ కంటబడింది. వెంటనే ఆమె బయటికి వచ్చింది. ఈ భయంకరసీమకి ఇంకా కొందరు వస్తున్నారన్నమాట. తను పరుగెత్తుకువెళ్లి, వెనక్కి తిరిగి పొమ్మని వాళ్లకు సలహా చెప్పాలనిపించింది ఆమెకి. ఇంతలో హాన్స్ వచ్చాడు. "ఏమి

టమ్మా చూస్తున్నావ్?'' అడిగాడు. నెమ్మదిగా వస్తూన్న ఆపెట్టెబళ్లను కొడుకుకి చూపించింది. తను వాళ్లతో మాట్లాడాలన్నా అవకాశం లేదు.

''పరిగెత్తు. వాళ్లకి ఎదురుగా వెళ్లి, సాయం చెయ్యి;'' కొడుకుని పంపించింది.

వెంటనే హాన్స్ గుర్రం ఎక్కి ఉడాయించాడు. ఇంతలో శామ్‌సోలం పరిగెత్తుకుంటూ వచ్చాడు, బెరెట్ దగ్గిరికి. ఆవస్తూన్న పెట్టెబళ్లను సోలంకూడా చూశాడు. ఆ మాట టాన్సెటన్‌కి చెప్పాలని వెళ్తూ ఇలా వచ్చాడు. హాన్స్ఓలాకూడా కట్టెలు కొట్టుకు రావడానికి వెళ్లాడు. అన్నామేరీని చంకనేసుకుని బెరెట్ ఈవార్త చెప్పడానికి సారీనా ఇంటికి వెళ్లింది.

కాసేపట్లో, అంతా టాన్సెటెన్ ఇంటికి చేరారు. వాళ్లవాకిట్లోనిలబడి, తమవేపేవస్తూన్న ఆ పెట్టెబళ్లను చూస్తున్నారు. యథాప్రకారం టాన్సెటెన్ ఊరికే కంగారు పడిపోతున్నాడు. వీళ్లు ఆ ఐర్లెండువాళ్లకంటెకూడా దుర్మార్గులై తే! వలసలో ఇప్పుడు ఉన్న మగవాడు తను ఒక్కడు. ఛీ! దినదినగండంగా ఉంది ఇక్కడ బ్రతుకు!

కుర్రాడు హాన్స్ గబగబా వాళ్లదగ్గిరికి వచ్చేశాడు. ''వాళ్లు మన నార్వే వాళ్లే అమ్మా! వాళ్లు మన భాషే మాట్లాడుతున్నారు!'' అంటూ ఒక్కగుక్కలో చెప్పేశాడు.

"అరే! అద్భుతం!" టాన్సెటెన్ ధోరణి పూర్తిగా మారిపోయింది. "లేలే! గబగబా కాఫీ తయారుచెయ్యి. మనవాళ్ళకి మనం అద్భుతమైన ఆతిథ్యం ఇవ్వాలి," ఆదేశించాడు భార్యని.

ఆ ఐదు పెట్టెబళ్ళలో మొత్తం ఇరవైమంది మగవాళ్ళు వచ్చారు. వాళ్ళంతా నార్వేలో సోన్, వోస్ ప్రాంతాలవాళ్ళు. వాళ్ళకుటుంబాలు మిన్నెసోటాలో ఉన్నాయి. వాళ్ళూ భూమి సంపాదించుకోవాలని వచ్చారు. మళ్ళీ తూర్పు వెళ్ళి వసంతఋతువులో కుటుంబాలతో తరలివస్తారు. ఈ మహామైదానంలో నార్వే దేశస్థులు కనిపించడం వాళ్ళకీ అమితానందంగా ఉంది. అయితే, వాళ్ళ ఉద్దేశం ఇంకా పడమటికి వెళ్ళి జేమ్స్‌నదిసమీపంలో భూమి సంపాదించుకోవాలని. వాళ్ళుకూడా ఈ స్ప్రింగ్ క్రీక్ దగ్గిరే భూమితీసుకుని ఉంటే బాగుంటుందని నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు టాన్సెటెన్. ఆ డకోటామండలంలో తను చూసిన ఇతర ప్రాంతాలన్నిటినిగురించి వాళ్ళకి చెప్పాడు. అన్నింటిలోకి ఈ స్ప్రింగ్ క్రీక్ ప్రాంతం ఎన్నివిధాల మంచిదోకూడా వివరించాడు. వీళ్ళకి నచ్చజెప్పటానికి పెర్హాంసా ఉంటే ఎంత బాగుండేది! ఈ నార్వే సంసారులంతా తమతోపాటు ఇక్కడే ఉంటే ఎంత బాగుణ్ణు! అది టాన్సెటెన్ గాఢవాంఛ.

కాని, ఆ ఆగంతకులకి మనస్కరించలేదు. ఎక్కడా చెట్టూ చేమాలేకుండా, ఎటుచూసినా బంగరు బయలుగా ఉన్న ఈ ప్రదేశం వాళ్ళకి నచ్చలేదు. క్రింద కనుచూపుమేర

దాకా పరచినట్టు పచ్చని మైదానం, పైన నీలాకాశం తప్ప మధ్యలో అంతా శూన్యం. ఇక్కడ ఎలాఉండటం? ఇళ్లు కట్టుకుంటానికి కలప, పొయిలోకి కట్టెలు ఎక్కణ్ణించో తెచ్చుకోవాలి! టాన్సెటెన్ మామూలుకంటెకూడా తొందరగా మాట్లాట్టం మొదలుపెట్టాడు, కలప ఎంత దగ్గిర్లో దొరికేదీ చెప్పాడు. ఇక్కడ భూమిఎంత బలమైనదో వివరించాడు. ఇంక కొన్నాళ్లకి అదిపెరిగి పెద్దపట్టణ మైపోతుంది. దగ్గిర్లోకి రైలుకూడా పడుతుంది. "మీరే చూస్తారుగా!" అన్నాడు.

ఆ నార్వేదేశీయులంతా, తమ మకాంలో ఆరాత్రి భోజనాలుచేస్తూ టాన్సెటెన్ సలహాలో మంచి చెడ్డలు చర్చించుకున్నారు. వాళ్లల్లో చాలామంది అక్కడే స్ప్రింగ్ క్రీక్ దగ్గరే యేటికి అవతల భూమిసంపాదించుకుని ఉండిపోతామన్నారు. చివరికి మిగిలినవాళ్లుకూడా ఒప్పుకున్నారు. ఇది విని టాన్సెటెన్ కొండెక్కిపోయాడు. ఒక్కసారిగా ఇరవై కుటుంబాలు తమకు సహవాసులుగా వచ్చేటట్టు తను చేశాడు. అందులో, తమ దేశస్థులు!

కొంతకాలానికి మళ్లీ మగవాళ్లంతా పట్నంవెళ్లాలి పొచ్చింది. ఆ విషయాన్నిగురించి ఆలోచించడంకూడా బెరెట్‌కి ఇష్టంలేదు. నిజానికి ఆమె పెర్హాంసాతో మాట్లాట్టంలేదు. తన మనస్సులోమాట భర్తకి చెప్పలేదు. చెప్పినా ఆయన అర్థం చేసుకునేదీలేదు. అయినా, మగవాడు ఇంట్లోవుంటే అదొకధైర్యం. దిక్కూ, దివాణంలేని ఈ నిర్జన మైదానంలో ఒంటరితనం తనకి దుర్భరం. ఇప్పుడాయన వెళతాడు. వారం

రోజులదాకా తిరిగిరాడు. భర్తవెళ్ళక తప్పదని బెరెట్‌కి తెలియకపోలేదు. చలికాలం గడపబెట్టడానికి తమకు ఆహార పదార్థాలు కావాలి, బట్టలుకావాలి, వ్యవసాయ సామగ్రి కావాలి. అయినా, ఇప్పుడివన్నీ ముఖ్యావసరాలుగా కనిపించడంలేదు. ఆమెకి తనుచూస్తూన్నది, వింటూన్నది—ఏదీ ఆమె నమ్మలేకపోతూంది. తరచు ఆమె మనస్సు పరి పరి విధాల పరిభ్రమిస్తూంది.

ఈసారి పెర్హాంసా, హాన్సఓల్సా, హెన్రీసోలం కలిసి వెళుతున్నారు. టాన్సెటెన్ గుఱ్ఱాన్ని, బండినికూడా పెర్హాంసా తీసుకు వెళ్తున్నాడు. టాన్సెటెన్ ఇంటి దగ్గర ఉండి, బెరెట్‌కీ పిల్లలికీ అండగా ఉంటాడు. ఐర్లెండ్ దేశస్థులు పెర్హాంసాదగ్గర బంగాళదుంపలు కొన్నారు. నార్వే దేశస్థులు ఇంకా ఎక్కువగా కొన్నారు. అందుచేత, పెర్హాంసా దగ్గర డబ్బు బాగాచేరింది. ఆడబ్బంతా మూటగట్టుకుని బయలుదేరాడు పెర్హాంసా. కొనవలసిన వస్తువులు చాలాఉన్నయి. అంతడబ్బు తీసుకువెళుతున్నాడు గనక, అన్నీ కొనుక్కురావచ్చు అనుకున్నాడు. తను వచ్చేలోగా ఇంటిదగ్గర తల్లికి సాయంగా ఏమేమి చేయవలసిందీ కొడుకులికిచెప్పాడు. వాళ్ళిద్దరికీ తండ్రితో వెళ్ళాలనిఉంది. కాని ఎల్లా? తల్లిని ఒంటరిగా వదిలి వెళ్ళడానికి వీల్లేదు.

ఇంకా డబ్బుసంపాదించాలని పెర్హాంసా ప్రయత్నం. తనదగ్గిర బంగాళదుంప ఇంకా చాలాఉంది. అంత తనకు అనవసరం. కొంతసరుకు బస్తాలకెత్తి బండిమీాదవేశాడు.

వాటిపైన కొన్ని కూరగాయలు, కొన్ని పళ్ళుకూడా వేశాడు. వాటినన్నిటినీ పట్నంలో సెలవు చెయ్యాలి.

ఆ ప్రయాణం వాళ్ళకి అద్భుతంగా ఉంది. ఆ మైదానంలో ఇదివరకు ఏమీలేనిచోట ఇప్పుడు ఎన్నో కొత్త ఇళ్ళు లేచినయి. తొలిరాత్రి మకాంచేసినచోట పచ్చిచేపలు, బంగాళదుంపల వేపుళ్ళతో సుష్టుగా భోజనంచేశారు. అంతకంటె ఏంకావాలి? ఆమర్నాడు పట్నానికి చేరుకన్నారు. పట్నంలో దుకాణాలు చెదురువాటుగా అక్కడోటి అక్కడోటి ఉన్నాయి.

అక్కణ్ణించి వాళ్ళు విడిపోయి ఎవరిపనిమీద వాళ్ళు తలో వైపుకీ వెళ్ళారు. పెర్షంసా చిరునవ్వుముఖంతో బండీ తోలుకుంటూ పట్నంలో ఇంటింటికీ వెళ్ళి, "బంగాళదుంపలేమైనా పడతయ్యా?" అని అడుగుతున్నాడు. ఎంతసేపటికీ బేరం దొరకలేదు. చివరికి ఊరికి అవతలివేపున ఒకమట్టియింటిదగ్గిర బేరంతగిలింది. ఆ ఇంట్లో తండ్రిపోయిన ఇద్దరు కొడుకుల్ని పెట్టుకుని ఒకస్త్రీ కోళ్ళవ్యాపారం చేసుకుంటూ కాలక్షేపం చేస్తోంది.

కొంతసేపు బేరమాడినమీదట, తొమ్మిది మానికల బంగాళాదుంపలు ఆమెతీసుకుంటానికి, వాటికిబదులు మూడు కోడిపిల్లల్ని పెర్షంసాకి ఇవ్వటానికి బేరం ఫైసలయింది. ఈ బేరానికి ఉభయులు సంతోషించారు. ఆమె పెర్షంసాని ఆరాత్రికి భోజనానికి ఆహ్వానించింది. ఆయన సమ్మతించాడు. ఆయింట్లోకివెళ్ళి చూసేసరికి పెర్షంసాకి ఆశ్చర్యంవేసింది.

లోపలగోడలన్నీ తెల్లగా మెరిసిపోతూ, అందంగా ఉన్నాయి. ఈ మట్టింటికి ఇంత తెల్లటిగోడలు ఎలా వచ్చినయ్యని ఆమెని అడిగాడు. నీళ్లలో గుల్లసున్నంకలిపి గోడలకి కొట్టానని ఆమెచెప్పింది. వెళ్లేటప్పుడు గుల్లసున్నం కొనుక్కుపోవాలని పెర్హాంసా నిశ్చయించుకున్నాడు.

సుష్టుగా రుచికరమైన భోజనంచేశాడు. పెర్హాంసా వెంటనే కలపదుకాణానికి వెళ్లాడు. ఆ అడితియజమాని నార్వే దేశస్థుడు. పెర్హాంసా తెచ్చిన బంగాళదుంపలన్నీ తనుతీసుకుంటానన్నాడు ఆయన. వాటికి బదులుగా పెర్హాంసాకి అవసరమైన గుల్లసున్నం, అవసరమైనదానికంటె ఎక్కువకలప, కొన్ని మేకులుకూడా ఇచ్చాడు. మిగిలిన కర్రతో పుట్టబోయే పాపకి ఉయ్యాలమంచం చేసుకోవచ్చు అనుకున్నాడుపెర్హాంసా. ఆయన పచారీకొట్టుదగ్గిరికి చేరేసరికే మిగతావాళ్లు వాళ్లకి కావలసినవన్నీ కొనుక్కొని బళ్లల్లో ఎక్కించుకొంటున్నారు.

పెర్హాంసా బోలెడువస్తువులు కొన్నాడు. చివరికి, డబ్బంతా అయిపోవడంతో త్వరగానే తెమిలాడు. సన్నని తాడు చుట్టలుచుట్టలు కొన్నాడు, పెద్దవల అల్లడానికి. ఇది ఎందుకో తక్కినవాళ్లకి అర్థంకాలేదు. ఇక్కడ తమవృత్తి చేపలుపట్టడం కాదు గద! బెరెట్‌కోసం చిన్న చిన్న వస్తువులు చాలాకొన్నాడు. ఆ తర్వాత, చలికాలం గడవటానికి అవసరమైన వాడుకసరుకులన్నీ కొన్నాడు.

మళ్లీ ఇంటికి మళ్లారు అంతా. సదా సముద్రతీరానికి అలవాటుపడినవాళ్లకి ఈ విశాలమైదానంలో దీర్ఘయాత్ర సరదాగానే ఉంది.

తండ్రి వెళ్లి ఎంతోకాలం అయినట్టుంది, పెర్హాంసా కొడుకులకి. పొద్దస్తమానం వాళ్లు ఇంటిదగ్గిరే కూచోవాలి. అస లెవరితోనూ ఏమీ మాట్లాడని తల్లికెదురుగా కూచోవాలి. వాళ్లు అడుగడిక్కీ తగూలాడుకుంటున్నారు. తండ్రి తిరిగి వచ్చేదాకా రోజులు లెక్కపెట్టుకుంటూ గడిపారు.

ఇంత దూరం వచ్చి, నిర్మానుష్యమైన ఈదేశం కాని దేశంలో బ్రతకడం ఎంత దుర్భరం! ఇదే నిరంతరం బెరెట్ వ్యథ. ఈ బెంగతో ఆమె ఎవ్వరితో మాట్లాడటంలేదు. పిల్లలిక్కడ రెడ్డిండియన్ల పిల్లలలాగ పెరుగుతున్నారు. వాళ్లు పోట్లాడుకున్నప్పుడల్లా ఆమె దుఃఖం - ఇంకా ఎక్కువ అవుతూంది. ఇలా బ్రతకడంకన్న నీచత్వం మరొకటిలేదు. వాళ్లంతా పశువుల్లాగ పెరుగుతారు. తను భగవదిచ్ఛకు విరుద్ధంగా బ్రతుకుతూన్న సంగతి పెర్హాంసా గుర్తించడా? భగవంతుడు మనుష్యులకోసం సృష్టించినది కాదు ఈదేశం. అక్కణ్ణించి తిరిగి తరలిపోవడానికి ఉపాయం ఆలోచిస్తూంది బెరెట్.

చిలిపి పనికి సన్నాహం చేస్తూన్న చిట్టిపాపముఖం లోని చిరునవ్వురేఖలాంటిది బెరెట్ ముఖంలో మెరిసింది. ఆమె తిరుగు ప్రయాణానికి ప్రణాళిక వేస్తూంది. తాము వెంట

తీసుకొచ్చిన పెద్దపెట్టె తెరిచింది. అందులో అన్నీ జాగ్రత్తగా సర్దడం మొదలుపెట్టింది. కనీసం ఒకపనిఅయినా అయినట్టే! బైబులుపుస్తకం, ప్రార్థనలపుస్తకం తెచ్చి పెట్టెలో పెట్టింది. హాన్స్ చదువుకునే పుస్తకాలుకూడా తీసుకురమ్మంది.

"అమ్మా! ఎందుకమ్మా ఇలా సర్దుతున్నావ్?"

"మనం ఇక్కణ్ణించి వెళ్లిపోవాలి. అన్నీ సర్దుకోవాలి. చలికాలం రాకముందే మనం మళ్లీ మనుష్యులంతా ఉండే చోటికి చేరాలి," అంది విచారంగా.

హాన్స్ ఈ మాట నమ్మలేకపోయాడు. "నాన్న ఏమంటాడమ్మా?" అంతకంటె ఏమీ అనలేక, నిశ్చేష్టుడై అక్కడే నుంచున్నాడు.

బెరెట్ కడుపులో బిడ్డ ఒక తన్ను తన్నింది. "కడుపులో గాడ్ దెకూడా నామాట నిల్పటంలేదు," అనుకుంది బెరెట్. ఇక తనవల్ల ఏమీకాదు. ఇక్కడ తను ఒంటరిది. భగవంతుడు తనని పరీక్షిస్తున్నాడు. మెల్లగా నడుస్తూ బయటికివెళ్లింది, మళ్లీ ఆశూన్యప్రదేశంలోకి చూస్తూ కూచోటానికి. హాన్స్‌కూడా బయటికివెళ్లి ఆమెను కౌగిలించుకున్నాడు. ఇద్దరూ ఏడవటం మొదలుపెట్టారు, ఆ శూన్యప్రదేశానికి ఎదురుగా నిలబడి.

అచిరకాలంలోనే మగవాళ్ళందరు ఇళ్లకు వచ్చారు. పెర్హాంసా పరమానందంగా ఉన్నాడు. ఎన్నోవిషయాలు చెపుతున్నాడు ఉత్సాహంగా. విచారంగా ఉన్నవాళ్లుకూడా

అంతా మరిచిపోయి వింటున్నారు. భర్తకు ఆరాత్రి భోజనానికి రకరకాల వంటకాలు తయారుచేస్తూన్న బెరెట్ ముఖంలో కూడా ఒక మందహాసరేఖ మెరిసింది.

వాళ్ళంతా చెయ్యవలసిన పనులు ఎన్నో ఉన్నాయి. పిల్లలంతా పడుకున్న తర్వాత ఫ్వెర్హాంసా, తను తెచ్చిన సున్నంసంగతి, వలతాడు సంగతి బెరెట్‌కి చెప్పాడు. ఆవలతో తను సూక్స్‌నదిలో పెద్ద పెద్ద చేపలు పట్టుకొస్తాడు. బహుశః దాంతోనే, బాతుల్నికూడా పట్టొచ్చు. పిల్లలకి ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. బెరెట్ నిద్రపోయింది. పెర్హాంసామాత్రం తెల్లవార్లు కూచుని వల అల్లాడు. తెల్లవారేసరికి వల తయారయింది. ఉదయోపాహారం అయిన తర్వాత, పెర్హాంసా ఆవల, కొన్ని బంగాళదుంపలు తీసుకుని గుర్రమెక్కి వెళ్ళిపోయాడు. ఆ బంగాళదుంపలు నదిఒడ్డున వున్నవాళ్ళకి ఉచితంగా పంచిపెట్టడానికి. మర్నాడు తిరిగి వస్తానని చెప్పాడు. మళ్ళీ ఇంట్లో బెరెట్‌కి ఏకాంతవాసం. అయితే, ఇప్పుడది అంత బాధాకరంగా లేదు.

౨

అక్టోబరు ఆరంభంలోనే కొంచెం మంచు కురవడం ప్రారంభమయింది. అయినా అంత ఎక్కువగా కురవడం లేదు. ప్రతిఉదయం సూర్యుడు పైకి చక్కావస్తూ, ఇంకా పగలంతా వెలుగుతున్నాడు. అయితే, ఆబీరెండకి ఎండేది గాని, వేడెక్కేదిగాని ఏమీ కనిపించడంలేదు. సాయం

సంధ్యలు సువర్ణారుణశోభలతో సుందరతరశోభలతో వెల్లి విరుస్తున్నాయి. రోజులన్నీ ఒకే కక్ష్యలో దొరలిపోతున్నాయి. మార్పులేకుండా ఒకదాన్ని వెన్నంటి ఒకటి ఇలా సాగిపోతూ చివరికి ఒకరోజున సూర్యదర్శనమే కాలేదు. ఆ శూన్యమైదానమంతా ముసిముసిచీకట్లతో, నిశ్చలంగా, నీరవంగా ఉండిపోయింది.

సాయంకాలం మళ్లీ ఎడతెగకుండా మంచు కురవడం ఆరంభించింది. ఆరాత్రంతా, మర్నాడు పగలంతా కురుస్తూనే ఉంది. ఆనలసలోనివాళ్లు ఆ అపారహిమసాగరంలో ఎవరికివారే ఏకాకులుగా బిక్కుబిక్కుమంటూ కాలక్షేపం చేస్తున్నారు.

చలికాలం చొరబడడానికిపూర్వం కొన్నాళ్లపాటు పెర్హాంసా, ఆయనకొడుకులు ఎడతెగకుండా పనిచేశారు. బెరెట్ మాత్రం వాళ్లతోపాటు పనిలోగాని, ఆపనినిగురించి వాళ్లసంభాషణల్లోగాని పాల్గొనలేకపోయింది. ఆమె మౌనముద్ర అంతకంతకి సాంద్రమౌతూంది. ఆమె ఏదో అంధకార నీరవలోకంలో ఉంటున్నది.

పెర్హాంసా చాలా పని చేశాడు. ఇంటిలో గోడలన్నిటికి సున్నంవేయడంతో అవి ఇప్పుడు బయటిమంచుతో సమానంగా తెల్లగా మెరుస్తున్నాయి. కొడుకులిద్దరిని తీసుకుని సూక్స్‌నదికివెళ్లి బోలెడు చేపలు పట్టుకొచ్చాడు. ఆ చేపల్నిప్పుడు బయటమంచులో కప్పిపెట్టారు. కొన్ని చేపల్ని ఉప్పు కలిపి జాడీల్లో నిల్వచేశారు, చలికాలం

పొడుగునా వాడుకుంటానికి. పట్నం వెళ్లి వచ్చిన తరువాత పెర్వ్హాంసా తయారుచేసిన వల తీసుకుపోయి కొన్ని బాతుల్ని కూడా పట్టుకొచ్చారు, తండ్రీకొడుకులూ. చెరువుపేరుకొని గడ్డకట్టుకుపోయేవరకూ, కొన్నాళ్లు ప్రతిరోజూ రాత్రి బాతుల వేటకి వెళ్లేవాళ్లు. ఇప్పుడు వాళ్లకి కావలసినన్ని బాతులు ఉన్నాయి. 'మహారాజుల తిండి తింటున్నాం' అనుకున్నాడు పెర్వ్హాంసా.

ఈమధ్య ఇరుగుపొరుగువాళ్లను కలుసుకోటంకూడా చాలావరకు తగ్గిపోయింది. వాళ్లూ పెర్వ్హాంసా లాగే చలి కాలం వెళ్లబుచ్చడానికి అన్నీ సన్నద్ధంచేసుకోటంలో నిమగ్నులై ఉన్నారు. మరోకారణం ఇంటికి ఎవరు వచ్చినా బెరెట్ మాట్లాడకపోవడం, వింతగా ప్రవర్తించడం. అయితే, పెర్వ్హాంసా చాలా బాతుల్ని పట్టుకొచ్చాడని, ఎలా పట్టుకొచ్చిందీమాత్రం చెప్పడంలేదనీ తెలిసి, ఒకరోజున అంతా వాళ్లయింటికి వచ్చారు, ఆ బాతులకోసం.

తీరా ఇంట్లోకి వచ్చేసరికి, తెల్లగా మెరసిపోయే ఆ గోడల్ని చూసి వాళ్లు బాతులసంగతే మరిచి పోయారు. ప్రత్యక్షంగా కళ్లతో చూస్తూన్న దృశ్యాన్ని వాళ్లు నమ్మలేక పోయారు. ముఖ్యంగా ఆడవాళ్లు అమితసంతోషంతో, బెరెట్‌ని అభినందించారు, ఇంటివిషయాల్లో కూడా అంత శ్రద్ధ తీసుకునే అలాంటి భర్త దొరికినందుకు. ఓవిధంగా బెరెట్‌కీ కొంత ఆనందంకలిగింది. కాని, ఇలాంటివేవీ ఆమెలో

పెద్దమార్పు తెచ్చే అవకాశం ఉన్నట్టులేదు. తన మనస్సు వెలుపలమైదానంలాగ అంధకార హిమావృతమై ఉంది.

చలికాలం ముదిరి దారుణంగా పరిణమించిన మీదట గాని పెర్రాంసా చిరకాలంగా తనకు అవసరమయిన విశ్రాంతి తీసుకోలేదు. ఇప్పుడు తృప్తిగా కడుపునిండా భోజనం చేస్తున్నాడు. పగలు రాత్రి కూడా నిద్రపోతున్నాడు. అక్కడికీ నిద్ర చాలడంలేదు. కాని, కొన్నాళ్ళకి ఆయనకి ఇలాపని పాటు లేకుండా కూచోటం అంటే విసుకుపుట్టింది. ప్రతిదినం, మిగిలిన అన్ని దినాల్లాగే వస్తూంది, పోతూంది. అడపాదడపా ఏవో నాలుగుకట్టెలు కొట్టుకోటం తప్ప, చేయాలన్నా ఏమీ పనిలేదు. మంచు కురవడానికి అంతులేకుండా ఉంది. ఆ మంచు గుట్టలలోంచి, ఆమంచు తెరల్లోంచి అవతలవాళ్ల ఇళ్లు కూడా కనిపించడంలేదు.

పిల్లలకు చేసేపని ఏంలేదు. అంచేత ఉండుండి పోట్లాడుకుంటున్నారు. ఎప్పుడో ఓసారి పుస్తకాలు తీసుకుని చదవడానికూర్చుంటారు. కాని, ఆచదువూ శీతకాలపు చదువే!

అప్పుడప్పుడు వాళ్ల స్నేహితులే వచ్చిచూసి పోతున్నారు, బెరెట్ ఎక్కడికీ వెళ్లేస్థితిలో లేదని. జెన్స్ట్రీపుట్టి బోయే పాపాయికి చిన్నచిన్న బహుమతులు తీసుకువచ్చింది సోరీనా ఎరుపు, తెలుపు, నీలం ఊలుతో పాపకి చక్కని టోపీకుట్టుకొచ్చింది. బెరెట్ వాటిని తీసుకుని [illegible] పక్కన పెడుతూండగా ఆమెకి కళ్లలో నీళ్లు తిరిగాయి

ప్రౌఢ స్తమానం పెర్హ్మాంసా ఊరికే కూచుంటూన్నందువల్ల, ఇప్పుడు బెరెట్‌ని పరిశీలనగా చూడడానికి వీలయింది. ఆయన పరిశీలనాఫలితం ఆయనకు ఇంకా విచారహేతువయింది. ఆమె బాగా చిక్కి శల్యమయింది. ముఖం పాలి తెల్లబడి పోయింది. ఇదివరకు ఏకాన్పుకీ ఆమె ఇంత నీరస పడలేదు. ఇరుగు పొరుగువాళ్లతో ఇంతముభావంగా, ఇంత విచారంగా ఎన్నడూ ప్రవర్తించేదికాదు. ఆహారం కూడా సరిగ్గా తీసుకుంటున్నట్టు లేదు. ఇంట్లో అన్నీ పుష్కలంగా ఉన్నాయి. తనకు ఏది హితవనుకుంటే అది చేసుకుతినొచ్చు. ఒకరోజున భోజనాలు చేస్తున్నప్పుడు చేపలకూర ఒక ప్లేటు నిండా తీసి ఆమె ముందు పెట్టాడు పెర్హ్మాంసా. ఆమె కాస్త నంజి లేచి పోయింది.'' బాగుంది! నాకుతిండి ముఖ్యం కాదు.'' అంది బెరెట్.

ఆమె ఇంచుమించు తెల్లవార్లు మేలుకొనే వుంటుంది. రోజూ ఆమె పడుకోకముందే పెర్హ్మాంసా నిద్రపోయేవాడు. ఉదయం పెర్హ్మాంసాలేచి చూచేసరికి, ఆమె అంతకు ముందే ఎప్పుడో లేచి పనిచేసుకుంటూ ఉండేది. ఒకరోజు రాత్రి ఆమె తన ప్రక్కనేకూచుని ఎడతెరిపి-లేకుండా ఏడుస్తూంది. పెర్హ్మాంసాకి మెలుకువవచ్చి చూశాడు. హాన్సకి జబ్బు చేస్తున్నట్టుంది అనిట ఆమె విచారం. నిజానికి అలాంటిదేమీ లేదు.

మామూలుగా ఆమె ఎప్పుడూ పరిశుభ్రంగా, నాజూకుగా ఉండేమనిషి. ఇప్పుడామె స్నానానికి కూడా బద్ధ

కిస్తున్నట్టు కనపడుతూంది. కేశసంస్కారం పూర్తిగా మానేసినట్టే. బట్టలు మాసినా, చినిగినా— చూసుకోటం లేదు. ఆ విషయంలో పెర్వాంసా ఆమెకు ఏమీ చెప్పలేదు. ఆమె నిరంతరం శుభ్రంగా ఉండేమనిషి. ఇప్పుడేమిటో పూర్తిగా మారి పోయింది!

ఈ ప్రవర్తన అంతటికీ ఏదో సమాధానం చెప్పుకోటానికి ప్రయత్నించాడు పెర్వాంసా. కాని, ఇప్పుడు తను తీరు బాటుగా ఇంట్లో కూచుని చూస్తూన్న చిన్నచిన్న విషయాలన్నీ కలిసి ఆయనకు ఆందోళన కలిగిస్తున్నాయి. తను ఆమెతో ఎలా మాట్లాడినా, ఏమిమాట్లాడినా, ఆమె మనస్సు ఎక్కడో ఉంటూంది. ఆమె ఇకమారదనీ, తమ భవిష్యత్తును గురించి తాను కంటూన్నకలలను ఆమె అర్థంచేసుకోదనీ చివరకు పెర్వాంసా నిశ్చయించుకున్నాడు. తను ఏంచేయగలడు?

చాలా సామాన్యమైన విషయాలు కూడా ఆమె మరచిపోతూంది. ఏదో వస్తువుతీసి పక్కన పెడుతుంది. అప్పుడే దానికోసం ఇల్లంతా వెతుకుతుంది. అది తనుపెట్టిన చోటనే ఉన్నదని ఆమెకు జ్ఞాపకం ఉండదు. ఇలాంటి ఏమరుపాట్లు చూచి ఎవరైనా నవ్వితే, ఆమె ఏడుస్తూ కూచుంటుంది. ప్రసవమైతే, ఆతర్వాత ఇవన్నీవాటి అంతట అవే సర్దుకుంటాయని పెర్వాంసా తనకు తాను సమాధానం చెప్పుకుంటున్నాడు. పురుడు రావటానికీ ఇక ఆట్టే వ్యవధిలేదు.

చలి అంతకంతకి దారుణంగా ఉంటూంది. ఇప్పుడు ప్రొద్దస్తమానం మంచు కురుస్తూంది. హోరున ఈదరగాలి వేస్తూంది, ఇంచుమించు ఎడ తెరిపి లేకుండా. సాయంసంధ్యలు మాత్రం ఇంకా సుందరంగానే ఉంటున్నాయి. అస్తమిస్తూన్న సూర్యుని ప్రభ పలురంగులతో, ఎరుపు, పసుపు, నీలపు మంటలలా వెలిగిపోతూంది. ఆతర్వాత స్వచ్ఛమైన చంద్రోదయం. నిరామయమైన ఆకాశంలోంచి వ్రేలాడుతూన్న గుండ్రని సువర్ణకుంభంలాంటి చంద్రుడు!

సూక్స్‌నదీ తీరానఉన్న ట్రాండర్స్ పల్లెకు వెళ్లి రావాలనుకున్నాడు పెర్హ్యంసా. కాని వెళ్లలేక పోయాడు. అంచేత, మేజాబల్ల ప్రక్కన బెరెట్‌ని చూస్తూ కూచుంటున్నాడు. శీతకాలపుచలి ఆమెకు ఆందోళన కలిగిస్తూందని గ్రహించాడు. అందుచేత, ఇంట్లోకుంపటి నిరంతరం వెలుగుతూ వెచ్చగా ఉండేటట్లు జాగ్రత్తగా చూస్తున్నాడు. అయినా ఆమెకాళ్లు చలితో కొంకర్లు దిరుగుతున్నాయి. అందుకోసం, ఒకరోజున ఆమెకి రెండు కొయ్యచెప్పులు తయారు చెయ్యడానికి తీర్మానించుకున్నాడు. అవి తొడుక్కు తిరుగుతూంటే కాళ్లకు వెచ్చగా హాయిగా ఉంటుంది. కష్టపడి శ్రద్ధగా పనిచేసి నున్నగా అద్భుతంగాఉన్న కర్ర చెప్పుల జోడు తయారుచేసి ఆమెకిచ్చాడు. అవి ఆమెకు ఆనందం కలిగించటం చూశాడు. కాని, అవి తొడుక్కుని ఆమెఅన్నమాట ఇది, "ఇది ఇదివరకెప్పుడో జరగవలసినపని ఈ చలికాలమంతా వట్టి కాళ్లతోనే తిరిగాను." ఆమాటలు

ఆమె దురుద్దేశంతో అనలేదు. మనస్సుకి తోచినమాట ఏదో అనేసింది. కాని, పెర్హ్వాంసాకి అవి శూలాలలాగ గుచ్చుకున్నాయి. ఒక్కసారి గట్టిగా ఏడ్చేస్తే బాగుణ్ణనుకున్నాడు.

ఈ ఆవేశం ఒకరోజున అమితకోపరూపంలో పెర్హ్వాంసా నించి బహిర్గత మయింది తాను ఏమిచేస్తున్నదీ కూడా ఆయనకు తెలియలేదు. ఒకరోజున హెన్రీసోలంవచ్చి తమ ఆవును వచ్చేవసంతందాకా తనవద్ద ఉంచుకోమని కోరాడు. తాను, తనసోదరుడు మిన్నెసోటా వెళ్లి క్రిస్మస్‌కి తల్లిదండ్రుల దగ్గరఉండి రావాలనుకొంటున్నట్టు చెప్పాడు. వాళ్లు ఎక్కడికి వెళుతున్నదీ వినగానే పెర్హ్వాంసా బల్లమీంచి ఒక్క దూకు దూకాడు. "పొండి! మీ ముసలి ఆవునికూడా మీతోపాటు తోలుకుపొండి. మీఆవుపాలు మాకక్కర్లేదు!" అన్నాడు.

హెన్రీమాత్రం తొందరపడకుండా ఏదో కాసేపు మాట్లాడి వెళ్లిపోయాడు. పెర్హ్వాంసా కిటికీలోంచి బయటికి చూస్తూ కూచున్నాడు. బెరెట్‌వచ్చి, ఆ సోలంయువకులు వెళ్లిపోవాలనుకోటం తనకేమీ ఆశ్చర్యం కలిగించలేదంది. ఎవరు మాత్రం ఇక్కడ ఉండిచేయగల నిర్వాక మేముంది గనక!

"ఏమిటీ?" అన్నాడు. పెర్హ్వాంసా; "ఇద్దరు మొద్దుల్లాంటి కుర్రాళ్లు ఇక్కడ చేయగలిగిందేమీ లేదు? అస్తమానం ఇంట్లోకట్టుకుని కూచోవలసిన అవసరంలేకపోతే, నేనీ

పాటికి మనపొలానికి, ధాన్యపుకొట్టుకి, పెద్దఇంటికీ సరిపడే కలప నరుక్కొచ్చి పారేశేవాణ్ణి!'' అన్నాడు.

''పోనీ, వెళ్లి తెచ్చుకోకూడదూ?'' అంది బెరెట్ యథాలాపంగానే.

''నువ్వేనా ఆమాట అంటున్నది? నిన్ను ఈస్థితిలో విడిచి నేనెలా వెళ్లగలనో ఆలోచించావా?''

బెరెట్ ఆవేశరహితంగానే మాట్లాడుతూంది. తనా స్థితికి ఎలావచ్చింది? ఆయన తీసుకువచ్చిపెట్టినస్థితే అది. అంతకన్న రవంతకూడా విశేషమేమీ లేదు. తనకోసం ఆయన ఇంటి నంటిపెట్టుకుని కూచోనక్కర్లేదు.

పెర్హాంసా పెద్ద కేకపెట్టాడు. పిల్లలిద్దరూ ఉలిక్కిపడ్డారు. అన్నామేరీ తల్లిని కావిలించుకుని ఏడవడం మొదలుపెట్టింది. టోపీ, చలికోటు తీసుకుని పెర్హాంసా చరచర ఇంట్లోంచి వెళ్లిపోయాడు. దాదాపు ఆరోజంతా ఆయన బయటే ఉన్నాడు. కొడుకు లిద్దరికీ మంచుమీాదనడిచే ''స్కీస్'' కొయ్యలు చెరోటీ తయారు చేస్తూకూచున్నాడు. మళ్లీ అతను లోపలికి వచ్చేసరికి రాత్రిభోజనం బల్లమీాద పెట్టి ఉంది. బెరెట్ అప్పటికే పడుకుని నిద్రపోతూంది.

భోజనం చెయ్యగానే మళ్లీ బయలుదేరి హాన్సోల్సా ఇంటికి వెళ్లాడు. ఆరాత్రి కాస్త బెరెట్‌కి సాయంగాఉండమని సోరీనాని పిలిచాడు. ఇంట్లోవాళ్లు తప్ప ఏరోజున మరోముఖం కనిపించక పోవడంతో బెరెట్ ఒంటరితనం సహించలేకుండా

ఉంది. సారీనా వెంటనే బయలుదేరి వెళ్లింది, హాన్స్‌ఓల్సాతో మాట్లాడుతూ పెర్హాంసా అక్కడే ఉండిపోయాడు.

ఆయన లోపలికి వెళ్లాడో లేదో, టాన్సెటెన్ హడా విడిగా పరుగెత్తుకొచ్చాడు. అతని వాలకం అంతా చిత్రంగా ఉంది, సోలం సోదరులు వెళ్లిపోతున్నారని తాను విన్నాడు. పెర్హాంసా, హాన్స్‌ఓల్సాలే ఇందుకు కారకులన్నాడు. వాళ్లిద్దరు తమపిల్లలకు శీతకాలపు బడిపెట్టి నడపమని హెస్రీసోలంని కోరిఉంటే, వాళ్లు వెళ్లేవాళ్లుకారు. తనకి పిల్లలులేరు. అయినా, వాళ్లది ఆపడంకోసం ఆబడికి తనుకూడా కొంతడబ్బు ఇస్తానన్నాడు. ఒకమాట మాత్రం నిజం, వాళ్లు వెళ్లిపోతే మళ్లీరావడం అబద్ధం.

హాన్స్‌ఓల్సా ఈవిషయాన్నిగురించి కొంతసేపు ఆలోచించవలసి వచ్చింది. కాని, చివరికి తనువెళ్లి సోలం సోదరులతో మాట్లాడటానికి ఒప్పుకున్నాడు. పెర్హాంసాకి జ్ఞాపకం ఉంది తను హెస్రీసోలంని కసురుకున్నమాట. అయినా, ఆయనా వెళ్లాడు. వాళ్లిద్దరు సరిగ్గా సమయానికే వెళ్లారు. సోలం సోదరులు సామాన్లు సర్దేసుకుంటున్నారు. చర్చలు చాలాసేపు సాగినయి. సోలం సోదరులు ప్రయాణం మానుకోలేమన్నారు మొదట. కాని, చివరికి పిల్లలకు చదువుచెపుతూ అక్కడే ఉండటానికి ఒప్పుకున్నారు. వాళ్లు ఒక్కొక్కవారం ఒకళ్ల ఇంట్లో ఉంటారు. ఆయింటికి ఆడవాళ్లు వాళ్లబట్టలు కుట్టిపెడతారు. ఆ విధంగా వాళ్లబెంగ చాలావరకు తీరిపోతుంది.

బెరెట్ అన్నిరోజులూ ఒకే విధంగా గడిపేస్తూంది. అస్తమానం వాళ్ళకుటీరంలోని నల్ల నేలవేపే చూస్తూకూచుం టుంది. ఆమెకు రాత్రితప్ప పగలనేది కనిపించడంలేదు. పగటి వెలుగునుకూడా ఇంట్లోకి చొరనివ్వడంలేదు. తను పాపం చేశానని, అందుచేత భగవంతుడు తనను ఈ నిర్జన శూన్యం లోకి తోలి శిక్షిస్తున్నాడని ఆమెనమ్మకం. ఆమె పాపం చేసింది; ఒకరి బలవంతం వల్లకాదు; తనకుతానై చేసుకున్న పాపం. అనుభవించక తప్పదు.

నిజమే ఓల్ తమకు పెళ్ళికాక పూర్వమే పుట్టాడు. అయినా, తనని తల్లిదండ్రులు పెర్హాంసాకిచ్చి పెళ్ళిచేయడా నికి సమ్మతించలేదు. బిడ్డనీ, తననీకూడా కడుపులో పెట్టుకుని చూసుకుంటామన్నారు. కాని, తను పెర్హాంసానివదలి బ్రత కలేనంది. తల్లిదండ్రులమాట తోసిరాజంది. ఎన్నివిధాల వాళ్ళు తనను బ్రతిమాలిందీ ఆమెకిప్పుడు జ్ఞాపకం వస్తూంది. తాను పెడచెవిబెట్టి పెర్హాంసాతో వచ్చేసింది. కన్నవాళ్ళ మనస్సులను క్షోభపెట్టింది. తనుచేసిందిమహాపాపం, శిక్ష అనుభవిస్తూంది.

పెర్హాంసా అమెరికాకి ప్రయాణం కట్టగానే, వాళ్ళువచ్చి తమపడవ, వలలు అన్నీ ఆయనకు ఇస్తామన్నారు. అక్కడే హాయిగా ఉండండన్నారు. తమబిడ్డ జన్మలో తమకళ్ళ బడ కుండా సముద్రాలకవతల ఎక్కడో కానని గంతలకు తీసుకు పోవద్దని బ్రతిమాలారు. కాని, తను నిశ్చింతగా పెర్హాంసాతో వచ్చేసింది. తల్లిదండ్రులు తనమీద బెంగతో తల్లడిల్లు

తారని గాని, వాళ్ల కన్నీటిని గాని తను లెక్క—చెయ్యలేదు. పెర్వంసాతో పడమటిముఖంగా ప్రయాణమై వెనక్కి—తిరిగి చూడకుండా అమెరికావచ్చేసింది. ఇంతకన్న దుర్మార్గం ఇంకేం కావాలి. ఆపాపమే తనను కట్టి కుడుపుతూంది.

పోనీ, ఇక్క—డస్థితి ఏఁమన్నా బాగుందా అంటే, అదీ లేదు. పట్టెడు మెతుకో—సం కండలు కరిగేటట్టు పని చెయ్యాలి. ప్రతివిషయంలోను భగవంతుని హస్తం బెరెట్ కి స్పష్టంగా కనిపిస్తూంది. ఇదంతా తనకు భగవంతుడు విధించిన శిక్ష. అమెరికాకు రావడంతో తమ ప్రయాణం పూర్తి కాలేదు. ఇంకా పడమటికి చాలాదూరం పోవాలన్నారు. పడమటికి,—ముక్కు—కి సూటిగా పడమటికి,—ఎడతెగని ప్రయాణం. పడమటిభూములు మంచివి; అక్క—డ బ్రతకటం సులభం అన్నారు ఎవరుపట్టినా. వయసులో ఉన్నవాళ్లేకాదు, ముసలివాళ్లకూ—డా ఇదే వెర్రి. ఇక్క—డ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఉన్నాయట. కావలసినంతభూమి, ఎవరిభూమికి వాళ్లే యజమానులు కావచ్చునని ఆశ.

తను మళ్లీ గర్భవతి అన్నసంగతి ధ్రువపరచుకోగానే, బిడ్డపుట్టేవరకూ ఆగుదామని భర్తని బ్రతిమాలింది. కాని, హాన్సబిల్లా వెళ్లిపోతున్నాడు. ఆయనతోపాటు అప్పుడే వెళ్లాలని ఆయన పట్టుపట్టాడు. భర్తకి తనంటే ఎంతప్రేమో తనకి తెలుసు. అదీ తనే ఒప్పుకుంది. అదంతా తన పాపమే. ఆయనదేమీ లేదు. తనకి తెలుసు. అందుకే శిక్ష అనుభవిస్తూంది.

అ_స్తమానం బెరెట్ తను చేసిన తప్పులను గురించే, తన పాపాన్ని గురించే మరీ మరీ ఆలోచిస్తూంది. తనకు మృత్యువు ఆసన్నమయిందని నిశ్చయించుకుంది. ఈసారి తను పురిటిమంచంలోంచి మళ్లీ లేవడం వట్టిది. తన సమాధి తమ కుటుంబ శ్మశానంలో జరగదు. ఆస్థితిలోకూడా, తాను మళ్లీ స్వజనం మధ్యకు చేరలేదు. ఈ విశాలశూన్యమైదానంలో బిక్కుబిక్కుమంటూ ఒంటిగా ఉంటుంది తన సమాధి. భర్తతో తన సమాధిసంగతి ఎప్పుడో చెప్పెయ్యాలి.

ఇక ఆట్టే వ్యవధిలేదు. రోజులమీదఉంది. తనజీవితం ముగింపుకి వచ్చేసింది. తనను ఇంటిదగ్గిర్నించి తెచ్చుకున్న పెద్దపెట్టెలో పెట్టి సమాధిచేయడం తనకు ఇష్టం. అందులో సామాన్లన్నీ తీసి వేరేపెట్టెలో సర్దేసెయ్యాలి. ఈ విషయం తను పెర్హంసాకి వెంటనే చెప్పెయ్యాలి.

## 3

క్రిస్మసు క్రితంరోజు రాత్రీ, ఆమర్నాడు పగలంతా కూడా మంచు కురుస్తూనే ఉంది. క్రిస్మసుపండగ వచ్చినట్టే లేదు. బయటకూడా రోజంతా అంత చీకటిగా ఉంది. పెర్హంసా ఇంట్లో అంతా ఆందోళనతో ఎదురుచూస్తున్నారు. అంతకన్న వాళ్లు చెయ్యగల్గిందిక ఏమీలేదు. జెర్స్టీ ఒక రోజున, సారీనా ఒకరోజున బెరెట్ని కనిపెట్టుకుని ఉంటున్నారు. కానుపుకి ఇంక ఆట్టే వ్యవధిలేదు.

బెరెట్ కంటెకూడా ఎక్కువగా పెర్హాంసాకి తోడు అవసరంగా కనిపిస్తూంది. ఎప్పుడు చూసినా దిగాలుబడిన ముఖంతో పచార్లుచేస్తూ కాలక్షేపంచేస్తున్నాడు. పిల్లల్ని ప్రతిదినం హాన్సబిల్సా ఇంటికి పంపుతున్నాడు. రోజంతా అక్కడ కాలక్షేపం చెయ్యడం అలవాటయిపోయింది వాళ్లకి. వాళ్లు లేకపోతే ఇంట్లో ఎక్కడా సడీ చప్పుడూ లేదు. ఇల్లంతా చిన్నబోయింది. ఉండుండి బెరెట్ చిరునవ్వు నవ్వుతుంది. అది అగాధ విషాదమయ మందహాసం.

క్రిస్మస్ రోజున మిట్టమధ్యాహ్నం తెరిపి ఇచ్చింది. ఆకాశం మనోహర నీలకాంతితో వెలుగొందుతూంది. ఆ మంచు సముద్రంమీద వ్రేలాడుతూన్న బంగారుబంతిలాగ సూర్యుడు మెరిసిపోతున్నాడు. ఆ మధ్యాహ్నం బెరెట్ నెప్పులు పడుతూంది. పిల్లలు హాన్సబిల్సా ఇంట్లో క్రిస్మస్ పండుగ సంతోషంలో ఉన్నారు.

సొరీనా, జెర్ స్టీకూడా సాయం వచ్చారు. పెర్హాంసా చలికోటువేసుకు బయటికి పోతున్నాడు. మళ్లీ వెంటనే తిరిగి వస్తున్నాడు. బెరెట్ మూలుగు, కేకలు పెర్హాంసాకి వినపడు తున్నాయి. చివరి కాయన తన కివి ఆట్టే వినపడకుండా పశువుల వసారాలోకి పోయి కూచున్నాడు. జెర్ స్టీ బయటికి వచ్చి పెర్హాంసాని పిలిచింది. బెరెట్ భర్తని పిలవమంది. పెర్హాంసా లోపలి కెళ్లవలసివచ్చింది.

పెర్హాంసా ఆమె ముఖంలోకి చూడలేకపోయాడు. అంత భయవిహ్వాలమైన ముఖం ఆయన ఎన్నడు చూడలేదు.

తాను భర్తతో మాట్లాడాలి. మిగిలినవాళ్లందరినీ బయటికి వెళ్లమంది బెరెట్. "నేటితో మీకు నాకు ఋణం తీరిపోయింది. ఇది నా అంత్యదశ,......నాపాప ఫలితంగా భగవంతుడు నాకు ఆజ్ఞ ఇచ్చాడు. ఇక నే నుండను. మీదారి మీరు చూసుకోవాలి. అన్నా మేరీని జెర్సీ కిచ్చెయ్యండి. ఆమె పసిబిడ్డకోసం పరితపిస్తూంది. మీరు మగపిల్లలిద్దరినీ తీసుకుని ఇక్కణ్ణించి వెళ్లిపొండి. నేను ఇక్కడే ఈ శూన్యప్రదేశంలో సమాధి అయిపోతాను. నన్నొ పెద్ద పెట్టెలో పెట్టి సమాధిచేస్తాననిమాత్రం మాట యివ్వండి. సమాధి బాగా లోతుగా తవ్వించండి, ఈ శూన్యదేశంలో రాత్రి తగని భయంకరంగా ఉంటుంది!"

పెర్హాంసా ఇక వినలేకపోయాడు. రెండుచేతులతో ముఖం కప్పుకుని ఏడవటం మొదలుపెట్టాడు. "బెరెట్! నాబెరెట్! అలా అనకు. కొంచెంసేపట్లో అంతా బాగయిపోతుంది. రేపు నువ్వు మళ్లీ మామూలు మనిషివై పోతావు."

ఆమె మళ్లీ బాధతో మూల్గుతూ అంది: "లాభం లేదు. ఈవేళరాత్రే నే నెలాగూ చచ్చిపోతాను. నన్నొ పెద్దపెట్టెలో పెట్టి సమాధిచేసి మీరిక్కణ్ణించి వెళ్లిపొండి. వచ్చేవసంతంలో వెళ్లిపొండి, ఇక్కడ ఉంటే. మీరు పాపం చేసినట్టే! ఇక్కడ మనుష్యులు మృగాలుగా మారిపోతారు," అని మళ్ళా నెప్పి వచ్చి ఆగిపోయింది.

"వెళ్లిపోకండి! నాదగ్గర ఉండండి. ఒక్కసారి మళ్లీ నన్ను ప్రేమించండి. పిల్లల్ని తీసుకుని మీరు నాకోసం వెళ్లి

పోక తప్పదు. నన్ను క్షమించమన్నానని చెప్పండి .మా అమ్మకి, నాన్నకి. నే నిక్కడ వాళ్ల పెద్దపెట్టెలోనే సమాధి అయానని చెప్పండి,'' అని మళ్లీ బాధతో పెద్ద కేక పెట్టింది. ''అగ్గో! వాళ్లు నాకోసమే వస్తున్నారు.''

పెర్హాంసా ఒక్కగంతుపెట్టాడు, ''శనీ! నువ్వు నా బెరెట్‌ని తీసుకుపోలేవు!'' అన్నాడు. బయటి ఆడవాళ్లని పిలిచాడు. ఆరాత్రి ఎవరికీ నిద్దర్లు లేవు. రాత్రంతా బెరెట్ అలా కేకలు పెడుతూనే ఉంది. మగవాళ్లంతా ప్రక్కన హాన్ ఓల్సా ఇంట్లో కూచుని నిరీక్షిస్తున్నారు. అంత బాధ పడి జీవించడం కష్టం. ఎలా ఉన్నది కనుక్కొరావడానికి మగవాళ్లు తలోసారి వెళ్లి వస్తున్నారు. ఆడవాళ్లు తల పైకీ క్రిందికీ ఊపడం తప్ప ఏం చెప్పలేకుండా ఉన్నారు. వాళ్లు ప్రార్థనచేస్తున్నారు. అంతే చేయగలిగింది. పెర్హాంసా ఎక్కడా కనిపించడంలేదు.'భగవంతుడా! ఆయన్ని అన్యాయం చెయ్యకు.'

ఆ అంధకార శీతరాత్రి పెర్హాంసా పిచ్చివాడిలా అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు. ఎవరైనా మగవాళ్లు వచ్చినప్పుడల్లా వెళ్లిపోతున్నాడు. ఎవరితోటీ మాట్లాడలేక పోతున్నాడు. ఆయన చెక్కిళ్లమీద కన్నీటిధారలు పేరుకొని పోయాయి. లోపలినించి వినపడుతున్న ఒక్కొక్కఅరుపు అతనికి ఒక కొరడాదెబ్బ. అయినా మళ్లీ గుమ్మానికి దగ్గరగా వస్తున్నాడు. సారీనా అతనికి ఏమీ చెప్పలేకపోతూంది.

ఏముంది, మార్పేమీలేదు. ఇంత బాధ పడుతూ బెరెట్ ఇంకా జీవిస్తుందని ఎలా అనుకోడం?

ఆరాత్రి పొడుగునా అల్లా కేకలు వినపడుతూనే ఉన్నాయి. క్రమంగా అతినీరసంగా, ఇంకా నీరసంగా పరిణమించి చివరికి పూర్తిగా ఆగిపోయినయి. పెర్హాంసా తలుపు దగ్గరికి వెళ్లి విన్నాడు. అంత్యదశ ఆసన్నమైనట్టే! ఒక్కసారిగా ఆ మంచులో కూలబడిపోయాడు పెర్హాంసా. కాని, ఎందుచేతో ఆయనకి హఠాత్తుగా బరువుతీరిపోయినట్టనిపించింది...ఆయన దగ్గర గట్టి పొడుగాటితాడు ఉంది... పశువులసావడిలో ఉన్న పెద్దదూలానికి దాన్ని కట్టవచ్చు... ఔను. తాడు తన బరువు ఆపగలదు!

తలుపు తెరిచిన చప్పుడయింది. బయటికి వెలుగు వచ్చింది. ''పెర్హాంసా,'' అంటూ సన్నగా పిలుపు. ఆ పిలిచింది జెర్ట్రూడ్. ''ఓసారి లోపలికి వస్తారా?'' రహస్యం చెపుతున్నట్టు అంది.

లోపల అంతా నిశ్శబ్దం. అయినా వెచ్చగా, వెలుతురుగా ఉంది, బయట చలిలోంచి, అంధకారంలోంచి రావడంవల్లనేమో! చిత్రం ఆయనకు నిద్రవస్తూంది. ''ఎలా ఉంది?'' తన ప్రశ్న తనకే వినపడింది. సొరీనా మంచం మీదికి వంగడం చూశాడు. ఆమె ముఖంలో చిరునవ్వు విపించింది.

"ఔను. ఇదుగో మీబిడ్డ. రండి దగ్గిరికి వచ్చి చూడండి. అంతా దేవునిమహిమ. కని విని ఎరగని చిత్రం! మీభార్య మీ బిడ్డకూడా మీకు దక్కుతారని ఎవళ్లూ అనుకోలేదు. అబ్బ! ఆ బాధ పగవాళ్లకైనా వద్దు!" అంది.

"ఇప్పుడు ఆశ ఉన్నట్టేనా?"

"ఉందనే అనుకుంటున్నాను. అందుకే ఇప్పుడే బిడ్డకి మతనామకరణం చేయించడంకూడా మంచిది."

"చేయించొచ్చు."

"ఔను. ఇక ఆలస్యంచేసి లాభంలేదు."

సారీనా ఈమాట అంటూ ఉండగా బెరెట్ తల ప్రక్కకి, రవంత భర్తవైపుకి తిప్పింది. పెర్హాంసా మెల్లగా నడుస్తూ మంచం దగ్గిరికి వెళ్లాడు, పాలిపోయి పీక్కుపోయి ఉన్న ఆమె ముఖం లోకి చూస్తూ. ఆమె కదల్లేని స్థితిలో ఉంది. కాని ముఖంలో ప్రశాంతత కనిపిస్తూంది. వెనకటి భయంలేదు. కళ్లు కొంచెంగా తెరిచి, ఏమీ సంజ్ఞ చెయ్యకుండానే మళ్లీ మూసుకుంది.

పెర్హాంసా మనస్సు మళ్లీ పనిచేస్తూంది. "మతనామకరణం చెయ్యాలన్నారుకదూ?"

"ఔను. ఇప్పుడే చేసెయ్యడం మంచిది. మీబిడ్డ గొప్పజాతకుడు కాబోతున్నాడు!"

"అయితే! నామకరణం చెయ్యదగిన పెద్దమనిషి మనకు ఒక్కడే ఉన్నాడు," అన్నాడు ప్వెర్ణంసా హాటు, చలికోటు తీసుకుంటూ. ఆయన ఉద్దేశం హాన్సఓల్సా అని. ప్వెర్ణంసాకి తనభర్తపైనఉన్న గౌరవం చూసి, సారీనా పొంగిపోయింది. తనుపడిన కష్టానికి ఇనుమిక్కిలిగా సత్కరించబడినట్లు సంతోషించింది. ఆపైన ప్వెర్ణంసాకి అన్నింటి కన్న గొప్పశుభవార్త చెప్పింది. ఆబిడ్డ తలమీద చర్మపు తొడుగుతో పుట్టాడు. మహాపురుషుడౌతాడు. ప్వెర్ణంసా కనులలోంచి మళ్లీ అశ్రువులు రాలినయి.

క్రిస్మస్‌రోజున బయట సూర్యుడు కాంతిమంతంగా ప్రకాశిస్తున్నాడు. హాన్సఓల్సాఇంట్లో అంతా నిద్రపోతూనే ఉన్నారు, ఒక్కఓల్సా తప్ప. ప్వెర్ణంసా "అందరికీ క్రిస్మస్ శుభాభివందనలు" అంటూ లోపలికి వచ్చేసరికి టాన్సెటెన్ కళ్లు తెరిచాడు. అయితే అంతా సవ్యంగానే జరిగిందన్నమాట!

"పెద్ద ప్రమాదమేమీలేదు. చాలా భయపడ్డాం. బెరెట్‌కూడా కోలుకోవచ్చు. పిల్లవాడుమాత్రం నీరసంగా ఉన్నాడు. ఇప్పుడే మతనామకరణం చేసెయ్యాలి. హాన్స ఓల్సా! ఆపని నీది," అన్నాడు ప్వెర్ణంసా.

హాన్సఓల్సా భయపడుతున్నట్లు కనిపిస్తున్నాడు. "నేనా? నా లాంటి పాపి అలాంటివాటికి పనికిరాడు," అన్నాడు.

"సరేలే! భగవంతుడికీ నీకూఉన్న పద్దులసంగతి నాకు తెలియదు. నీకంటె సత్పురుషుడు లేడని నా మనస్సుకి నాకు తెలుసు. భగవంతుడికి కూడా ఆమాట తెలుసుననే నా నమ్మకం,"

ఇక హాన్సోబిల్సా ఏంచెయ్యగలడు. పెర్వాంసా వెంట బయలుదేరాడు. తాను అందుకు తగననే అనుకుంటున్నాడు. అయితే, దగ్గర్లో మతాచార్యుడు ఎవరూ లేనప్పుడు సామాన్య సంసారులుకూడా మతనామకరణం చెయ్యవచ్చు. తను అన్నీ సవ్యంగానే జరపవచ్చు అనుకున్నాడు. వాళ్లిద్దరూ నిశ్శబ్దంగా నడిచివెళ్లారు. ఆడపిల్ల అయితే దానికికూడా బెరెట్ పేరే పెట్టి ఉండే–వాణ్ణి. వీడు మగపిల్లవాడు గనక మా తాతలాగ...పెర్–పీడర్ అని పెట్టాలనుకో! మరి ఇంకో పేరు...,"పెర్వాంసా కొంచెంసేపు ఆలోచించాడు, ..."సీర్ అనిపెడదాం మన సొరీనా పేరు కలిసేటట్టు. ఈవేళ ఆమె నాకు చేసినమేలుకి ఇంతకన్న నేనేమి కృతజ్ఞత తెల్పను. కుర్రవాడికి ఆమె పేరేపెట్టాలి. ఔను, పీడర్ సీర్, పీడర్ విజయుడు అన్నట్టు అవుతుంది!

మగవాళ్లిద్దరు లోపలికి అడుగుపెట్టేసరికి పెర్వాంసా ఇల్లంతా వేరువిధంగా ఉంది. కుంపటి మీద కాఫీకాగుతూంది. బల్లమీద తెల్లటిగుడ్డ, ఒకగిన్నెతో నీళ్లు, పవిత్ర కీర్తనలగ్రంథం సిద్ధంగా పెట్టిఉన్నాయి. గదివెచ్చగా, వెలుతురుగా, ఉల్లాసంగా ఉంది.

"మతనామకరణోత్సవమంతా సక్రమంగా, యథా-విధిగా జరపాలిమీారు," అంది సారీనా భర్తతో. మెల్లగా గంభీరమైన మంద్రస్వరంలో పుస్తకంలోని మంత్రాలు చదువుతూ మధ్యమధ్య "పీడర్ విజయుడు" అని గట్టిగా పిల్లవాడిపేరు ఉచ్చరించాడు. తరువాత ప్రభుకీర్తన చదివాడు.

"అంతా చక్కగా జరిగింది. ఇంతకన్న ఎవరు మాత్రం చేసేదేముంది?—ఇక అందరం కాస్త కాఫీతీసుకుందాం,"—అని జెర్ స్టీ ప్రతిపాదన.

"కొంచెం ఆగండి," అని పెర్త్సంసా ఒకసీసా—మద్యం—బయటికి తీశాడు. "ఈ వేళ చాలా కష్టపడిన ఆడవాళ్లది వంతు మొదట," అని సీసా అందించాడు. "అయితే, హాన్స్ ఓల్సాకి, నాకు చెరోచుక్క మాత్రం ఉంచండి." అన్నాడు.

తరువాత కాసేపటికి అంతా ఉపాహారాలు, కాఫీ తీసుకున్నారు. "నిజానికి, ఈవేళేమనం హాయిగా క్రిస్మస్ పండుగ చేసుకుంటున్నట్టు కనిపిస్తూంది," అన్నాడు పెర్త్సంసా నవ్వుతూ, మేజాబల్లచుట్టూ కూచుని వాళ్లుకాఫీ తీసుకుంటూన్న సమయంలో.

---

## ఐదవ భాగం

### ౧

బెరెట్ మంచంమీద పడుకుని ఉంది. ఆమె ప్రక్కన కొత్తపాప. క్రమంగా ఆమెకుప్రాణం వస్తూంది. ఈసరికి తాను భూస్థాపితం అయిఉండ వలసిందని ఇప్పటికీ ఆమె అనుకుంటూంది. బిడ్డను రొమ్ముకి అదుముకుని నిట్టూర్చింది. "నా తండ్రి ఎలా పెరిగి పెద్దవా డవుతాడో!" అనుకుంది.

కిటికీలోంచి నీరెండ లోపలికి వచ్చి, ఆగదిని దీప్యమానం చేస్తూంది. పొయ్యిలో కట్టెలు భగభగమండుతున్నాయి. తెల్లటి గోడలు ఎప్పటికన్న తళతళలాడుతున్నాయి. పిల్లవాడి గుడ్డలు ఆరడానికి పొయ్యికిపైన కట్టిన దండెంమీద వరసగా ఆరవేసి ఉన్నాయి. బెరెట్‌కు మళ్లీ కొంచెం నిద్ర పట్టింది. మెలకువ వచ్చిన తరువాత ఆదీర్ఘ దినం, ఆదీర్ఘ రాత్రి జరిగినదంతా ఆమెకి జ్ఞాపకం వస్తూంది. అందరు ఎక్కడికి పోయినట్టు? మళ్లీ కాస్తకునుకు పట్టింది, ఆమెకి.

చివరికి, ఆమె లేచి చూసేసరికి అన్నామేరీ తనమంచం పక్క నిలబడి కొత్తపాపాయిని చూట్టానికి ప్రయత్నిస్తూంది. హాన్సకూడా అక్కడే ఉన్నాడు. పెర్నాంసా అప్పుడే లోపలికి వస్తూ గుమ్మంలో కనిపించాడు. ఆయనచేతుల్లో ఎండుకట్టెలు ఉన్నాయి. ఓల్‌స్టోలం యువకులవెంట వేటకి వెళ్లాడని పెర్నాంసా చెప్పాడు భార్యకి.

"పెర్నాండ్‌ని మాకు చూపించవ్?" అన్నారు అందరు, కొత్త పాపాయికింకో ముద్దుపేరు పెడుతూ. నిద్ర పోతూన్న ఆ ఎర్రని ముఖాన్ని వాళ్లకి చూపింది బెరెట్. పెర్నాంసా కూడా చేతులు కడుక్కొని మంచందగ్గిరికి వచ్చాడు. ఆనందంతో ఆయనకి నోటమాట రావడంలేదు. అయినా, ఆయన మనస్సులో ఏమున్నది బెరెట్‌కి తెలుసు.

"బెరెట్ నువ్వు అద్భుతమైన భార్యవి. క్రిస్మస్ పర్వదినంనాడు గొప్ప జాతకుడు కాబోయే బిడ్డను కన్నావు! అన్నాడు పెర్నాంసా. బెరెట్‌ని, బిడ్డని ఆయనతదేక దృష్టితో చూస్తున్నాడు. బెరెట్‌కి మళ్లీ కునుకుపట్టింది. మధుమాసపు మధురపుకాంతి చుట్టూ ఆవరించుకుని ఉంది... వెచ్చదనం, నిశ్శబ్దం, సూర్య కాంతి!...పక్షులు తీయగాపాడుతున్నాయి. ...నిజానికి, బ్రతికి ఉండడమే మహాభాగ్యం.

కొత్త పాపాయి జనముద్దు బిడ్డగా పెరుగుతున్నాడు. ఎవరికివారే ఆ బిడ్డ తనబిడ్డ అయినట్టు ఆనందిస్తున్నారు. వాడు భూమిమీద పడటానికి జెర్‌ట్రీ, సొరీనా ఎంతో శ్రమపడ్డారు. హాన్సఓలాస్ వాడికి నామకరణం చేశాడు.

మిగిలిన వాళ్ళంతా వాడుపుట్టే రోజున తెల్లవార్లు మేలుకుని నిరీక్షించారు. పైగా మరోవిశేషం ఉంది. ఆపల్లెలో పుట్టిన మొదటి బిడ్డ వాడే. ఆ కుర్రవాడు ఎంత గొప్పవాడు కాబో యేదీ వాళ్ళంతా, ఎవరికితోచినట్టు వాళ్ళు ఊహించి చెపు తున్నారు. గొప్ప మతగురువు అవుతాడని ఒకరు. గొప్ప ఉపాధ్యాయుడు అవుతాడని మరొకరు. "కాదు, వాడీదేశపు ప్రెసిడెంట్ అవుతాడు," అన్నాడు టాన్సెటెన్. "ఈపల్లె లన్నీ ఒకనాటికి ఒకరాష్ట్రం అవుతాయి. అప్పుడు మనకి మంచి గవర్నరు అవసరం అవుతాడు. అందుకోసం పుట్టాడు వీడు. అన్నాడు హాన్సబీల్సా. ఇది అందరికీ నచ్చినట్టు కని పించింది. బెరెట్, పెర్హాంసా మాత్రం ఏమీ చెప్పలేదు. మిగిలినవాళ్ల జోస్యాలన్నీ వింటూకూచున్నారు. ఆ సంతో షంలో ఏమి మాట్లాడటానికీ వాళ్లకి తోచడంలేదు.

ఆవలస పల్లెలో బడి నడుస్తూనేఉంది. ఒకవారం సోలం యువకులు హాన్సబీల్సా ఇంట్లో ఉంటూ అక్కడే బడి పెట్టారు. బెరెట్ మళ్లీ లేచితిరగడం మొదలుపెట్టిన తరు వాత పెర్హాంసా ఇంట్లో ఒకవారం బడి నడిచింది. ఆ తరువాత ఒకవారం టాన్సెటెన్ ఇంట్లో. టాన్సెటెన్‌కి పిల్లలులేరు. అయినా, మగవాళ్లు ఆడవాళ్లుకూడా ఆ బళ్లోచదువుకుంటు న్నారు. వాళ్ళంతా కొంచెం కొంచెం ఇంగ్లీషు నేర్చుకుంటు న్నారు. అదీగాక, చలికాలం నలుగురూ ఒకచోట కలిసి కాలక్షేపం చెయ్యటానికీ బాగుంది. మగవాళ్లు చేలలోపని

అవగానే బడికి వెళ్ళేవాళ్ళు. మధ్యాహ్నంవేళ ఆడవాళ్ళు తమ కుట్టుసామానుతోసహా హాజరయేవాళ్ళు.

అక్కడ, నార్వేభాష, ఇంగ్లీషు, మతవిషయాలు— అన్నీ నేర్పుతున్నారు. సామాన్యంగా, అదే వాళ్ల ఉబుసుపోక కబుర్లక్లబ్బుకూడాను. అంతా నవ్వుతూ పేలుతూ గట్టిగా అరుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒక్కొక్కప్పుడు అదే వాళ్ల ప్రార్థన మందిరం. అంతా గంభీరభక్తి భావంతో ప్రార్థన చేస్తారు.

మొదట హెన్రీసోలంకి ఒక్కటేబోధనాపద్ధతి తెలుసు. పిల్లలికి చిన్న చిన్న కథలుచెప్పి, వాళ్లచేత మళ్లీ ఆకథలు చెప్పించేవాడు. కథలో మాటలన్నీ వాళ్లకి వచ్చేదాకా ఆ కథలే మళ్లిమళ్లీ చెప్పించేవాడు. ఒకరోజున హాన్సఓల్సా ఎక్కడో చిన్నసుద్ద పెన్సలు తెచ్చాడు. జెర్‌స్టీ అలాంటిదే ఇంకోముక్క తెచ్చింది. రాసుకుంటూనికి వీలుగా మగవాళ్లు కర్రపలకలు తయారుచేశారు. వాటితో పిల్లలకి అక్షరాలు, పేర్లు వ్రాయడంకూడా నేర్పుతున్నాడు హెన్రీసోలం.

ఒకరోజున శామ్ సోలం పాటలుపాడి వినిపించాడు. అతనిగొంతు మంచిదని, చక్కగా పాడగలడని తెలిసింది. దాంతో ఆ చలికాలం అంతా వాళ్లు చాలా పాటలు, కీర్తనలు, నార్వేపల్లెపాటలు, స్వీడన్ దేశపు ప్రేమగీతాలుకూడా నేర్చుకున్నారు. జెర్‌స్టీ, సొరీనా చిన్నతనంలో చెప్పుకొన్న పాటలన్నీ మళ్లీ నేర్చుకున్నారు. మిగిలినవాళ్లు తాము మరచి

పోయిన పాటలు మళ్లీ చెప్పించుకుని వల్లెవేసుకున్నారు. అప్పు డప్పుడు టూన్సెటెన్ కూడా పాటాలు చెప్పేవాడు. తనుతప్ప ఎవరు ఏపనిచేసినా టూన్సెటెన్ కి నచ్చదు. ఆపని అంతకన్న బాగా తనుచేసి చూపించాలని ప్రయత్నిస్తాడు. పనిపాట్లులేని ఆశూన్య శీతకాలంలో ఇదీ కాస్త మార్పే. అంచేత ఎవరూ అభ్యంతరం చెప్పలేదు.

చలికాలం చాలావరకు సాగడంవల్ల, వాళ్లు నిల్వచేసి పెట్టుకున్న వంటచెరుకు ఇంచుమించు నిండుకుంది. ఎండుగడ్డిని వంటచెరుకుగా ఉపయోగించ వచ్చుని కనిపెట్టాడు హాన్స ఓల్సా. కాని, దాన్ని ఎక్కువగా తగలబెడితే, ఆవులనోట్లో గడ్డ పడుతుంది.

అంచేత, విధిగా ఫిబ్రవరిలోనే మగవాళ్లు కట్టెలకోసం సూక్స నదికి వెళ్ల వలసి వచ్చింది. హేన్రీసోలం బడిచెపుతూ, పిల్లలకి ఆడవాళ్లకి సాయంగా పల్లెలోనే ఉండాలని, మిగిలిన వాళ్లు వెళ్లి కట్టెలు కొట్టుకురావాలనీ తీర్మానం చేసుకున్నారు.

ఆ శీతకాలంలో పెర్హాంసా తన ఎడ్లబండితో రావ డం హాన్సఓల్సాకిగాని, టూన్సెటెన్ కిగాని ఇష్టంలేదు. అం చేత, పెర్హాంసాని తమతో వచ్చేయమన్నారు. కాని, పెర్హాంసా ఎడ్లనుకూడా తీసుకునే వస్తానన్నాడు. ఆయన మంచుమీద జారిపోయే చక్రాల్లేని "స్లే" బండీ ఒకటి తయారుచేసి దాన్ని లాగడం తన ఎడ్లకు నేర్పాడు. అంచేత ఎడ్లని ఆ బండీకి కట్టుకుని బయలుదేరాడు. అవి ఆబండీని

ఏమాత్రం కనిపించడంలేదు. పైన ఆకాశంలో చెవులు గడియలు పడే ధ్వనులు. ఇదివరకెన్నడు వినని భయంకర గర్జనలు. తర్వాత ఒక్కసారిగా పెద్దగాలి. ఇంకా దారుణంగా మంచుపాటు.

వాళ్ళకి అసలేమీ కనిపించడంలేదు. వాళ్ళచుట్టూ మంచే. మంచులో మునిగి తేలుతున్నారు. అలాంటి పరిస్థితుల్లో చేపలపడవని భద్రంగా నడపటం పెర్వాంసాకి తెలుసు. ఎడ్లని నడిపించడంలో ఆ అనుభవంలేదు. తనపని అయిపోయినట్టే అనుకున్నాడు. అతని "స్లీ" బండికి కట్టిన తాడు ఒక్కలాగులాగినట్టు గట్టిగా బిగిసింది. దాంతో ఆయన బండిమీంచి కింద మంచులో పడిపోయాడు. తన బండికి శామ్‌సోలం బండికి కట్టిన తాడు విధిలేక ఆయనే కోసివేయవలసివచ్చింది. ఇక, ఆయన ఒంటరిగానే పెనుగులాడుతున్నాడు ఆమంచు ఉప్పెనతో.

ఎడ్లనడక మందగించి, మందగించి చివరకవి పూర్తిగా ఆగిపోయినయి. మొట్టమొదటిసారి పెర్వాంసా వాటిమీద కొరడా విసిరాడు. "నడవండింక" అని అరిచాడు. ఎడ్లు గట్టిగా పరుగుతీసినయి. ఆయన ప్రాణం కాపాడుకోటానికి గట్టిగా పట్టుకోవలసివచ్చింది. విసురుగా కొట్టుకుపోతున్న పడవలో వెళుతున్నట్టుంది ఆయనకి. ఎడ్లు ఆ మంచుమీాద వాయువేగంతో వెళ్ళిపోతున్నయి. తాను మిగిలినవాళ్ళను కూడా దాటి ముందుకి వచ్చేసి ఉండాలి అనుకున్నాడు పెర్వాంసా. అప్పటికీ ఎడ్లు ఆగలేదు. దయ్యాల్లాగ పరిగెత్తి,

పరిగెత్తి చివరికి ఇక అడుగు వెయ్యలేని స్థితిలో పూర్తిగా ఆగిపోయినయి.

పెర్వాంసా గడ్డిసంచితీసుకుని పాక్కుంటూ వాటి దగ్గిరికి వెళ్లాడు. మంచు సూదుల్లాగ అతిని చర్మాన్ని చీల్చే స్తూంది. "చకచకతినెయ్యండి" అన్నాడు ఎడ్లకి గడ్డివేస్తూ. అక్కడ ఆట్టేసేపు తను నిలవలేడు. మళ్లీ ఎడ్లు నడక ప్రారంభించాయి. కాని, ఈసారి చాలా మెల్లగా నడివేసవి మధ్యాహ్నం నడుస్తున్నట్టు ఉంది. వాటెని ఏంచేసినా, ఇక అంతకన్న చురుగ్గా నడవలేవు.

పొద్దుగూకింది. చీకటి పడింది. మంచుకరగడం కొంచెం తగ్గింది. కాని చలి చంపేస్తూంది. కత్తులతో చీల్చు తున్నట్టుంది. గాలి ఇంచుమించు ఆయన్ని బండిమీంచి విసిరిపారేస్తూంది. ఇది తన అంత్యదశే అనుకున్నాడు పెర్వాంసా. దీనికితోడు క్రమక్రమంగా నిద్రముంచుకొచ్చే స్తూంది. కాని, ఆసమయంలో కన్నుమూస్తే ఏమవేది ఆయనకి తెలుసు. అది శాశ్వతంగా కన్నుమూయడం అవుతుంది. ఈ నూత్న దేశంలో నలుగురుపిల్లలతో బెరెట్‌ని నిరాధారంగా వదిలెయ్యడం ఆయన ఊహకందనిపని.

ఇప్పుడాయన నడిచివెళ్లిపోతున్నాడు. లోతుగా ఉన్న మంచులోపడుతూ, ఎలాగో తంటాలుపడి మళ్లీ లేస్తూ పోతున్నాడు. ఆయన మనస్సు సరిగా పనిచేయడంలేదు. ఎడ్లు మెల్లగా నడుస్తూ వస్తున్నయి. ఎంతపాటుపడినా, ఎన్నిసార్లుపడినా పెనుగులాడి పెనుగులాడి మళ్లీ లేచి నడవక

తప్పదు. తాను పట్టుకున్న తాడును ఇప్పు డాయన వదిలి పెట్టలేదు. ఆయన పిడికిళ్లు బిగుసుకుపోయినయి. అలాగే, ముందుకి సాగిపోయాడు.

మళ్లీ ఎడ్లు ఆగిపోయినయి. మళ్లీ ఏమొచ్చింది? ఎడ్లాయన్ని ముందుకిలాగడంలేదు. మెల్లగా ఎడ్లదగ్గిరికివెళ్లి వాటిమీదికి వాలిపోయాడు. ఒక యెద్దు తలమీదుగా మెరుస్తూన్న ఒక పెద్ద పసుపు పచ్చని కన్ను ఆయనకి కనిపించింది. "అది నా మరణచిహ్నమే!" అనుకున్నాడు. ఎడ్లు మోరలెత్తి గట్టిగా రంకెవేసినయి. కొంచెం ఆగి మళ్లీ గట్టిగా అరచినయి. ఆ రంకెలతో పెర్హాంసాకి మెలుకువ వచ్చింది. ఎలాగో ముందుకి సాగిపోతూ, చేతులకి ఒకగోడ తగిలేదాకా నడిచాడు. అది ఒక ఇంటిగోడ. ఆ గోడలోని కిటికీలోంచే ఆ పసుపుపచ్చని వెలుగు ఆయనకి కనిపించింది. ఆ గోడపట్టుకుని తొట్రుపడుతూ పాకిపోగా తలుపు తగిలింది. ఆ తలుపు గట్టిగా తోసి లోపలికి పడిపోయాడు పెర్హాంసా.

ఆయనకు కళ్లు కనిపించడంలేదు. ముఖంనిండా, కళ్లనిండా మంచు పేరుకుని ఉంది. కాని, లోపల వెచ్చగా ఉంది. ఏదో భద్రస్థలానికే చేరి ఉంచవచ్చు. ఇక తను చచ్చిపోడు. ఈ మాటలు తనకు తాను చెప్పుకోటానికి చాలాసేపు పట్టింది. కొంతసేపటికి గొంతు పెకల్చుకుని ఎక్కడో నూతిలోంచి మాట్లాడుతున్నట్టు అన్నాడు: "ఎడ్లు...బయట ఎడ్లు. నాకో...కుర్చీ ఇవ్వండి." ఒక కుర్చీ తీసుకొచ్చి ఆయన ప్రక్కన వేశారు. ఆ గదిలో ఎవరో

చాలామంది మాట్లాడుతున్నట్టుంది. అయినా, ఏమీ కని పించడం లేదు. అప్పటికి ఒక పరిచితమైన కంఠం వినిపించింది: ""ప్వర్గాంసా! నువ్వేనా?'' అని.

"టాన్సెటెన్!...మీరంతా ఇక్కడ ఉన్నారా!" అప్పటికీ అదంతా కలేమో అనిపిస్తూంది ప్వర్గాంసాకి.

ఆయన స్పష్టంగా మాట్లాడగలిగేటంతవరకు, అతడు ప్వర్గాంసా అని ఎవరూ అనుకోలేను. ఆయన ముఖమంతా ఒక్కటే మంచుగడ్డలాఉంది. ఆయనకళ్లు, గడ్డం, టోపీ ఏమీ కనిపించడం లేదు. ఆయన కోటంతా ఓమంచుపలకలా వేళ్లాడు తూంది. సైమన్ బార్‌స్టాడ్ కుటీరంలో కూచున్న ఆవ్యక్తి మానవాకృతిలోఉన్న మంచు దేవతలా ఉన్నాడు.

అచటి వెచ్చదనానికి క్రమంగా ప్వర్గాంసాకి ప్రాణం వచ్చింది. చుట్టూ చూశాడు. ఆయన సహచరులంతా ఇక్కడే ఉన్నారు, సైమన్ బార్‌స్టాడ్ నికూడా ప్వర్గాంసా ఎరు గును. శామ్ ఒక ఆడపిల్లకి బాగా దగ్గరగా కూచున్నాడు. ఆదృశ్యం ప్వర్గాంసా ముఖంలో చిరునవ్వు మొలిపించింది.

ఆమంచులో ఎంతో కష్టంమీద ఎడ్లను తోలు కుంటూ తామూ రెండుగంటల క్రితమే అక్కడికి చేరుకున్నట్టు హాన్సెల్సా చెప్పాడు. ఏదో, ఆమృత్యు ముఖయాత్ర ముగి సిపోయింది. దాన్నిగురించి తలపెట్టడంకూడా ప్వర్గాంసాకి ఇష్టం లేదు. తనకోసం గురీనాబార్‌స్టాడ్ పెద్దగిన్నెతో పాలు, విస్కీ కాస్తూండటమే ఆయన గమనిస్తున్నాడు.

ఆ ఇల్లాలు ఆగిన్నె తెచ్చి అందించగానే, చుక్క తిప్పుకో కుండా, గిన్నె దింపకుండా తాగేశాడు,

గిన్నె ఖాళీచేసిం తర్వాత అడిగాడు, "తల్లీ గురీనా ఇంకొక్క-చుక్క మిగల్లేదు కాదూ ?" అన్నాడు. వెంటనే ఆమె వెళ్లి ఇంకోగిన్నె తెచ్చి అందించింది. దాన్నికూడా అంత వేగంగానే ఖాళీచేశాడు పెర్గాంసా. ఆతర్వాత ఆమె మళ్లీ ఒక గిన్నెడు జావ, ఒకగ్లాసెడుపాలు తెచ్చి ఇచ్చింది. ఇంక, ఒక్క-చుక్కకికూడా ఖాళీలేదు ఆయనలో.

వాళ్లు కొంతసేపు భూముల్ని గురించి, పంటల్ని గురించి మాట్లాడుకుని, అంతా నిద్రపోయారు. అతిథులంతా నేల మీద పరిచిన గడ్డిమీద గుడ్డలు వేసుకొని పడుకున్నారు. పూర్తిగా అలసిపోయిఉన్న పెర్గాంసాకి మాత్రం నిద్రపట్ట లేదు. అంధకారంలో, చుట్టూ మంచులోమునిగి ఉన్న తన ఏకాంత కుటీరం, లోపల పసిబిడ్డనెత్తుకుని అటూ ఇటూ పచార్లు చేస్తున్న ఒకస్త్రీ ఆయనకి కనిపిస్తున్నారు. ఆమెతో మాట్లాడాలని, తను క్షేమంగానే ఉన్నానని ఆమెకు చెప్పే య్యాలని అనిపించింది ఆయనకి. మంచు తుపానురాకముందే తగినంత వంటచెరకు ఇంట్లోకి చేరవేసి ఉంటారు పిల్లలు, అను కున్నాడు. వొత్తిగిలి పడుకుని, మళ్లీ నిద్రపట్టించుకోటానికి ప్రయత్నించాడు. లేదు, మళ్లీ ఆస్త్రీ మూర్తే, ఆపచార్లు చేస్తూన్న ఆస్త్రీయే కనిపిస్తూంది.

ట్రాండర్లకి సూక్ష్మనది పొడుగునా పెద్దవలస ఉంది. వాళ్లల్లో చాలామంది ఐదారేళ్లక్రిందటే ఇక్కడికివచ్చి స్థిర

పకి. అప్పుడే కలపచట్రాల ఇళ్లుకూడా కట్టుకున్నారు. చాలా భూమిమన్ని పండిస్తున్నారు. వాళ్ల పని చాలాబాగుంది ఇప్పుడు. మొదట వాళ్లు వచ్చినప్పుడు ఈ ప్రాంతమంతా ఎలావుండేదీ వాళ్లు కథలు కథలుగా చెప్పారు. అప్పుడీప్రాంత మంతా రెడ్డిండియన్లే. ఎక్కడా పట్టణాలు వుండేవి కావు. ఈలాంటి కథలు వినడం పెర్స్గాంసాకి సరదాగానే ఉండేది. అయితే, తాను వాళ్లందరినీ మించిన విజయం సాధించగలనని ఆయన ధీమా. ఆయన ఆత్మ విశ్వాసం అలాంటిది.

మర్నాడు కొంచెం తెరిపిచ్చింది. కాని, ఇంకా చలి గానేఉంది. బార్ స్టాడ్ దగ్గర పెర్స్గాంసా కొంత అడివి కొన్నాడు. ఇప్పుడు తన కలపే తనుకొట్టుకు పోవచ్చు. మిగిలినవాళ్లు కట్టె, కలప కొనడానికి తిరుగుతున్నారు. వాళ్లు తొందర పడడానికి వీల్లేదు. అందుచేత, మూడోరోజు ఉదయానికి గాని తిరిగి ఇళ్లకు బయలుదేరలేక పోయారు. ట్రాండర్లతో సంభాషణ వాళ్లకు సరదాగాఉంది. నిజానికి, చాలా కాలంగా వాళ్లకి కొత్తముఖమన్నది కనిపించటంలేదు. వసంత కాలంలో అవసరమయే గోధుమవిత్తనంకూడా ఇప్పుడే కొనేశారు వాళ్లంతా. వాళ్లు తొందర పడటం ఎందుకు? నార్వే దేశీయ నృత్యాలతో కూడిన ఒకవిందులోకూడా వాళ్లు పాల్గొన్నారు, శామ్ సోలం ఆ బార్ స్టాడ్ బాలికను ఆనుకుని కూచోటం పెర్స్గాంసా చూశాడు. వాళ్లిద్దరు పెళ్లి చేసుకుంటానికి ఇక ఆట్టేకాలం పట్టదు, అనుకున్నాడు.

నాలుగోరోజున సూర్యోదయానికి బాగా ముందుగా లేచి, ఆనలుగురు సహచరులు ఉత్సాహపూరితమైన ఆ ట్రాండర్ల వలసనించి మళ్లీ తమ స్ప్రింగ్ క్రీక్ వలసకి బయలుదేరారు.

౨

ఒక ఆదివారం అపరాహ్ణం. రవంత మాగ యెండ కాస్తూంది. చలిగాలి జోరుగా వీస్తూనేఉంది. ఒంటరితనం తప్ప ఇంకేమీ కనిపించడం లేదు. అంతా టాన్సెటెన్ కుటీరంలోనే ఉన్నారు; బెరెట్, ఆమె పసిబిడ్డతో సహా. ఆరోజు అంత నిరాశాజనకంగా, నిరుత్సాహకరంగా ఉంది వాళ్లకి. ఆనాడెవరూ ఒంటరి తనం సహించలేక పోయారు. ఇంకో సంవత్సరంలో, నాలుగేళ్లలో, ఆరేళ్లలో వారివలస ఎంత గొప్పగా తయారయేదీ వర్ణించి చెప్పుకుంటూ ఆనందించగల మగవారికికూడా ఆనాడు ఆకథలమీద నమ్మకం సడలిపోయి నట్టు కనిపిస్తూంది.

టాన్సెటెన్ వాళ్లని కాస్త ఉత్సాహ పరచాలనుకున్నాడు. ఆభూములకు తాము వ్రాయించుకున్న దస్తావేజులన్నీ ఖరారయిపోయిన తర్వాత ఎవరేపేర్లు పెట్టుకోదలచుకున్నది చెప్పమన్నాడు టాన్సెటెన్. ''ఏం ఇప్పుడు మనపేర్లు బాగాలేవంటావా?'' అన్నారు పెర్హంసా, హాన్స్ఓల్సా. ఇంక టాన్సెటెన్ కి కావలసిందేముంది? ఎప్పటిలాగే, టాన్సెటెన్ కి కోపంవచ్చేసింది. ''ఇలాంటి పేర్లతో, మనం

నార్వే దేశస్థులమని ఎవరు గ్రహిస్తారు స్వీడన్ దేశీయులకు కూడా ఈ పేర్లు ఉండొచ్చు!'' అన్నాడు టాన్సెటెన్.

ఈ మాటతో వాళ్లు కొంచెం ఆలోచించవలసి వచ్చింది. బెరెట్ అంతసేపూ, పసిబిడ్డని తొడమీద పడుకో బెట్టుకుని ఊపుతూ, చిన్న నవ్వు నవ్వింది. సొరీనాపుట్టిల్లు నార్వే దేశంలో వాగ్ ప్రాంతంలో ఉంది. అందుచేత ఆమె, ఆమె భర్త హాన్సోల్సా తమపేర్లకు వాగ్ అని తగిలించుకుంటామన్నారు. మరికొంత చర్చ సాగిన మీదట పెర్హాంసా తన కుటుంబానికి 'హోమ్' అనేపేరు బాగుంటుందని తీర్మానించుకున్నాడు. ''ఓల్ హోల్గాగ్ హోమ్''... ''హాన్స క్రిస్టియన్ హోమ్'' ... ''పీడర్ విక్టోరియస్ హోమ్''— అన్ని పేర్లకు బాగానే అతుకుతూంది. అంతే! అదే బాగుంది, అనుకున్నాడు. అప్పటికీ బెరెట్ ఏమీ మాట్లాడలేదు. ఇదిశనిగాడి నాటకంలో మరోదృశ్యం అనుకుంది. లేకపోతే, మతనామకరణం సమయంలో పెట్టిన పవిత్రమైన పేర్లను మార్చుకుని ఏవో పిచ్చిపేర్లు పెట్టుకోటం ఏమిటి?

ఆరాత్రి మిగిలిన వాళ్లంతా పడుకున్న తర్వాత కూడా బెరెట్ చలికుంపటి దగ్గరే కూచునిఉంది. ఊరికే ఆలోచిస్తూంది. ఆ ఆలోచనకి అంతులేదు. వీళ్లంతా తమ తండ్రులపేర్లు వదిలేస్తున్నారు. ఏమో! ఈ మాయదేశంలో ఇంకా ఎన్నిమార్పులు జరగాలో! ఈ అకృత్యాలకు అవధిలేదు. ఇతరుల సంతోషాన్ని భంగపరచడం ఆమెకు ఇష్టంలేదు. కాని, వాళ్లు చేస్తున్నపని దారుణంగాఉంది. అయినా

ఆమె ఏమీ అనదలచుకోలేదు. తానిప్పుడు ఏమన్నా తప్పుగానే కనిపిస్తూంది. తనకి పిచ్చి ఎత్తుతూందేమో! ఔను అదీ సంభవమే! ఈసారి భగవంతుడు తనను ఎత్తుకుపోలేదు. తను పశ్చాత్తాపం ప్రకటించి ఆత్మనివేదన చేసుకోవచ్చు. కాని, అదీ తాను చేయలేకపోయింది. చలికుంపటికి ఎదురుగా కూచుని, చీకటిగదిలో పసిపిల్లలాగ భయంతో వణికి పోతూంది.

కుంపటిలో నిప్పు ఆరిపోయింది. చలిచలిగా ఉన్న ఆ గదిలో ఆమెకూడా హాయిపడుకుంది. భగవంతుడు చాలా మంది మనుష్యులను ఈ ఎడారిదేశంలోకి తరిమేస్తున్నాడు. ఇది భగవద్విలాసమే. ఆసంగతి తనకు తెలుసు. కాని, ఇక్కడ ఈ దారుణభయం కూడా కల్పించాడు...ఆయన ఈ భయాన్ని తొలిగించేస్తే, ఇక్కడకూడా తాను భగవంతుణ్ణి భజించగలదు.

మరికొంత కాలానికి, పగటిపొద్దు సాగడ మారంభమయింది. మగవాళ్ళంతా మళ్లీ పనిపాట్లు చేసుకుంటున్నారు. ఆరోజుల్లో పెర్హాంసా చేసిన పని ఇప్పటికీ డకోటా ప్రాంతాల్లో చెప్పుకుంటూ ఉంటారు. అక్కడికి నలభై మైళ్ల దూరంలో రెడ్డిండియన్ల పల్లెలుఉన్నాయనీ, వాళ్లు శీతకాలం పొడుగునా తోళ్లు తయారు చేసిఉంచి, వసంతం రాగానే వాటిని తూర్పుకి పంపుతారనీ ట్రాండర్లు చెప్పడం పెర్హాంసా విన్నాడు. అక్కడ ఒకచర్మం ఖరీదు చాలా తక్కువ. దాన్నేమిన్నెసోటాకిగాని, ఇంకా తూర్పుకిగాని తీసుకుపోయి అమ్మితే

బోలెడుధర వస్తుంది. తను స్వయంగా ఆ రెడ్డిండియన్లతో వర్తకం చెయ్యాలని ప్రశాంసా సంకల్పం. తాను వాళ్ల దగ్గిర వీలైనన్ని చర్మాలుకొని, వాటినితానే తూర్పుకి పంపి అమ్మించాలి. ఆవిధంగా తాను లాభం సంపాదించాలి. ఈ వ్యాపారాన్ని గురించి ఆయన కొంతకాలం ఎడతెగకుండా ఆలోచించాడు.

ఈ వ్యాపారం చెయ్యడానికి ముందుగా తాను ఇంకా కొంత పెట్టుబడి సంపాదించాలి. అప్పుడుగాని, తాను ఇంకా ఎక్కువడబ్బు సంపాదించడానికి వీలులేదు. తనకు, తన కుటుంబానికి ఇంకా ఎన్నో కొనుక్కోవాలి. వాటన్నిటికీ చాలా డబ్బుకావాలి. ఆయన ఈ వ్యాపారంసంగతి బెరెట్ కి చెప్పాడు. ఆమె ఒప్పుకోక ఏంచేస్తుంది ? ముందు వాళ్లు బట్టలు కొనుక్కోవాలి. అతుకుల గుడ్డలుకూడా చినిగి పోతున్నయి. "ఔను, మనం బ్రతకాలి. మనం సాధ్యమయినంత దీర్ఘ కాలం బ్రతకాలి," అంది బెరట్. తను చేయబోయే వాణిజ్య యాత్రను గురించి చెప్పేటప్పుడు ఆయన ఉత్సుకతను బెరెట్ గమనించింది. మిగిలిన వాళ్లకి కూడా అలాంటిది ఉండ వచ్చుని ఆయన గ్రహిస్తే ఎంత బాగుండును! కాని, ఆమె తన అభిప్రాయమేమీ ఆయనకు చెప్పలేదు.

ఈ ప్రథమవాణిజ్యయాత్ర ఒక వారంరోజులుపట్టింది. రెడ్డిండియన్లతో కొంచెం మంచిచేసుకున్నమీదట, ఆయన తను మోసికొని పోగలిగినన్ని చర్మాలు వాళ్లదగ్గిర తీసుకో గలిగాడు. తర్వాత వాటిని తూర్పుకి తీసుకెళ్లి అమ్మేశాడు.

కాని, తూర్పుకి తాను ఎందాకా వెళ్ళిందీ ఆయన ఎవ్వరికీ చెప్పలేదు. ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు, తమకు అవసరమైన వస్తువులు చాలా కొనుక్కొచ్చాడు. అప్పటికీ ఇంకా నలభై డాలర్లు మిగుల్చుకు వచ్చాడు.

అయితే, మూడురోజులతర్వాత ఆయన మళ్లీ రెడ్డిండియన్ల పల్లెలకి బయలుదేరాడు. వాళ్లకు తాను ఇవ్వవలసిన డబ్బుఇచ్చేసి, మళ్లీ కొన్ని చర్మాలు కొన్నాడు. తర్వాత, ఇంకోసారి మళ్లీ అలాంటి వాణిజ్యయాత్రచేశాడు. ఆపైన మరి మూడుసార్లు. ఈ యాత్రలకి ప్రతిపర్యాయం వారం రోజులు పడుతూంది. ఇప్పుడు పెర్హాంసా కుటుంబానికి అవసరమైన వస్తువులన్నీ వచ్చేశాయి. పైగా ఇంకా నూట నలభై డాలర్లు డబ్బుకూడా తెచ్చి బెరెట్ కి ఇచ్చాడు.

మళ్లీ వాళ్లంతా ట్రాండర్లవలసకి వెళ్లవలసినపని తగిలింది. వెళ్లి గోధుమవిత్తనాలు తెచ్చుకున్నారు. ఈసారి పెర్హాంసా బార్ స్టాడ్ దగ్గర ఒక చిన్న ఆవుదూడనుకూడా కొనుక్కొచ్చాడు చివరకు, ప్రయాణాలన్నీ ముగిసినయి. ఇంటిపట్టున ఉండి పనిచేసుకోవలసిన సమయం వచ్చింది. ఈ రాకపోకలసమయంలో బెరెట్ ఇంచుమించు ఏమీ మాట్లాడలేదు. కార్యనిమగ్నుడై ఉన్న పెర్హాంసా ఆ విషయం అట్టే పట్టించుకోనూలేదు. బెరెట్ మళ్లీ వెనకటిలాగ ఆమెకోసం తను చేస్తూన్న పనులన్నీ ప్రశంసించే ప్రియురాలైతే ఎంత బావుణ్ణు! "ఫరవాలేదు, వసంతం వచ్చేస్తే ఆమెలోకూడా క్రమంగా మార్పురావచ్చు!" అనుకున్నాడు.

---

## ఆరవ భాగం

### ౧

పెర్హాంసా, ఆయన కొడుకులు బల్లమీద గోధుమ విత్తనాలుపోసుకుని తాలుగింజలు ఏరేస్తున్నారు. ఈ పని చాలా జాగ్రత్తగా చెయ్యాలి. కలుపుమొక్కలగింజలన్నీ ఏరి పారెయ్యాలి. గోధుమవిత్తుల్లోకూడా ఆట్టే బాగా లేవనుకున్న గింజలన్నీ ఏరి పారేశాడు పెర్హాంసా. కొత్తచేలో అంతా మంచి విత్తనమే చల్లాలి.

కూచుని ఈ పనిచేస్తున్నంతసేపూ పెర్హాంసా మనస్సంతా ఆలోచనానిమగ్నమై ఉంది. ఇదే మొదలు! ఈ కొద్దిపాటి విత్తులలోంచి, తన కుటుంబానికి ఏడాదిపొడుగునా కావలసిన గోధుమపిండి బస్తాలకొద్దీ తయారవుతుంది. ఇంకా అదనంగా పండిన గోధుమ అమ్మితే డబ్బుకూడా వస్తుంది. పై సంవత్సరానికి విత్తులుకూడా ఇంకా ఎక్కువగా అందులోంచే జాగ్రత్తచేసుకోవచ్చు. మరి కొంత గోధుమకూడా జాగ్రత్తచేసి కొత్తగా వలసవచ్చేవాళ్లకి విత్తులుగా అమ్మితే ఇంకా మంచిదేమో!...ఔను. ఇంకొన్నాళ్లకి ఇంకా చాలా

మంది వలసవస్తారు విత్తనం గోధుమకి మంచిధర పెట్టడానికి ఎవరూ వెనుదీయరు...'చూద్దాం...ఏంజరుగుతుందో!'...

"బాబులూ! జాగ్రత్త! ప్రతివిత్తు జాగ్రత్తగా చూడండి. పొల్లువిత్తులన్నీ ఏరెయ్యండి!" పెర్హాంసా హెచ్చరించాడు కొడుకుల్ని.

వెచ్చని వసంతవాయువులు ప్రారంభం అయినయి. పెర్హాంసాకి ఇక క్షణం తీరిక ఉండదు. భూమి విత్తులు చల్లడానికి వీలుగా పదునయిందేమో అని తడవతడవకు పరీక్షిస్తున్నాడు. కోళ్లు ఇప్పుడు రోజుకి సుమారు ఐదుగుడ్లు పెడుతున్నయి. కోళ్లని బాగా పెంచాలి. శరత్కాలం వచ్చేసరికి బెరెట్ కి ఇంకో యాభై కోళ్లు అవుతయి.

కడచిన వసంతం తర్వాత పెర్హాంసాని ఈ ధోరణిలో ఎన్నడూ చూడలేదు బెరెట్. ప్రతిప్రాణిని ఇప్పుడాయన మృదువుగా, దయతో స్పృశిస్తున్నాడు. వాటితో మాట్లాడుతున్నాడు. ఆయన వసంతఋతువులో ఒకభాగంలాగ, ఆ ఋతువుతోపాటుగా మారుతున్నాడు.

ప్రతిదినం సూర్యుడు చక్కగా ఎండకాస్తున్నాడు. ఆ మైదానంలో, గాలి అనుకూలంగా, హాయిగా ఉంది. పెర్హాంసా ఇక ఆలస్యం చెయ్యదలచుకోలేదు. ఏప్రిల్ మొదట్లో ఒకరోజున, నార్వేలో మామూలుగా విత్తనాలు చల్లేరోజున పెర్హాంసా విత్తనాలు చల్లడం ప్రారంభించాడు. ఆయన భూమిలో బాగా పొడిగా ఉన్నగడ్డని ముందే మళ్లు

మళ్లుగా చేసి సిద్ధంగా పెట్టుకున్నాడు. చుట్టూ తన సహచరుల భూములు చూశాడు. తానే మొదట విత్తులు చలుతున్నాడు.

తన జీవితంలో అత్యంత ముఖ్యమైన సమయం వచ్చిందనుకున్నాడు పెర్హాంసా...తన సొంత భూమిలో తాను విత్తనాలు చల్లుకోడానికి సిద్ధంగా నిలబడిన ఘడియ అది. కుడిచేతినిండా పిడికెడు గోధుమవిత్తులు తీసుకున్నాడు. పిడికిలి తలపైకి ఎత్తాడు. విత్తులు ఆయన చుట్టూ రాలినయి. ప్రతివిత్తు కావిత్తు లెక్క ప్రకారం సరియైన స్థానంలో పెళ్లి పడుతూంది. పెర్హాంసా ఆపని చాలా నెమ్మదిగా చేస్తున్నాడు. ఎన్నిగంటలు గడిచిపోతున్నదీకూడా ఆయన గమనించడం లేదు.

ఆనాడు సాయంకాలం టాన్సెటెన్ పరుగెత్తు కుంటూ కొంత ఎక్కి వచ్చాడు. ఆయన చూచినదృశ్యం ఆయనకు మతి విభ్రమం కలిగించినట్టు కనిపిస్తూంది. వస్తూనే, "నీకేమన్నా పిచ్చిపట్టలేదుగద!" నేల ఇంకా ఆరలేదు, చలిగాలులింకా వీస్తూనే ఉన్నాయి; ఏమిటిది ?" అని ప్రశ్నించాడు. పెర్హాంసా నవ్వుతూ విత్తులు చల్లుతూనే ఉన్నాడు. టాన్సెటెన్ వెనక్కి తిరిగాడు ఇంటికి వెళ్లిపోవడానికి, తను చెప్పవలసిన ముక్క చెప్పాననే సంతృప్తితో

సూర్యాస్తమానం అయేవరకు పెర్హాంసా విత్తులు చల్లుతూనే ఉన్నాడు. రాత్రి భోజనమప్పుడు ఆయన ముఖంలో సంతృప్తి తాండవిస్తున్నా, బాగా అలసిపోయి

ఉండటంవల్ల వెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు. బెరెట్ గాని, కొడుకులుగాని చెపుతూన్న మాటలేవీ ఆయన వినలేదు.

మరుసటిరోజంతా మళ్ళీ ఆయనకి విత్తులు చల్లడం తోనే సరిపోయింది. కొడుకులిద్దరు ఎడ్లనాయంతో ఆయన వెనకనించి విత్తులమీద మట్టి తోసేస్తున్నారు. సాయంకాలా నికి ఆయన పని ముగించాడు. వలసలో తక్కినవా ళ్ళెవరూ ఇంకా చేలల్లోపని మొదలుపెట్టలేదు. ఆరాత్రి ఇంటికి తిరిగి వెళ్తూన్నప్పుడు ఆయన సంతోషానికి మేరలేదు.

ఆ మరునాడు మళ్ళీ బాగా చలిగా, మసుకుగా ఉంది. సూర్యుడు కనిపించలేదు. మంచుగాలి వీస్తూంది. క్రమంగా వర్షం ప్రారంభమయింది. మరికొంతసేపటికి మంచు పెద్ద పెద్ద పింజలుగా పడుతూంది. ఆపింజిలునేలమీద పడేసరికి కరిగినీరై పోతున్నాయి. చలిమరీ ఎక్కువయింది. మంచు మంచుగానే ఉండి పోతూంది. అది అతిదారుణమైన తుపాను...ఆ శీత కాలం పొడుగునా అంతదట్టమైన మంచుతుపాను వాళ్లు చూడలేదు.

మరుసటి రోజున ఉదయం సూర్యుడు ఉదయించాడు. మంచు పడటం ఆగిపోయింది. కాని ఎవరూ బయటికి వెళ్ల డానికి వీలులేనంత చలిగాఉంది. వసంతఋతువు ఇప్పు డెక్కడ, ఇంకా కొన్నిసంవత్సరాలకిగాని వచ్చేట్టు కనిపించడం లేదు.

పెర్హాంసాకి నిద్రలేదు. పసిపిల్లవాడి లాగ ఏడ్చెయ్యాలనిపిస్తూంది ఆయనకి. తానెవడు? పడవలు నడుపుకునే నావికుడు. ఒకప్పుడు. తనకేం తెల్సు వ్యవసాయాన్ని గురించి? అందరికన్న తను ముందు ఉండాలనే ఉబలాటంతో, తనే చేసుకున్నాడు! చల్లిన విత్తులన్నీ బూడిదలో పోసినపన్నీరైనయి. ఇక తాను విత్తులు కొనలేడు. తిండితినటం మానేశాడు. బెరెట్ దగ్గిరికి వచ్చి పలకరించబోతే కస్సుమని కసురుకుంటున్నాడు.

చివరికి, ఎండవచ్చింది. కాని మంచుకరగటం ఇంకా ప్రారంభంకూడా కాలేదు. పెర్హాంసా పక్కమీంచి లేవడం లేదు. గోడకేసి తిరిగి అలాగే పడుకుని ఉన్నాడు. దైవికశక్తులు తనకు విరుద్ధంగా పనిచేస్తున్నప్పుడు తనేంచేయగలడు?...శనిగాడు తనపైన దండెత్తాడు...ఇంక ఆతాడు, పశువుల వసారాలో దూలం,—అవే తనకి శరణ్యాం.

మంచు గబగబా కరిగిపోయింది. నేల మళ్లీ ఆరిపోయింది. సూర్యుడు బాగా ప్రకాశిస్తున్నాడు. మబ్బులు కనిపించడంలేదు. ఆకాశానికి, భూమికి మధ్య అంతా ఒకటే బంగారు వెలుగు. రాత్రులుకూడా వెచ్చగా, సుఖంగా ఉంటున్నయి. టాన్సెటెన్ విత్తులుచల్లడ మారంభించాడు. పెర్హాంసా ఆదృశ్యం చూసి భరించలేకపోయాడు. గబగబా తన పొలంలోకి వెళ్లి మట్టి తొలగించి ఒకగింజ బయటికి తీశాడు. దానిరంగు ఇప్పుడు, వెనకటి బంగారురంగు కాదు. తెల్లగా పాలిపోయి, మట్టికొట్టుకుని ఉంది. విత్తువిచ్చి

పోవడానికి సిద్ధంగా ఉంది. "ఇదీ మంచు బీభత్సం!" తనలో తాను అనుకుంటున్నాడు—"గింజ పాసి పోతున్నట్టుంది!" ఔను తనకు శనిపట్టింది, సందేహంలేదు.

పెర్హాంసాకి ఇంకా కొంతభూమి మిగిలి ఉంది. అందులో బంగాళాదుంపలు నాటాడు. అది నాలుగెకరాల చెక్క. తను, కొడుకులు కష్టపడి పనిచేశారు...ఆభూమిలో పండిన ఆరువందల బుషెళ్ల బంగాళా దుంపలను వాళ్లు అమ్మకో వచ్చు. అందుచేత పెద్దగా దిగులుపడవలసినదేమీ లేదు. పెర్హాంసాకి తెలుసు. తనుఏదోపని చేస్తూ ఉండాలి; లేక పోతే పిచ్చెత్తవచ్చు. తనకు శనిపట్టింది. ఇప్పుడు తను ఏం చేయగలడు, అంతకన్న?

ఇంట్లో మిగులుగా ఉన్న బంగాళా దుంపలన్నీ బయటికి తీశాడు పెర్హాంసా. పొలమంతటికి సరిపోయేటట్టు వాటిని బాగా చిన్న చిన్న ముక్కలుగా కోశాడు. తర్వాత, తను, కొడుకులు వాటిని నాటారు. ఆదివారంఉదయం ఆయన బాగా అలసిపోయి ఆలస్యంగా నిద్రలేచాడు. కళ్లు తెరిచేసరికి బెరెట్ బల్లదగ్గిరకూచుని బైబులు చదువుతూంది. భర్త విచారంగా ఉన్న సమయంలో ఆమె ఇంచు మించు ఆయనను పలకరించదు. ఈమధ్య ఆమె అసలు ఎప్పుడోగాని ఆయనతో మాట్లాడటంలేదు. విత్తనపు గోధుమంతా వృధాగాచెడిపోయింది; ఆ నష్టాన్ని కూడదీయట మెలాగా అనే పెర్హాంసా ఎడతెగకుండా ఆలోచిస్తున్నాడు. కాని, తన

మనస్సు ఎన్నిసార్లు ఆ ప్రశ్నచుట్టూ ప్రదక్షిణాలుచేసినా, జవాబుమాత్రం ఏమీ తోచడంలేదు.

ఇంతలో కొడుకులిద్దరు చాలా విసురుగా పరుగెత్తుకొస్తున్నారు. పెర్హాంసా లేచికూచునేసరికే వాళ్లు తలుపు తోసుకు వచ్చేశారు. ఓల్ మొదట లోపలికి వచ్చాడు. "మన గోధుమలు మొలిచెయ్ నాన్నా!" అని అరిచాడు ఓల్. "నాన్నా మనగోధుమలు మొలిచెయ్ తెలుసా?" అన్నాడు మళ్లీ. హాన్సకూడా లోపలికివచ్చి, "ఇంత ఎత్తు మొక్కలున్నాయి నాన్నా! ఇంక మరి తుపాకీ కొనేస్తావా?" అన్నాడు.

పెర్హాంసా ఏమీ మాట్లాడలేదు. లేచిబయటికి వెళ్లిపోయాడు. అక్కడ కదలకుండా నుంచున్నాడు. విషయం సరిగా గమనించకుండానే, ఆవేశంతో అరిచాడు. తనచేనంతట పచ్చని చిన్న చిన్న మొక్కలు పైకిలేచి ఆ నీరెండలో తలలూపుతున్నయి. అలాగేనిలబడి చూస్తూ ఉండిపోయాడు. తిరిగి ఇంటికి వచ్చేసరికి ఆయన పూర్తిగా మారిపోయాడు. బెరెట్ ఇంకా బైబులు చదువుకుంటూంది. పెర్హాంసా ఆమెవైపుచూస్తూ, "అది మాకుకూడా కాస్తచదివి వినిపించు. అల్లరి చెయ్యకండ్రా! రండి, అమ్మ బైబులు చదువుతూంది. చక్కగా కూచుని వినండి," అన్నాడు.

ఆ వసంతంలో అక్కడికి ఇంకా చాలామంది వలస వచ్చారు. ఆ ఐర్లెండు వాళ్లు వచ్చేశారు. తోసింగులు, సోనింగులు—ఇంకా ఎందరో క్రొత్తవాళ్లు వచ్చి భూమి సంపాదించు

కున్నారు. వాళ్లంతా మంచి మనుష్యులు—ఒక్క టార్కేల్ టల్లాక్సెన్ తప్ప. ఆయన మిగిలిన వాళ్లందరికన్న చాలాడబ్బు గలవాడు. అతిగా మాట్లాడేరకం. ఆయనముందు టాన్స్‌టెన్ కూడా తీసికట్టయూడు. తనుచేసిన పని ఏదైనా సరే, అదే సర్వోత్తమమైనదని అందరికి నచ్చచెప్పాలని ఆయన నిరంతర ప్రయత్నం. భూమి బాగాచేసుకొనడాని కంటె ముందుగా కలపతో బందోబస్తుగా ఇల్లు కట్టుకోటం అవసరమని ఆయన సిద్ధాంతం. అయితే, తక్కిన వాళ్లందరు తమపనుల్లో తాము ఉండటం వల్ల, కలప తెచ్చుకొనటానికి ఆయనతో పట్నానికి వచ్చేవాళ్లు ఎవరూ లేక పోవడంతో, ఆయనకూడా వాళ్లలాగే ముందుగా మట్టియిల్లే కట్టుకోక తప్పలేదు.

బెరెట్ ఈ విషయం ప్రస్తావించింది. ఆవలసలో ఒకరైనా కలపయిల్లు కట్టుకుంటే బాగుండునని ఆమెవాంఛ, ఆ యింటితో తనకు సంబంధం లేకపోయినాసరే. "మనుష్యులు జంతువులలాగ బ్రతకలేరు. వాళ్లు ఒకసారి జంతువులుగా మారితే ఆపైన వాళ్లకు ఇల్లు వాకిళ్లు ఉన్నా లేకపోయినా ఒకటే. ఇక్కడవాళ్లకి ఎవరో ఒకరు ఈసంగతి తెలియజెప్పాలి," అనుకుంది.

ఈమాటలు బెరెట్ తనలో తానే అనుకున్నా బయటికి వినిపించినయి. పెర్హాంసా లేచి పొలానికి వెళ్లిపోయాడు; తిరిగి ఇంటికిపోటానికి ఆయనకు మనస్సు ఒప్పడంలేదు. ఆయన కళ్లలో నీళ్లు తిరిగినయి. "నువ్వేమో గొడ్డులాగ అస్తమానం పనిచేస్తున్నావు. అయినా, బెరెట్ దృష్టిలో నువ్వు వట్టిపనికి

మాలిన పశువువి!'' అనుకున్నాడు. ఈ విధంగా, టార్కెల్ టల్లాక్సెన్ వంటివాడన్నమాటే తన బెరెట్ కూడా అనడం దుర్భరం...ఏమిటిది? రోజురోజుకీ మరీ ఇలా అయిపోతూంది? తనుపడుతూన్న కష్టమంతా బూడిదపాలేనా చివరికి?

మరికొంతమంది ఆవసలకివచ్చి, ఒకరోజుమాత్రం ఆగి, బడలిక తీర్చుకుని, ఇంకా పశ్చిమానికి వెళ్లిపోయారు. జన సమ్మర్దం అట్టేలేనిచోటు చూసుకుని స్థిరపడాలని వాళ్ల సంకల్పం. వాళ్లు వస్తున్నారు.

మూడు రోజులుగా పొగమంచు కురుస్తూంది. మూడో రోజు సాయంకాలం పొగమంచు తెరవిచ్చింది. సుందరమైన సూర్యాస్తమయదృశ్యం అందరికీ ఆహ్లాదం కలిగించింది. బెరెట్ ద్వారంలోకూచుని ఆవుకిపాలు పిదుకుతూంది. అటు చూచేసరికి ఒకపెట్టెబండీ తమ ఇంటివేపే వస్తూంది. బండివెనక రెండు ఆవులు వస్తున్నాయి. ప్రక్కగా అలసిపోయినట్టున్న ఒకవ్యక్తి, ఆయన వెనక మెల్లగానడుస్తూన్న ఒకపిల్లవాడూ కనిపించారు. ''ఇక్కడ నార్వేదేశస్థు లెవరైనా ఉన్నారా?'' ఆవ్యక్తి అడిగాడు.

పెర్హాంసా ఆమాటవిని పశువుల పాకలోంచి బయటికి వచ్చాడు. ''అదృష్టవంతులే మీరు. రండి మేం నార్వే వాళ్లమే,'' అన్నాడు.

''మేమీరాత్రికి ఇక్కడ ఉండవచ్చాండి?'' ఆగంతకుడు అడిగాడు. బండీదింపడానికి సాయంచేస్తూనే పెర్హాంసా

ఆమోదం వెల్లడించాడు. మరో ఇద్దరు కుర్రవాళ్లు ఒక ఆడ పిల్ల బండీలోంచి దిగారు. తర్వాత ఆగంతకుడు బండీలోకి చూస్తూ అడిగాడు, "నువ్వుకూడా దిగుతావా?" అని. "తాళ్లు విప్పందే ఎలా దిగుతుంది!" అంది చిన్నపిల్ల. ఆయన బండీలోకి ఎక్కాడు. పెర్వాంసా బండీలోపలికి చూశాడు. ఆదృశ్యం చూసేసరికి, ఆయన విస్మయానికి మేరలేదు. ఒక బట్టల మూటమీద ఒకస్త్రీ, వెనకఉన్న పెట్టెనానుకుని కూచుంది. ఆమెచేతులు త్రాళ్లతో ఆపెట్టెకి ఇటూ అటూ ఉన్న చేతి కొక్కాలకు బిగించి కట్టిఉన్నాయి. ఆమె ముఖం వింతగా ఉంది.

ఆ వ్యక్తి పెర్వాంసా వేపు చూడకుండా వెళ్లి, ఆమె కట్లు విప్పి క్రిందికి దించాడు. "ఏంలేదు; అదే నయమవు తుంది," అన్నాడు కుర్రాడికి చెప్పినట్టు.

బెరెట్ ఆస్త్రీ దగ్గిరికి పరుగెత్తుకెళ్లి ఆమె చుట్టూ ఒక చెయ్యి వేసి, పట్టుకుని నడిపిస్తూంది. వాళ్లు ఒకరిముఖం ఒకరు చూసుకున్నారు. వెంటనే పరస్పరం అర్థంచేసు కున్నారు. "కాని, ఇక్కడ కూడా కాదుటగా!" అంది ఆస్త్రీ బెరెట్‌తో ఇంట్లోకి_వెళుతూ.

ఆ గంతకుడు పెర్వాంసాకి తన కథంతా చెప్పాడు. ఆయన బండితోపాటు ఇంకో నాలుగుబళ్లు బయలుదేరినయి. దార్లో, తనకు ఇబ్బంది కలిగేసరికి, మిగిలిన బళ్లు ముందుకి సాగిపోయినయి. ఆయన కథ చెప్పిన తీరు వింతగా ఉంది. కథ పొడుగునా ఆయన దుఃఖపడుతున్నాడు. వాళ్లు మిన్నె

సోట్రా వదిలి ఆరువారాలు ప్రయాణంచేసినమీదట, తాను ఎక్కడ వున్నదీ తనకే తెలియని పరిస్థితిలో ఉంది. దారి తప్పి ఎటో పోతున్నామని నిశ్చయించుకుని, ఆశలన్నీ వదులుకున్నస్థితిలో వాళ్లు పెర్వాంసా యింటికి వచ్చారు. తాను పడని కష్టాలు లేవు. ఆయన మళ్లీ కళ్లు తుడుచుకున్నాడు.

"మీ ఆడవాళ్లు పాపం సుస్తీగా ఉన్నట్టున్నారు?" పెర్వాంసా అడిగాడు.

ఏమో తెలియదు. ఆమె ఎప్పటిలాగే కనిపిస్తోంది. కాని, ఆడవాళ్లు నిగ్రహించుకోలేరు చూడండి. ఏమో అదంతా భగవంతుడికే తెలియాలి. పైగా, తల్లిగుండె! మాకడసారి కుర్రవాణ్ణి మేమా దిగంబర మైదానంలో పారేసుకునివచ్చాం."

ఈ మాటకి పెర్వాంసాకి కూడా దుఃఖం వచ్చింది... "అసలు ఏం జరిగింది?" జాలిగొంతుతో అడిగాడు.

ఆ గంతకుడు మళ్లీ చెప్పటం మొదలుపెట్టాడు. కుర్రవాడికి సుస్తీచెయ్యడం, దారిలో తాను వెళ్లిన డాక్టరుకి ఏమీ తెలియకపోవడం, అంతా చెప్పాడు. ముందర వెళ్లిన బళ్లను కలుసుకునే ఆశతో వేగంగా ముందుకి సాగడం తప్ప తను చెయ్యగలిగిందేమీ లేకపోయింది. దారిలో ఒకరోజురాత్రి కుర్రవాడు చనిపోయాడు. వాణ్ణి, ఆ మైదానంమధ్య, అక్కడే పూడ్చిపెట్టి, గుర్తుకోసం ఒక పెద్దరాయి పెట్టి వచ్చాడు, తను. ఇది జరిగి అప్పుడే ఐదు

రోజులయింది. అప్పటినించి భార్యని కట్టి ఉంచుతున్నాడు. లేకపోతే ఆమె బండీలోంచి దూకి, తన బిడ్డని పారేసి వచ్చిన చోటికి పరిగెత్తుతుంది. ఆ కుర్రవాణ్ణి మళ్లీ తీసుకు వచ్చి, ఎక్కడైనా జనం ఉన్నచోట పూడ్చిపెట్టకపోతే, తన భార్యకి పిచ్చెత్తుతుందేమో అని తన భయం.

వాళ్లందరినీ ఇంట్లోకి నడవమన్నాడు పెర్వాంసా. బెరెట్ ఆ ఆడమనిషి పని చూస్తూంది. పాపం ఆ స్త్రీ అప్పుడే పడుకుని నిద్రపోయింది. బెరెట్ శ్రద్ధగా ఆమె మంచి చెడ్డ లన్నీ చూసింది. కష్టాల్లో ఉండి వచ్చిన అతిథులు. వాళ్లు అక్కడ ఉండే ఒక్కరాత్రి తనకు చేతనైనంత ఉపచారం చెయ్యాలి. వాళ్లంతా పడుకున్నతర్వాత, పెర్వాంసా బెరెట్‌ని అడిగాడు, "ఆమె ఏవన్నా చెప్పిందా?" అని. "ఏదో చెప్పింది. కాని నాకేమీ అర్థంకాలేదు," అంది బెరెట్. వాళ్లకథంతా బెరెట్‌కి చెప్పాడు పెర్వాంసా. "రేపు నేనూ, హాన్స్‌ఓలా ఆయనను కూడా వెంటబెట్టుకుని వెళ్లి ఆ కుర్రవాడి శవాన్ని తీసుకువస్తాం. వాడికోసం ఇక్కడ మన మొక శవపేటిక తయారుచెయ్యాలి. పాపం వాణ్ణి ఆ నిర్జన మైదానంలో వదిలేయడం అన్యాయం," అన్నాడు.

పెర్వాంసా మాట్లాడుతున్నంతసేపూ బెరెట్ ఏమీ అనలేదు. చివరికి, నిష్ఠురంగా అంది, "ఇప్పుడైనా తెలుస్తూందా జీవితం ఎంత దారుణంగా ఉన్నదో ఇక్కడ? మనుష్యులు కాదు ఇక్కడ ఉండవలసింది!" ఆమె కంఠ స్వరంలో తీవ్రత పెర్వాంసాకి విస్మయం కలిగించింది. అదీ

ఒక్కక్షణం. తర్వాత, ఆయన దృష్టి మళ్లీ తన అతిథిమీదికి మళ్లింది.

కొత్తగా వచ్చిన ఆస్త్రీ ఇంట్లోకి రాగానే విశ్రాంతిగా పడుకుంది. ఇక్కడ ఒక ఇల్లు, మంచాలు, పొయ్యిమీద కాగుతూన్న నీళ్లు, సాదరంగా పలకరించే ముఖాలు—అంతా సంసారపక్షంగా ఉంది. ఆమె నిద్రపోవడానికిపూర్వం బెరెట్ స్నేహపూరితహస్తాలను కృతజ్ఞతతో స్పృశించింది. ఆ తర్వాత ఆమె సర్వం మరిచిపోయింది, తన బిడ్డని ఆ ఎడారిలో ఒంటరిగా, నగ్నంగా పారేసి వచ్చిన ఒక్కటి తప్ప.

మరునాడు తెలవారవచ్చేవరకూ ఆమె బాగా నిద్రపోయి లేచింది. మళ్లీ బిడ్డనిగురించే ఆలోచన. తనువెళ్లి బిడ్డను చూసుకోవాలి. ఇప్పుడే, తన భర్త లేవకముందే వెళ్లిపోవాలి. ఆయన నిద్రలేస్తే తనని వెళ్లనివ్వడు. చప్పుడు చెయ్యకుండా ఆమె పక్కమీంచి లేచింది. పక్కమీద పడుకునిఉన్న అన్నామేరీని చేతుల్లోకి తీసుకుంది. గబగబా బయటికి వెళ్లిపోయింది. తలుపులు తెరిచేఉన్నయి; ఆమె ఇంటికి దూరంగా వెళ్లిపోతూంది.

బెరెట్ నిద్రలో ఒత్తిగిలింద. ఎవరో పెద్దగా తనను చాలాసార్లు పిలుస్తున్నట్టు వినిపించింది ఆమెకి. చివరికి, మెలుకువ వచ్చింది. ఆమె బాగా అలసిపోయిఉంది. అందుచేత బద్ధకంగా తలెత్తి ఎదటి పక్కమీద చూసింది. పక్క

ఖాళీగాఉంది. దాంతో పూర్తిగా మెలుకువ తెచ్చుకుని లేచింది.

వెంటనే భర్తను లేపింది, "ఆమె వెళ్ళిపోయింది, ఆమె వెళ్ళిపోయింది, లెండి. తర్వాగా లెండి!" అంటూ.

పెర్రాంసా లేచి, బట్టలు వేసుకున్నాడు. "నువ్వు వెంటనేవెళ్ళి, హాన్సబిల్లాని నేను రమ్మన్నాననిచెప్పు. ఇప్పుడే బయలుదేరాలి," అన్నాడు.

వాళ్ళు బయలుదేరి వెళ్ళేసరికి, అప్పుడే సూర్యోదయం అవుతూంది. పెర్రాంసా తన బండిమీదఎక్కి చుట్టూ మైదానం అంతా తేరి పారచూశాడు. దగ్గరలో ఉన్న ఒక కొండపైన ఆయనకు ఏదో కనిపించింది. ఆయన, బెరెట్ పరిగెత్తడం మొదలుపెట్టారు. ఆస్త్రీ అక్కడే నిలబడి, వాళ్ళు తనవేపు వస్తూండటం చూస్తూంది.

ఆమెచేతులలో ఉన్నపిల్లను చూసేసరికి, పెర్రాంసా భయంతో తెల్లపోయాడు. ఇంకా గబగబా పరిగెత్తి ఆస్త్రీ చేతుల్లోంచి అన్నామేరీని తీసుకుని గట్టిగా తన హృదయానికి అదుముకున్నాడు. బెరెట్ దగ్గిరికిరాగానే, అలసిఉన్న ఆపసి పిల్లను ఆమెచేతికిచ్చాడు. బెరెట్ ఆమెను గట్టిగా పట్టుకోలేక పోయింది. తనువిన్న పిలుపులు, భగవంతుడి హెచ్చరికలే! ఆరాత్రి భగవంతుడు తనపాలిట ఉన్నాడనుకుంది.

పెర్రాంసా ఆస్త్రీని వెంటబెట్టుకుని మెల్లగా ఇంటి ముఖం పట్టాడు. తన బిడ్డను వెతుక్కుంటూ బయలుదేరి

నట్టు ఆస్త్రీ చెప్పింది. "త్వరగా వెళ్లాలి! అమ్మో ఆచలిలో నాబిడ్డ ఏమయిపోయాడో!" అంది. అంతే. ఆమె ఇంక ఏమీ అనలేదు. వాళ్లు బయలుదేరి వెళ్లడానికి సన్నాహాలు చేసుకుంటూంటే, గుడ్డ ప్పగించి చూస్తూ కూచుంది. మగ వాళ్లు చిన్న శవపేటిక తయారుచేశారు. సారీనా దానికి గుడ్డ వేసి కుట్టింది. తర్వాత వాళ్లు బయలుదేరారు—పెర్వాంసా, హాన్సబిల్సా, అతిథి, ఆయనభార్య. నాలుగు రోజులు వాళ్లు ఆరాయికోసం వెతికారు. చివరికి వాళ్లు తిరిగివచ్చారు. ఆఖాళీ శవపేటికనే తిరిగి తీసుకొచ్చేశారు.

తిరిగివచ్చిన మరుసటిరోజే, ఆ అతిథులు బయలుదేరి వెళ్లిపోయారు. వాళ్లు జేమ్స్ నదిదగ్గిరికి పోతున్నారు. "జేమ్స్ నదికి ఎటుపోవాలో తెలుసునా?" అని పెర్వాంసా తన అతిథిని ప్రశ్నించాడు. "తెలుసు. ఇంకా పడమటికి వెళ్లాలి;" అన్నాడు ఆయన. ఆయనను ఇంక ప్రశ్నలు అడిగి ప్రయోజనం లేదనుకున్నాడు పెర్వాంసా. తనకు తెలిసినంతవరకు సరియైన దారిచెప్పాడు.

ఆస్త్రీ ఇప్పుడు కొంత సేదదేరినట్టుంది. ఏదో ఆలోచిస్తూ కూచుంది. వాళ్లు బయలుదేరి వెళ్లేవరకూ ఆమెభర్త అక్కడికి వచ్చినప్పుడు మాట్లాడినట్టే హాస్యధోరణిలో మాట్లాడుతున్నాడు. ప్రయాణ సన్నాహాలు పూర్తి అయాక, ఆయన అందరికీ కృతజ్ఞతాభివందనాలు చెప్పాడు. వాళ్ల బండి పశ్చిమానికి పోయి పోయి, రాత్రి చీకటిలో అదృశ్యమయింది.

బెరెట్ ఒకగుట్టమీాద నిలబడి, ఆబండీ కనుచూపు మేర దాటిపోయేవరకూ చూసింది. వాళ్లు వెళ్లిపోవడం ఒక విధంగా బాగానేఉంది. కాని, తాను వాళ్లని అలా వెళ్లనివ్వ కూడదు. ఈభావం ఆమెకు సంతాపం కలిగించింది. "నిస్స హాయులు! నాకంటె దుర్భరస్థితికి క్రుంగి పోతూఉంటే, చూస్తూ కూచున్నాను నేను! పాపం వాళ్లగతి ఏమి కానుందో!" వాళ్లు అలాగే భూమిలోక్రుంగి, కుమారిలి పోతారని ఆమె ఊహ. పైగా, ఇప్పుడు వర్షంకూడా వాళ్లను వెంట తరుముతున్నట్టుంది. దట్టమైన కారుమేఘాలు ఆ మైదానంపైన దొర్లుకుంటూ ఎగిరిపోతున్నాయి. బెరెట్ వెనక్కితిరిగి, అందమైన తన కుటీరానికి మెల్లగా నడిచిపోయి, రాత్రికి వంటప్రారంభించింది. ఇతరులకైనా తాను కొంత సుఖం కలిగించవచ్చు గద!

'ఆ రాత్రి భోజనాలయిన తరువాత ఆమె మళ్లీ కొండ పైకి వెళ్లి ఆ బండీవెళ్లినవైపే చూస్తూ నిలబడింది. అయితే బండీ కనుచూపు మేరదాటిపోయి చాలాసేపయింది. భగవం తుడు తన ముద్దుబిడ్డలయిన ప్రజలకు ఇలాంటి పరిస్థితులు ఎందుకు కల్పిస్తాడో! బెరెట్‌కిది పెద్ద సమస్య. శనిగాడు వెంట తరుముతున్నాడు వాళ్లనందరిని. పైకి, నల్లనిమేఘాల వైపు చూసింది. ఆమె నెత్తిమీాద ఒక నల్లనిమేఘం కని పించింది. ఆమేఘం కేవలం శనిగాడి ముఖంలాగే ఉంది. ఆముఖం ఆమెవైపే చూస్తూంది. నిజమే, తను చెప్పింది. అక్షరాలా నిజం. మానవులు ఇక్కడ బ్రతకలేరని తను

మొదటినించీ చెబుతూంది. కొంతసేపు ఆమె అలాగే కదల కుండా కూచుంది. ఇక భరించలేక పోయింది. లేచి, ఇంటికి పరుగెత్తింది. ఇంట్లోకి వెళ్ళి కిటికీలతలుపులన్నీ మూసివేసింది.

పెర్హాంసా, పిల్లలూ చేలోంచి ఇంటికి నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ వచ్చారు. పెర్హాంసా, బెరెట్ దగ్గిరికివచ్చి, "బెరెట్! నా గృహదేవత! బెరెట్! ఇలారా," అంటూ ప్రేమతోపిలిచాడు. ఆమె చలికోటువిప్పి, పడుకుం టానికి సాయపడాలని పాపం పెర్హాంసా సరదా.

"అయ్యో! అయ్యో! పోండి! మీకుపాపం పుణ్యం, సిగ్గు ఎగ్గూ ఏమీలేకుండా పోతున్నాయి. మనకు శనిపట్టిందన డానికి ఇంతకన్న ఇంకేంకావాలి?" అంది బెరెట్.

బెరెట్‌కి ఇప్పుడస్తమానం ఆమేఘంలోని శనిగాడి ముఖమే కళ్ళకి కట్టినట్టు కనిపిస్తూంది. సాయంకాలం మరీని; కేవలం ఆమె తలపైనే వేళ్ళాడుతున్నట్టు కనిపిస్తుంది. పని చేస్తూన్నంతసేపు ఆమెకి వంట్లో ఏమీ బాగుండటం లేదు. అందుచేత, ఒకచోట కూచుంటుంది. అలాంటప్పుడు ఆ మేఘంలోని ముఖం మళ్ళీ కనిపించేది. మిగిలిన వాళ్ళకిమాత్రం అది కనిపించడంలేదూ? కనిపించితీరాలి, అనుకుంది.

ఇప్పుడు ప్రతిరాత్రి ఆమె కిటికీలన్నీ మూసివేస్తూంది; పెర్హాంసా ఇంట్లోఉన్నా మానడం లేదు. మొదట పెర్హాంసా ఇది చూసి నవ్వుకున్నాడు. ఆమెమీద ఆయనకు జాలి, ప్రేమ ఎక్కువయింది. కాని, క్రమంగా ఆమె భయం పెర్హాంసాకి

కూడా పట్టుకుంది. అయితే, ఆమె ఎందుకు భయపడుతున్నది నిజానికి ఆయనకి తెలియదు. తనప్రియసతి ఏమయిపో తుందో!—అని ప్వెర్హాంసా భయం.

౨

జూలై నాటికి, ఏపుగా ఎదిగిన గోధుమచేలన్నీ కలకలలాడుతున్నయి. ఉదయాస్తమానం చేలపైన ఎండ కాస్తూంది. చేలు చురుకుగా పెరిగిపోతున్నయి. ప్వెర్హాంసా ఆచేలను చూసుకుని మురిసి పోవడానికి, పొద్దు చాలడం లేదు. ఒక్క బెరెట్ వంక చూసినప్పుడు మాత్రమే ఆయన ఆనందానికి అంతరాయం కలుగుతూంది. ఆమెలో ఈ మార్పేమిటో ఆయనకు బోధపడటంలేదు. కలపతో పెద్ద ఇల్లు కడితే ఆమె పరిస్థితి చక్కబడుతుందేమో! త్వరగా తను ఆప్రయత్నం చెయ్యాలి. ఈ శరత్కాలంనించే ప్రారంభించ వచ్చేమో! ఔను, ప్రారంభించవచ్చు. అనుక్షణం అన్నీ ఎదిగిపోతూండటం తాను ప్రత్యక్షంగా చూస్తున్నాడు. త్వరలోనే తన ప్రియసతికోసం తనస్వప్న మందిరం నిర్మించడానికి తగినంతడబ్బు చేతికి వస్తుంది.

అప్పుడే ప్వెర్హాంసా ఇంట్లో రోజూ కొత్త బంగాళాదుంపలు వండుకుంటున్నారు. మిగిలినవాళ్ల పొలాల్లో ఇంక దుంపపడలేదు. ఓట్లు బాగా ఎత్తుగా పెరిగినయి. గోధుమచేను అన్నింటినీ మించి ఉంది. కొత్తగా వలసవచ్చిన ఆ ఐర్లెండు వాళ్లతో సహా యిరుగుపొరుగువాళ్లంతా వచ్చి

ఆ చేను చూసి పోతున్నారు. క్రమంగా, పెర్హాంసాకి ఆ ఐర్లాండు దేశీయులంటే మోజు ఏర్పడింది. తను భాష తెలిసి వాళ్ళతో మాట్లాడగలిగితే బాగుండును. కాని, లాభంలేదు. తనచేలో పండిన బంగాళాదుంపలు కొన్ని తీసుకు వెళ్లి వాళ్ళకిచ్చాడు.

పెర్హాంసా ఇప్పుడు దేనికీ తొందరపడటంలేదు. గోధుమకొయ్యాడం, నూర్పిడి అన్నీ నెమ్మదిగా చేసుకో వచ్చు. "ఒక్కసారివచ్చి మనగోధుమచేను చూడరాదూ?" అని ఎన్నిసార్లో బెరెట్‌ని పిలిచాడు. ఎప్పుడైనా ఒక్కసారి ఆమె భర్తతో వెళ్ళేది. అయితే, ఆమెకు ఎప్పుడూ ఇంటి దగ్గిర ఏదో పని జ్ఞాపకం వస్తుంది. అంచేత చీకటి పడేవరకు ఆయనతో ఉండేది కాదు.

చివరికి, ఓరోజున టాన్సెటెన్ వచ్చి, ఆవేళ కోతలు మొదలుపెట్టెయ్యాలన్నాడు. స్నేహితులందరిచేలలో టాన్సె టెనే కోతపనిచేసిపెట్టాలి. వాళ్ళెవరికీ దానిసులువులు తెలి యవు. పైగా, హాన్సఓల్సా చేను కూడా కోతకొచ్చేసింది. అంచేత, పెర్హాంసా చేను ముందరకోయటానికి పెర్హాంసా ఒప్పుకోవలసివచ్చింది. చేనుకోసి, ఎలా కట్టలు కట్టవలసిందీ సోలంయువకులు వాళ్ళకు చూపిస్తారు. నార్వేనించి వచ్చిన ఆవృద్ధనావికులిదరికి ఇదంతా కొత్త.

ఆ సాయంకాలమంతా టాన్సెటెన్నే నాయకుడు. ఆవలసలో ఉన్నవాళ్లంతావచ్చి చేలకోత చూస్తున్నారు. టాన్సెటెన్ కోత మొదలుపెట్టాడు. జీవితంలో అంతకన్న

గర్వ పడదగిన ఘడియ లేదు అతనికి. ఆ భారీయంత్రాన్ని ఎగాదిగా చూశాడు. గుర్రాన్ని తెచ్చి దానికికట్టాడు. కోత మొదలుపెట్టడానికి అన్నీ సిద్ధమై పోయినట్టే. ఆనాడు ప్రొద్దు గూకేదాకా ఆయంత్రం చేలో ఎగువకు దిగువకూ తిరుగుతూ గోధుమపనలు తీసుకొచ్చి పడేస్తూంది. మిగిలిన వాళ్లు కట్టలు కడుతున్నారు. కనీసం ఎకరానికి నలభై బుషెళ్ల గింజలు రాలొచ్చు అని టాన్సెటెన్ అంచనా.

సూర్యాస్తమానం అయిన కొంత సేపటికిదాకా కోత పనిసాగింది. చివరికి గోధుమచేను మంచుకు తడిసి, యంత్రం సరిగా పనిచేయడంలేదు. అంతా బాగాఅలసి పోయారు. కాని, తాను మొదట బయటపడటం ఎవరికీ ఇష్టంలేదు. పెర్హాంసా ఇంట్లో బెరెట్టు, సొరీనా ఆరాత్రి వాళ్లందరికీ సుష్టయిన విందుభోజనం సిద్ధం చేశారు. పగలంతా కష్టపడి పనిచేసిన మగవాళ్లంతా దిట్టంగా పట్టించారు. మొట్ట మొదటిఏడే ఇంత గోధుపంట పండింది; ఇక తామంతా భాగ్యవంతులు అవడానకి ఎంతో కాలం పట్టదని అంచనాలు కట్టారు, భోజనాలు చేస్తూనే వాళ్లంతా. భవిష్యత్తుని గురించి వాళ్ల అంచనాలు అంతులేకుండా తీగలు సాగినయి.

ఆమర్నాడు ఆగోధుమచేలో కోత పూర్తిఅయింది. మిగిలినచేలో కోతపనిని గురించి టాన్సెటెన్ అభిప్రాయం మార్చుకున్నాడు. వాటికి ఇప్పుడు తొందర లేదు, ఇంకోవారం ఆగొచ్చు...అప్పైన గోధుమపంటల చరిత్రలో కనివిని ఎరగ

నంతపంట తమకు దక్కుతుంది. ఇంక పెర్హాంసాకి తానుకోసి పెట్టవలసింది నాలుగెకరాల ఓట్ ధాన్యపుచేను మాత్రమే.

అంచేత, మగవాళ్లంతా పెర్హాంసా గొడ్లసావడి ప్రక్కన నీడలో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ కూచున్నారు. పడమటి దిక్కునించి చల్లనిగాలి వీస్తూంది. గోధుమచేలకి ఇంతకన్న అద్భుతమైన వాతావరణంలేదు. టాన్సెటెన్ ఆనందానికి అంతులేదు...నిజానికి, బంగారంలాంటి ఈభూమికి వాళ్లందరినీ తీసుకువచ్చింది తను. "ఏమంటావ్ పెర్హాంసా"? అనినవ్వాడు టాన్సెటెన్.

కాని పెర్హాంసా సమాధానం చెప్పలేదు. లేచి నుంచుని పశ్చిమదిశకి చూస్తున్నాడు. పెద్దనల్లని కెరటమొకటి ఆవేపునుంచి వచ్చేస్తూంది. ఒక్కమాటుగా ఆయన భయంతో క్రుంగిపోయాడు...అది తుపానా ? హాన్సోల్సా దగ్గిరికి వెళ్లి ఆయనకికూడా చూపించాడు. "తుపానే" ఓల్సా అరిచాడు. ఇద్దరూకలిసి కోత పూర్తిచేయబోతున్న టాన్సెటెన్ దగ్గిరికి పరిగెత్తారు. టాన్సెటెన్ కూడా వచ్చిచూశాడు.

ఆ ముగ్గురు అంతకన్న భయంకరమైన దృశ్యం ఎన్నడు చూసినట్టులేదు. మేఘాలు దొంతర దొంతర్లుగా వచ్చేస్తున్నాయి పడమటినించి. అవి మామూలు మేఘాల్లాగ కనిపించడంలేదు. సముద్రంలోని పెద్ద పెద్ద అలల్లాగ వేగంగా వచ్చేస్తున్నాయి. వాటిపైన మెరుస్తూన్న వెలుగు కనిపిస్తూంది. ఆతరంగాలు దగ్గరకువచ్చిన కొద్దీ బొంయ్యి మంటూ పెద్ద

రొద వినిపిస్తూంది. మరి కొంచెంసేపట్లో వాళ్ల తలల మీదకే. ఆ రంగుల రంగుల మబ్బు వచ్చేస్తుంది.

మరో నిముషానికి ఆమేఘం వాళ్లపైకే వచ్చేసింది. గుర్రాలు చేలవెంట పరిగెత్తడం మొదలుపెట్టినయి. కష్టం మీద టాన్సెటెన్ కట్లువిప్పి వాటిని శాంతపరచ గలిగాడు. అవి పాకలోకి డౌడుతీశాయి. నదిగట్టునించి ఆవులన్నీ వచ్చి, పాకల్లో చొరబడ్డాయి. వలసలో మిగిలిన వాళ్లంతా గాలిలో చేతులు విసురుకుంటూ పరుగెత్తుకొచ్చారు. ఎవ్వరూ ఏమీ చెప్పరు. అవాచ్యమైనభీతి ఆవహించింది వాళ్లందరినీ.

తర్వాత ఆమేఘం విచ్చిపోయింది. ఎగురుతూన్న చిన్న చిన్న శరీరాలు విసురుగావచ్చి, నిస్సహాయులైన ఆవల సదారుల శరీరాలకు కొట్టుకుని నేలమీదపడి, మళ్లీ పైకి ఎగురుతూ మళ్లీ కిందపడుతూ ఆచేనంతట వాలినయి. చేలో ఎక్కడ చూసినా వాటిరొదే, వాటి సంచలనమే. గోధుమ రంగుగా, నల్లగాఉన్న ఆరెక్కల పురుగులు క్షణం ఎక్కడా నిలవడంలేదు. కుర్రవాడు హాన్సె ఒకదాన్ని పట్టుకుని తండ్రికి తీసుకువచ్చి చూపించాడు. అది ఒక అంగుళం పొడుగున గోధుమ రంగుగాఉంది; గాజురేకుల్లాంటి తెల్లటి రెక్కలున్నాయి. కాళ్లు పొడుగ్గా సన్నగా ఉన్నాయి. కళ్లు నల్లగా మెరుస్తున్నాయి.

"దాన్ని పారెయ్యరా!" జెర్సీ అరిచింది.

దాన్ని పారేయించవచ్చు. తక్కినవాటి బెడదసంగతేo? అలాంటి లక్షల కోట్లపురుగులు చిలిపి దయ్యాల్లాగ భూమి అంతటిసీ, అక్కడఉన్న సమస్తాన్నీ కప్పివేసినయి. మానవు లంతా బెదురుచూపులు చూస్తున్నారు. ఇది ఏదో అరిష్టం. బైబుల్‌లో చెప్పిన అరిష్టాల్లాంటిదిగాని, సామాన్యమైనది కాదు. కేవలం భగవన్మాయతప్ప మరోటికాదు.

"భగవంతుడు మనకు ప్రసాదించిన బంగారుకలను మళ్లీ ఆయనే విచ్ఛిన్నంచేసేస్తున్నాడు," అన్నాడు టాన్సెటెన్. "అలాంటి గోధుమ రత్నరాశి మనకు దక్కినట్టే గర్వపడ్డాం!"

ఈ రకమైన ప్రసంగంతో పెర్హాంసాకి మండు కొచ్చింది. "భగవంతుడికి మన గోధుమే కావలసి వచ్చిం దనా నువ్వనేది?" అన్నాడు. ఈ మాట ఆడవాళ్లకు కాస్త సమాశ్వాసం కలిగించింది. టాన్సెటెన్, హాన్స్‌ఓల్సాలు మాత్రం తమ అభిప్రాయాలు మార్చుకోలేదు. చివరకు, హెన్రీసోలం తెలివితెచ్చుకుని, "ఇప్పుడు మనం చేయగలిగిం దేదోచేస్తే తప్ప, రేపు మనకి మిగిలేదేమీఉండదు," అన్నాడు.

ఈ దయ్యాలదండుకి ఎల్లాగైనా ఉద్వాసనచెప్పాలని ఆలోచిస్తున్నాడు పెర్హాంసా. ఓల్ తుపాకి పట్టుకొచ్చి తండ్రికిచ్చాడు. పెర్హాంసా పెద్దధ్వనిచేసేలా ఓసారి పేల్చాడు. దాంతో ఆమిడత దయ్యాలన్నీ ఆకాశంలోకి ఎగిరి మళ్లీ పెద్దమేఘంలాగ కూడుకుని పారిపోయినయి. అక్కడక్కడ

ఒకటో, రెండో మిగిలినయ్యేమోచేలో. "నిజంగా అవి పారిపోయినట్టేనా?" హెర్మీసోలం అడిగాడు.

"ఆఁ. ఇక్కణ్ణించి పారిపోయినట్టే. కాని, మిగిలిన చేలసంగతి చూడు!" ఆ మబ్బు అక్కణ్ణించి కొంచెందూరమే కదిలి వెళ్ళింది. పెర్వాంసా ఇదేమీ వినిపించుకోలేదు. మిగిలిన కోతపని పూర్తిచేయడానికి వెళ్ళిపోయాడు. సాయంకాలానికి ఓట్లచేలో కోత పూర్తిచేశారు.

తరువాత మగవాళ్ళంతా తమ చేలనుకూడా కాపాడటానికి ఏమైనా ఉపాయం ఆలోచించడానికి వెళ్లారు. బహుశః మర్నాడు తమ చేలలో కూడా కోత ప్రారంభించవచ్చు... అప్పటికి వాటిలో ఏమైనా మిగిలి ఉంటే.

పెర్వాంసా కూడా విచారంగా ఇంటికి వెళ్లాడు. తన పంట తనకు దక్కింది నిజమే. కాని, ఆయన ఆందోళన పడుతూన్న విషయాలు ఇంకా ఉన్నాయి. తన పంటే ఎందుకు దక్కాలి. తనతోపాటు, అంతకంటె ఎక్కువగా కూడా రెక్కలు విరుచుకుని పనిచేసిన ఇరుగుపొరుగులపంట ఎందుకు నష్టం కావాలి? అనగా, భగవంతుడు తన కిస్తూన్న ఆదేశమేమిటి? తను ఏంచెయ్యాలి? ఆనాడు పొద్దస్తమానం బెరెట్‌ని గురించిన ఆలోచనలు వస్తూనే ఉన్నాయి. అయితే, ఆమెనుగురించి ఎక్కువగా ఆలోచించడానికి ఆయనకు తగినంత తీరుబాటు లేకపోయింది. ఆ రోజంతా ఆమె ఎవరికీ కనిపించలేదు. "ఔను. పిల్లలకోసం ఇంట్లోనే ఉండి ఉంటుంది," అనుకున్నాడు. అయినా, ఎందుచేతో తన

యింట్లో ఏదో దారుణం జరిగి ఉంటుందనే ఏదో తెలియని భయం ఆయనను వదిలిపెట్టటంలేదు.

ఇల్లంతా ప్రశాంతంగా ఉంది. తలుపు గట్టిగా బిగించి ఉంది. "బెరెట్ తలుపుతియ్యి!" అనేటప్పుడు పెద్దగా నోటమాటలు ఓపట్టాన పెగలి రాలేదు.

ఆ పిలుపుకి జవాబులేదు. తలుపుదగ్గర చెవిపెట్టి విన్నాడు. కొంతసేపటికి లోపల ఏదో శబ్దం వినపడింది. "అమ్మయ్య! అనుకున్నాడు. కాని, తలుపు తెరుచుకోలేదు. తలుపు గట్టిగా తోసి చూశాడు. లోపల తలుపుకి అడ్డంగా పెద్దబరువైన వస్తువేదో పెట్టినట్టుంది. అంచేత తోసినా పోవడంలేదు. "బెరెట్! తలుపుతియ్యి! ఎక్కడున్నావ్ నువ్వు?" అని అరిచాడు.

మళ్లీ ఆ శబ్దమే వినిపించింది. ఆపైన సడి చప్పుడు లేదు. ఏమిటీగొడవ? తనబలమంతా ఉపయోగించి తలుపు తోశాడు. కొద్దిగా తలుపు తెరుచుకుంది; ఆపైన ఇక తలుపు తొయ్యలేకపోయాడు ఆ సందులోంచి ఎలాగో దూరి లోపలికి వెళ్లాడు. గదిలో ఎవ్వరూ లేరు.

"బెరెట్!" మళ్లీ పిలిచాడు; "బెరెట్! ఎక్కడున్నావు నువ్వు?"

జవాబులేదు. మళ్లీ ఏదో చిన్నశబ్దం వినిపించింది. మంచాలమీాదఉన్న పక్కలన్నీ తీసిపారేసి, అంతటా వెతికాడు. ఎక్కడా, ఎవరూ కనిపించలేదు. వెనక్కి తిరిగి

చూసేసరికి, వాళ్ల పెద్దపెట్టె తలుపుకి అడ్డంగా ఆన్చిఉంది... పెద్దభోషాణంలాంటి ఆ పెట్టెని అక్కడ ఎవరు పెట్టారా అనుకున్నాడు. ఆ శబ్దం ఆ పెట్టెలోంచి వచ్చి ఉండాలి. గభాల్న పెట్టె తలుపు తీసి చూసి, నిలువునా కొయ్యబారి పోయాడు. బెరెట్ ఆపెట్టెలోపల అడుగున పడుకుని ఉంది. చంటిబిడ్డ ఆమెచేతుల్లో ఉన్నాడు. అన్నా మేరీ తల్లి కాళ్ల దగ్గరకూచుని ఏడుస్తూంది...అదే పెర్హాంసాకి వినిపించిన శబ్దం.

పెర్హాంసాకి తాను స్పృహతప్పి పడిపోతున్నట్టని పించింది. లాభంలేదు. తను బెంబేలుపడకూడదు. పని జరగాలి. ముందుగా అన్నా మేరీని తీసి మంచంమీద పడుకో బెట్టాడు. తరువాత చంటిపిల్లవాణ్ణి తీసి పడుకోబెట్టాడు. ఆపైన బెరెట్‌ని బయటికితీసి, ఆపెట్టెమీదే కూచోబెట్టాడు. కన్నీళ్లతో కరడుగట్టిన ఆమె ముఖం పూర్తిగా మారిపోయి, వింతగా ఉంది. ఆమెకళ్లు దేనివంకా చూస్తున్నట్టులేదు.

"దయ్యం మిమ్మల్ని ఇంకా ఏంచెయ్యలేదూ? ఈ వేళ అస్తమానం దయ్యం ఇక్కడే తిరుగుతూంది. పెట్టండి మళ్లీ ఆపెట్టెతలుపుకి అడ్డంగా పెట్టెయ్యండి. మనమందరం ఆ పెట్టెలో దాక్కుంటే,—దయ్యం ఆ పెట్టెని మోసుకు పోలేక వదిలేస్తుంది!" అంది బెరెట్ వింత కంఠస్వరంతో.

పెర్హాంసా ఇక ఉండబట్టలేకపోయాడు. తల బెరెట్ తొడమీదపెట్టి పిల్లవాడిలా ఏడ్చేశాడు. బెరెట్ చేత్తో ఆయన తల నిమురుతూ మెల్లగా; ఆ వింతస్వరంలోనే

మాట్లాడుతూంది. "ఏడవండి! మీ మహాపాపాన్ని తలచుకుని ఏడవండి. ప్రతిరాత్రి నేను ఏడుస్తున్నాను. దానివల్ల ఏదో ఫలితం ఉంటుందని కాదు. ఈ నిర్జనప్రదేశంలో మన ఏడుపు ఎవరికీ వినిపించదు...ఏడవండి; బాగా ఏడవండి...భయ పడకండి. పూర్తిగా ఆరిపోవడానికి ముందు దీపం ఇలాగే కొట్టుకుంటుంది!" అంది.

భార్య కళ్లల్లోకి చూశాడు పెద్దాంసా. ఆయన కంఠంలోంచి పెద్ద కేక వెలువడింది. ఆయన విరుచుకుపడి పోయాడు. స్పృహతప్పి పోయింది. భగవంతుడు ఇచ్చిన ఆదేశమిదేనా?

అది మొదలు మాత్రమే. ఆపైన ఐదేళ్ల వరకు ఏటేట ఆదయ్యాపు మిడతలదండ్లు వస్తూనే ఉన్నాయి. కనపడిన వన్నీ గ్రసించిపోతున్నాయి. ఆవలసలో కొందరు పిచ్చి వాళ్లయి పోయారు. కొందరు బిచ్చగాళ్లయారు. మరికొం దరు చెంగు దులుపుకుని లేచి పోయారు. చాలామంది అక్కడే ఉండి పోయారు. లేచిపోవడానికైనా సత్తువలేని నిర్భాగ్యులు ఏంచేస్తారు? వెళ్లాలంటే మాత్రం ఎక్కడికి వెళ్లడం? అంచేత, ఏటేట ఆమహామారుల కోసం ఎదురు చూస్తూ అక్కడే ఉండి పోయారు. ఆ పురుగులు గడ్డితప్ప మిగిలిన వన్నీ తినేసి పోతున్నాయి. ఆగడ్డి మనుష్యులు పెంచింది కాదుగనుక దాన్ని వదిలేస్తున్నయ్యేమో!

ఆ మహామారులు భగవత్ప్రేరితాలే అని అక్కడి వలస దారులందరికీ గట్టినమ్మకం. నమ్మక ఏంచేస్తారు?

వేసవి పొడుగునా చేలు ఏపుగా అద్భుతంగా, ఎదగటం, వెచ్చని ఎండలో గొప్పపంట పండటం, అన్నిరోజులకంటె అద్భుతంగా ఆనందకరంగా కనిపించేరోజున, భగవంతుడే నిజంగా, స్వర్గాన్నించి భూమికి దిగివచ్చినట్టు కనిపిస్తూన్న పడమటిదిక్కునించి ఓ భయంకరమైన మబ్బు, ఆ గోధుమ వన్నెదయ్యాల మబ్బువచ్చి పడటం, మనుష్యులంతా ప్రాణప్రదంగా పెంచుకున్న సర్వాన్ని ఆరగించి పోవటం, ఏటేట ప్రత్యక్షంగా కనిపిస్తూంది. ఔను, సందేహంలేదు. అది వాళ్లను దండించడానికి భగవంతుడు పంపుతూన్న దయ్యాల దండే!

ఇంకా దారుణం ఏమిటంటే, ఆ పురుగులు ఏటేట అక్కడికి వచ్చినప్పుడు అక్కడ గుడ్లుపెట్టి లేచి పోతున్నాయి. ఆ గుడ్లు శీతకాలం పొడుగునా ఆగరపనేలలో పడిఉండి, వసంతఋతువురాగానే విచ్చుకోడంతో అంతకన్న దారుణమైన దయ్యాలదండు తయారవుతూంది. అయినా, పడమటి నుంచివచ్చేదండ్లు వస్తూనే ఉన్నాయి. ఆ దయ్యాల తాండవం జరిగే సమయంలో ఒక్కొక్కప్పుడు కొన్నాళ్లవరకు స్వచ్ఛమైన ఆకాశం కనిపించదు, అవిదేన్నైనా సరే నమిలి మింగెయ్యగలవు...కర్రపెట్టెలు, ఆరవేసిన బట్టలు దేఖీలు. అయితే, ఒక్కొక్కప్పుడు అవి ఒకచేను పూర్తిగా ధ్వంసం చేసి, పక్కచేను వదిలేసి పోవడమూ కద్దు. అవి పూర్తిగా వెళ్లి పోయేవరకు, ఎప్పుడేంచేసేదీ ఎవరికీ తెలియదు.

ప్రతి సంవత్సరం అక్కడి వాళ్లంతా, ఆసంవత్సరంతో సరి అని సమాధానం చెప్పుకుంటున్నారు. వాళ్లంతా ఒక్కచోటచేరి, తమనుకాపాడమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు. సాధ్యమయినంత వరకు ఒకరికొకరు, సాయంచేసుకుంటూ, ఆశనిదశ అంతమయే రోజుకోసం ఆశతో నిరీక్షిస్తున్నారు.

---

# ఏ డ వ భా గ ం

## ౧

అంతకుపూర్వం, అటుతర్వాత చాలా రోజుల్లాగే, జూన్ నెలలో వెచ్చవెచ్చగా ఎండకాస్తూన్న ఒకరమ్యమైన దినమున చిత్రంగా కనిపిస్తూన్న ఒకబండీ స్ప్రింగ్ క్రీక్ వలస వేపుకి వస్తూంది. అ బండీ ఏక్షణాన కూలిపోతుందో అనేట్టుంది. దాన్ని లాక్కొస్తూన్న గుర్రమూ అదేస్థితిలో ఉంది. బండీ తోలుతున్న వ్యక్తి వయస్సు నలభైయ్యేదు మొదలు అరవైయ్యేద్దాకా ఎంతయినా అయి ఉండవచ్చు... తేల్చి చెప్పడం కష్టం. ముఖంలోపటుత్వం కనిపిస్తూంది. కాని ఆయనచాలా వరకు నెరసిన పెద్ద గడ్డంతో బొద్దుగా ఉన్నాడు. దుస్తులన్నీ నల్లని నలుపు.

చుట్టూ పరకాయించి చూస్తూ, తనలోతాను సంగీతం పాడుకుంటూ మెల్లగా బండీ తోలుకొస్తున్నాడు. చివరికి, అటు సూర్యుడు అస్తమించి పోయేసరికి, ఆయన ఆవలసకి చేరుకున్నాడు. ఆవలసలో అక్కడొకటి అక్క-

డొకటిగా ఉన్న కర్రయిళ్లు తప్ప మిగిలినవన్నీ మట్టియిళ్లు. ఆస్ప్రింగ్ క్రీక్ వలసలో మొదటి యింటికి బండీ వచ్చేసరికి సూర్యాస్తమానం అయిపోయింది. "ఇంటిలో నెవరైన ఉండిరా," ఆ వ్యక్తి అడిగాడు.

బరువుగా, బొద్దుగా ఉన్న ఎర్రముఖం మనిషి ఇంట్లోంచి గబగబా బయటికి వచ్చాడు. ఆయన వెనక నే, అంత బొద్దుగానూ ఉన్న ఒకస్త్రీ వచ్చింది. ఇద్దరూ భోజనం మధ్యలో లేచి వచ్చినట్టు కనిపిస్తున్నారు. మళ్లీ అదే ప్రశ్న వేశాడు అభ్యాగతి.

"అయ్యోఖర్మ! అయితే నువ్వా నాన్వేనించేనన్న మాట!" అన్నాడు ఎర్రముఖం మనిషి.

"అడుగో ఆ పోతూన్న మనిషిని పిలువగలరా?" అన్నాడు ఆగంతకుడు.

ఆ మగవాడు. ఆయన ఇల్లాలుకూడా ఏమీ మాట్లాడడంలేదు. అభ్యాగతి అక్కడ భోజనానికి, వసతికి అవకాశం ఉంటుందా అని అడిగి, సమాధానంకోసం ఎదురుచూడకుండా బండీలోంచి దిగాడు. "బాబూ! నీపేరు?"

"సైవెర్ట్ టాన్సెటెన్. మరి నీసంగతికూడా చెప్పు." అంటూ టాన్సెటెన్ ఆగంతకుడి దగ్గరకుపోయి, ఆపాదమస్తకం ఎగాదిగా చూశాడు. బెర్ స్టీకికూడా ఏవో ప్రశ్న లడగాలనిఉంది. ఆమెకూడా ఆగంతకుణ్ణి పరిశీలనగా చూసింది. ఆయన తమఇంట్లో మకాంచేయడం ఆమెకంత సమ్మతంగా

కనిపించలేదు. మళ్లీ టూన్సెటెన్ అడిగాడు: "నేనడుగుతున్నదీ, నువ్వు ఇక్కడికి ఎందుకోసం వచ్చినట్టూ అని?— భూమి సంపాదించుకుందామనా?"

ఆగంతకుడు ఒక్కక్షణం మౌనంగా ఊరుకుని జవాబు చెప్పాడు. "నేను మతగురువును. ఇక నీవిషయము? బాబూ! నీవంటి సద్గృహస్థులు అభ్యాగతులను ఇట్లు నిలబెట్టి ప్రశ్నింపవచ్చునా? నే నీరాత్రికి ఇక్కడ విశ్రమింప వచ్చునా అని అడుగుచున్నాను."

జెర్‌స్టీ ఆనందంతో భయంతో ఊగిపోతూంది. మతగురువు తమయింటికివచ్చి, మకాంచేస్తా మనడం!—ఎంత అదృష్టం! "తప్పకుండా, అయితే మా పేదభోజనం తమకు..." అంది.

"భోజనము ముఖ్యముకాదు. ఏమి ఉన్ననుచాలును. ముందీ గుర్రమునకు కాస్త మేతవేయవలెను," అని సూచించాడు మతగురువు.

టూన్సెటెన్‌కి ఆసంతోషంలో నోటమాట పెగలలేదు కొంతసేపు. మతాచార్యుడువచ్చి తమయింట్లో ఆతిథ్యం స్వీకరించడం! ఎంత చిత్రంగాఉంది! కొంతసేపు వాళ్లిద్దరు ఆ బక్కగుర్రానికి ఉపచారంచేస్తూ పశువుల వసారాలోఉండిపోయారు. అక్కడ ఉన్నంతసేపు మతాచార్యుడు ఏవో ప్రశ్నలడుగుతూనేఉన్నాడు. వాళ్లు మళ్లీ గుడిసెలోకి వచ్చేటప్పటికి ఇల్లంతా చక్కగా శుభ్రంగా కలకల్లాడుతూంది.

ఒక బల్లమీాద తెల్లటి గుడ్డవేసి, దానిమీాద వేడి వేడిపాలు, ఉడకబెట్టినగుడ్లు, రొట్టెలు, కాఫీ, కేకులు అమర్చిఉంచింది జెర్‌ట్రీ. అవేవీ చాలవన్నట్లు ఇంకా ఏవేవో తయారుచేసి తెస్తూంది. మతగురువు ప్రార్థన ముగించి వచ్చికూచుని బాగా ఆకలిమీాద ఉన్నాడేమో గబగబా ఆరగించడం మొదలు పెట్టాడు.

టాన్నెబెన్ గదిమధ్యగా, తలవంచి, చేతులు కిందకు వాల్చి నిలబడి మాట్లాడు తున్నాడు. జెర్‌ట్రీ పొయిదగ్గర కూచుని వాళ్ల ప్రసంగం ఆలకిస్తూంది. "ఈ చాద స్తపుమనిషి కాసేపు మాట్లాడకుండా ఊరుకుంటే బావుణ్ణు!" టాన్నె బెన్ మాట్లాడేస్తూనే ఉన్నాడు. ముందు ముందు అక్కడ ఎలా ఉండబోయేది, అక్కడకువచ్చిన తరువాత గడచిన ఆరేళ్లుగా తాను ఏమేమి చేసింది, చెప్పాడు. మధ్య మధ్య తన ఘనకార్యాలనుగురించి మతాచార్యుని అభిప్రాయం అడు గుతున్నాడు.

చివరికి, మతగురువు భోజనం పూర్తిఅయింది. "మం చిది బాబూ! ఇకకొంచెం ఆగు, మనం ఈవేళకు భగవం తునికి కృతజ్ఞతాభి వందనము చేయుదము!" అన్నాడు. వెం టనే జెర్‌ట్రీ కింద కూచుంది. టాన్నెబెన్ మాత్రం తను ఏమిచేయాలో తోచక గదిమధ్య, అలాగే నిలబడి ఉన్నాడు.

మతాచార్యుడు ప్రశాంతంగా నిశ్చలంగా మాట్లాడు తున్నాడు, ఎదటనిలబడిఉన్న సుపరిచితుడైన మిత్రుడితో అంటున్నట్లు. ఆదినం ఆవిధంగా గడవపెట్టినందుకు ఆయన

భగవంతుడికి ధన్యవాదాలర్పించాడు. ఆరోజున చేసిన పాపాలన్నిటిని విస్మరించవలసినదిగా భగవంతుణ్ణి ప్రార్థించాడు. ఈ ఇంట్లోఉన్న జనాన్నీ, ముఖ్యంగా, తేలికగా చిరాకుపడే ఆ గృహస్థుని ప్రత్యేకంగా ఆశీర్వదించవలసినదిగా అభ్యర్థించాడు. ప్రార్థనమందిరంగాని, మతాచార్యుడుగాని లేని ఆ నిర్జనప్రదేశంలో జీవిస్తూన్న వారినందరినీ దయతో చూడవలసినదిగా ప్రార్థించాడు. తరువాత "శుభంభూయాత్" అని ప్రార్థన ముగించాడు. ఆపైన ఒకనిమిషం నిశ్శబ్దంగా ఉన్నాడు. కొవ్వొత్తిదీపపు వెలుగు ఆయన నెరసిన గడ్డానికి వెండిపూత పూస్తూంది. ఆ గదినిండా గంభీరప్రశాంతి ఆవహించింది. "భగవంతునికి నాధన్యవాదములు!"— అన్నాడు. "సాదరాతిథ్యమొసగిన పుణ్యదంపతులకు, మీకు నాధన్యవాదములు!" అన్నాడు వెంటనే. టాన్సెటిన్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోతూ ఏమీ అనలేకపోయాడు. మెల్లగా నడిచి గదిబయటికి వెళ్లాడు. జెర్ ట్రీ ఇంకా ఆనందం తరంగితమైన ప్రశాంత కపోలాలవెంట ముదశ్రువులు ప్రవహిస్తూండగా అక్కడే కూచునిఉంది.

ఇప్పుడు ప్రతివ్యవసాయక్షేత్రంలోను అదనంగా ఒక చుట్టి ఇల్లు ఉంది. అలాంటి ఇంట్లోనే ఇప్పుడు మతాచార్యుడు నిద్రించాలి. ఆ అదనపుటింట్లో ఎప్పుడూ చాలా సామాన్లు ఉంటయి. కాని, అతిథులకోసం అందులో ఒక మంచం, ప్రక్క మాత్రం ఎప్పుడూ సిద్ధంగా ఉంటయి.

మతాచార్యుడికి ఆ ప్రక్క చూపించడానికి, సైవర్టూ, జెర్‌స్టీ కూడా ఆయన వెంట వెళ్లారు. ఆగదినిండా ఏదో సామగ్రి ఉన్నా, సౌహార్దపూరితంగా, సంతోషదాయకంగా ఉంది. మతాచార్యుడు ఈ సౌకర్యానికి కూడా వాళ్లకు కృతజ్ఞత తెలిపాడు. తరువాత, "శుభరాత్రి" అభివందనం చేసి వాళ్ల వద్ద సెలవు తీసుకున్నాడు.

కడచిన రెండేళ్లలో టాన్సెలెన్‌కి వార్ధక్యం వచ్చి పైబడింది. ప్రతివసంత ఋతువులో ఆయనకి పాడు దగ్గు వస్తూంది. దాంతో ఆయనబాగా అలసిపోతున్నాడు. ఇప్పుడాయనకు ఎక్కువ నిద్ర అవసరం. కాని, ఈ రోజు రాత్రి ఆయనకు అట్టే నిద్ర పట్టేట్టులేదు. మనసులో ఎన్నో పాపాలను దాచుకొన్న ఆయన...ఈ మతాచార్యుడి ఆకస్మికాగమనాన్ని గురించే ఆలోచిస్తున్నాడు.

మర్నాడు, ఉదయోపహారాల వేళ, మతాచార్యుడు వాళ్లను ఎన్నో ప్రశ్నలువేశాడు. ఎదురుగా కనిపిస్తూన్న ఇళ్లన్నిటిలో ఎవరెవరు ఉన్నది కనుక్కున్నాడు. ఈ వేళ ఉదయం టాన్సెలెన్ ఉపాహారం ఏమీ తీసుకోలేక పోయాడు. మళ్లీ ఆయన, వీలయినంత త్వరగా ముగించు కొని ఇంట్లోంచి బయటికి వెళ్లాడు. మరికొంచెం సేపటికి మతాచార్యుడు, ఆయనవెనక జెర్‌స్టీ బయటికివచ్చారు, బయటికి వెళ్లడానికి తయారుగా. "ఇక్కడ అన్నియిండ్లలో పెద్ద ఇల్లు ఎవరిది?" ఆచార్యుడడిగాడు.

"అదుగో, అదే ప్శ్రాంసా ఇల్లు. ఆయనని ఇప్పుడు పెర్ హోం అంటున్నాం. టార్కోల్ తల్లకేన్ కలపతో పెద్ద ఇల్లింకోటి కడుతున్నాడు. అయినా అదింకా తయారవ లేదు లెండి."

"బాగున్నది, నాయనా ఇప్పుడు నీవు కొంచెము చురుకుగా పని చేయవలెను. ఈ వేళమధ్యాహ్నము రెండు గంటలవేళ ఆ పెర్ హోం గృహమున నేను "దైవ ప్రార్థనలు జరుపగలనని మీ మిత్రులందరకు తెలిపిరమ్మా!" అన్నాడు ఆచార్యుడు. తర్వాత వెంటనే జెర్ స్టీ వేపు తిరిగి, "అమ్మా, దయచేసి నీవుపోయి ఆయిల్లాలికి కొంచెము సాయపడుము," అన్నాడు.

వాళ్లిద్దరు కొంతసేపు మౌనంగా ఆయనవంక చూశారు. చివరికి జెర్ స్టీ ఆయనతో బెరెట్ సంగతి చెప్పేసింది. సైవెర్ట్ ఆమెకి మధ్యమధ్య మాటలు అందించాడు. ప్శ్రాంసా పరిస్థితంతా బాగానే ఉంది, కాని వాళ్లు బెరెట్ ని గురించి చెపుతూన్నప్పుడు మతాచార్యుని ముఖం విషాద విచారమయమయింది. చివరికి ఆయన అన్నాడు: "సరి నేను ముందుగ అచటికిపోయి వారితో మాటాడుదును. రెండు మూడు గంటలతరువాత మీరు రావచ్చును. ఇక నీ విషయము బాబూ! నీ పని నీవు సక్రమముగ చేయవలె. మత నామకరణోత్సవమునకు బిడ్డలందరిని తీసుకుని, మీమీ ప్రార్థన గీతాగ్రంథములు కూడ తీసుకురండని అందరికి చెప్పుము."

టాన్సెటెన్ చకచకా వెళ్లి పోయాడు, తనపనిమీద. మతాచార్యుడు మెల్లగా ప్రెర్స్టాంసా ఇంటికి బయలుదేరాడు. మతగురువు మతప్రబోధంకోసం అందంగా అలంకరించిన కిటికీ ముందు నిలబడిఉన్నాడు. ఆయన దుస్తులు కొత్తవికావు, అంత శుభ్రంగానూ లేవు. కాని ఆసంగతి ఎవరూ గమనించడంలేదు. ఇన్నాళ్లకు వాళ్లకి మళ్లీ నార్వేదేశపు మతగురువు లభ్యమయాడు! పైగా, టాన్సెటెన్ అందరికీ చెప్పినట్లు, ఈయన సామాన్య వ్యక్తికాడు. తెల్లని గుడ్డ పరచినబల్ల ఆ కిటికీ దగ్గరగా వేసి ఉంది. దానిమీద వాళ్లు స్వయంగా తయారుచేసిన కొవ్వొత్తుల స్తంభం, కొవ్వొత్తులు ఉన్నాయి. వాటి ప్రక్కన ఒక బైబులు గ్రంథం, ప్రార్థనల గ్రంథంకూడా ఉన్నాయి.

ఆ యిల్లంతా జనంతో కిటకిటలాడు తూంది. ఆడవాళ్లందరూ మంచాలమీద దగ్గర దగ్గరగా ఒరుసుకుని కూచున్నారు. పిల్లలు వాళ్లవెనక నిలబడి చూస్తున్నారు. మగవాళ్లంతా పెద్దపెట్టె మీద కొందరు, ప్రెర్స్టాంసా, హాన్సెఓల్సాలు తయారుచేసిన ఆసనాల మీద కొందరు కూచున్నారు. మిగిలిన వాళ్లు ఎక్కువమంది నేలమీదే కూచున్నారు. లోపలస్థలం లేక మరికొంతమంది బయట నిలబడ్డారు. ఇంకా కొందరు గడ్డి మీద కూచున్నారు. అంతా వాళ్లకు ఉన్నంతలో మంచిదుస్తులు వేసుకువచ్చారు.

మతాచార్యుడు వాళ్లకు ఎదురుగా నిలబడి, ''సుజనులారా! మన మందరము ఒకింతకాలము నిశ్శబ్దముగ నుండె

దముగాక. మన ప్రార్థన మిప్పుడే మొదలు పెట్టుదము,"
అన్నాడు. దాంతో ఆజనసమూహంలో, చీమచిటుక్కు
మన్నా వినిపించేటంత నిశ్శబ్దత ఆవరించింది. మతాచార్యుడు
ప్రారంభ ప్రార్థన చదువుతున్నప్పుడు అంతా నిశ్శబ్దంగా
విన్నారు. తరువాత వాళ్లంతా కలిసి బృంద ప్రార్థనగీతం
పాడారు. ఆసమయంలో వాళ్లందరికీ నిజంగా చర్చిలో
ఉన్నట్టే ఉంది. నిజంగా అద్భుతం!

తరువాత మతాచార్యుడు కనాన్ సీమకి[1] ఇస్రేల్
వాసుల[2] ఆగమనాన్ని గురించి ప్రసంగించాడు. ఇస్రేల్
వాసులలోని పదివర్ణాల వారి కథను వారికి వివరంగా
చెప్పాడు. వాళ్లు ఎన్ని బాధలుపడిందీ, ఎలా భగవంతునిలో
విశ్వాసంలేని వారయిందీ, చివరకు ఎలానశించిందీ వివరిం
చాడు. మిగిలిన రెండు వర్ణాల వారు కష్టకాలంలో కూడా
భగవంతునిలో విశ్వాసాన్ని వదలకుండా ఉండటం, మానవు
లందరిని ఉద్ధరించడానికి వారిలో నించే ఏసుక్రీస్తు ఎలా
ఉద్భవించిందీ విశదంచేశాడు.

ఆ ఇస్రేల్‌వాసులకి, ఈ వలసలో ఉన్నవారికీ గల
సామ్యాన్ని కూడా చెప్పాడు. వాళ్లలాగే వీళ్లూ ఇళ్లూ
వాకిళ్లు విడిచిపెట్టి కాననిగంతలకు వలసవచ్చారు. చాలా
కష్టాలు అనుభవిస్తున్నారు. చాలా మంది విపరీతబాధా
కరమైన ఏకాంతవాసం, మిడతలదండుల పీడా అనుభవిస్తు

1 బైబుల్‌లో పేర్కొన్నదేశం. 2 బైబులు మొదటిభాగంలో
వీరికథ ఉంది.

న్నారు. తరువాత ఆయన వారి భవిష్యత్తును గురించి చెప్పాడు. భగవంతుడు వారికి ప్రసాదించబోయే అద్భుత భోగ భాగ్యాలను గురించి, సౌఖ్యాలను గురించి చెప్పాడు. ఆదయకు ప్రతిఫలంగా "మీరందరెన్నడైన నతశిరస్కులై ప్రభువునకు కృతజ్ఞతాభివందనము చేయుచుంటిరా?" అని ప్రశ్నించాడు. వారొక నూతన సామ్రాజ్యాన్ని నిర్మించ దలచుకుంటే ప్రభువు కరుణాకటాక్షచ్ఛాయలోనే అది సాధ్యం. లేదా, అంతా పతితులై పోతారు.

నిజానికి వారి పరిస్థితి ఇజ్రేల్ వాసుల పరిస్థితి కన్న మెరుగగా ఉంది. వారంతా ఇక్కడికి స్వతంత్రులుగా వచ్చారుగాని, బానిసలుగా రాలేదు. "ఈ యంశము మీరందరు గ్రహించితిరా? మీరెల్లరు ప్రభువై భవమునకై కృషి చేయుచు. ఇజ్రేల్ వాసులలో మిగిలియుండిన రెండు తెగలవారివలె ప్రవర్తించెదరో, ప్రభువుపట్ల భక్తి హీనులై నశించిపోయిన పది తెగలజనులవలె ప్రవర్తించెదరో, నిశ్చయించుకొనుడు," అని హెచ్చరించాడు.

మతాచార్యుడు ప్రసంగిస్తూన్నప్పుడు, నిశ్శబ్దంగా, నిశ్చలంగా తన యెదుటకూచుని ఉన్నవారి నందరినీ పరిశీలించి చూశాడు. బెరెట్ తనముందున్న వారినందరినీ చాటు చేసుకుని ఒకమూలగా పొయ్యిదగ్గిర కూచుంది. పసిబిడ్డ పీడర్ ఆమె ఒళ్లోఉన్నాడు. పెర్హాంసా ఆమె ప్రక్కన ఆమె చెయ్యి పట్టుకుని కూచున్నాడు. ఆప్రసంగం వింటున్నంతసేపు ఆమె పెదవులు కదులుతూనే ఉన్నాయి. ఆమె ముఖంలో పరి

హాసం కనిపిస్తూంది. ఈ మతబోధకుడు నిజంగా మతాచార్యుడు కాడనీ, ఇక్కడ ప్రభువైభవాన్ని గురించి చెపుతున్నప్పుడు ఆయన కేవలం కల్లబొల్లి మాటలు చెపుతున్నాడని ఆమె నిశ్చయం. అయినా, ఆమె ఏమీ అనలేదు.

ఉపన్యాసం పూర్తయింది. ప్రార్థనగీతం పాడారు. తరువాత, అసలు నామకరణమే జరుగని పిల్లలకి, ఇంటివద్ద నామకరణంచేసిన పిల్లలికి యథా విధిగా మతనామకరణం చేశాడు. మతాచార్యుడు, పిల్లలు (వాళ్ల తరఫున మతస్వీకార ప్రమాణాలుచేసే) మతపితరులు మతాచార్యుడి దగ్గిరికి వచ్చారు. ఆఉత్సవ ప్రక్రియయావత్తు అంతవరకు సవ్యంగా జరిగిపోయింది. చివరికి ''పీడర్ విజయు''ని తీసుకుని సారీనా వచ్చింది. పీడర్ పకపకా నవ్వుతూ పలకరించిన వాళ్లందరితో ఉత్సాహంగా మాట్లాడేస్తున్నాడు.

మతాచార్యుడు ఆపిల్లవాడి పేరడిగి, ఆపేరు తాను గట్టిగా ఉచ్చరించి నామకరణోత్సవం ప్రారంభం చేశాడు. ''పీడర్ విజయుడు'' అంతవరకే ఆయన చెప్పగలిగింది. ఇంతలో ఒక్కపరుగులో గదిమధ్యకు వచ్చేసింది బెరెట్, దారిలో వాళ్లందర్నీ ఒత్తిగించేసుకుంటూ. ఆమె కంఠం ఆగంభీర నిశ్శబ్దతను భంగపరుస్తూ గట్టిగా వినిపించింది. ''ఈపాపిష్టి తంతు జరగడానికి వీల్లేదు. శనిగాడు రాజ్యంచేసే ఇక్కడ ఎవడుగాని 'విజయుడు' ఎలా అయేది ? మీ కందరికీ పిచ్చెత్తింది !' ఆమె అరుపులు పిచ్చివాళ్ల కేకల్లాగ అంతకంతకి శ్రుతి హెచ్చిపోయినయి. అక్కడున్న ఆడవాళ్లలో

కొందరు ఏడవడం మొదలు పెట్టారు. చాలామంది పిల్లలు కూడా ఏడుపులు అందుకున్నారు.

చివరికి, ప్వ్రాంసా బెరెట్ దగ్గిరికివచ్చి, రెండు చేతులతో ఆమెను చుట్టేశాడు. మెల్లగా వాళ్ళిద్దరూ ఆజనం లోంచి తలుపుదగ్గిరికి చేరారు. అంతసేపూ, బెరెట్ అరుస్తూనే ఉంది. "ఇదీ శనిగాడిపనే! ఇంక ఎల్లాగూ నాపిల్లాణ్ణి ఆశనిగాడు ఎత్తుకుపోతాడు!" అని అరుస్తూంది. వాళ్లు బయటికివెళ్లి పోయేదాకా నిశ్శబ్దంగా ఊరుకున్నాడు మతాచార్యుడు. తరువాత, వెంటనే మళ్లీ నామకరణోత్సవం యథా విధిగా జరిపాడు. అది పూర్తిఅయిన తరువాత, తాను మళ్లీ రెండువారాలకి తిరిగి రాదలచుకున్నట్టు, ఆదివారంనాడు ఆత్మనివేదనోత్సవం జరపదలచుకున్నట్టు చెప్పాడు. "ఈలోగా మీరందరు స్వర్గంలోని మనపితకు మీ మీ పాపాలు నివేదించాలి," అని, ఆనాటి ప్రబోధం ముగించాడు.

ప్రబోధానంతరం జనం బయట దొడ్లోనిలబడి ఆవిషయమే మాట్లాడుకుంటున్నారు. ముఖ్యంగా చాలామంది ఆరోజున జరిగిన విషాదసంఘటనను గురించి చర్చించుకుంటున్నారు. ప్వ్రాంసా పాపి—అనే చాలామంది అనుకుంటున్నప్పటికి, ఆ కుటుంబం ఇంత దారుణస్థితిలో ఉన్నందుకు అంతా సంతాపం ప్రకటించారు.

ఆ యింట్లోజనం ఎవరూ కనిపించడంలేదు. మెల్ల మెల్లగా వచ్చినవాళ్లలో చాలామంది వెళ్లిపోయారు. కొందరు స్త్రీలుమాత్రం వాళ్లకి సాయపడడానికి ఉండిపోయారు.

ఆవిషయం అంతకుముందే వాళ్లు కూడబలుక్కున్నారు. మతాచార్యుడు వాళ్లనందరినీ ఇళ్లకు వెళ్లిపొమ్మన్నాడు. ఒక్కొక్కసారి ఎవరో ఒక్కరే రావాలన్నాడు. బెరెట్‌ని కుశల ప్రశ్నలేమీ వెయ్యవద్దన్నాడు. అంతా సవ్యంగా మామూలుగా ఉన్నట్టే ప్రవర్తించమన్నాడు. "వాస్తవముగ ఇక్కడ నిరాశాజనకమైన విషయమేమియు లేదు. అంతమున సర్వము చక్కబడగలదని నా విశ్వాసము," అన్నాడు.

ఆయన చిన్నపిల్లవాణ్ణి ఒళ్లోకూచో బెట్టుకుని వాడితో ఆడుకుంటూ అన్నాడు. "ఈ కుటుంబముతో బాగుగ పరిచయమున్న వారెవరో ఒక్కరే ఉండుడు. మిగిలినవారు వెళ్లి పొండు. మీరిండ్లకుపోయి, ఈదినము భగవంతుని ధ్యానించుకొనుచు సాధ్యమయినంత ప్రశాంతము గడపుడు!" మరి కొంతసేటికి, ఆ ఆవరణమంతా నిర్జన మయిపోయింది. సూర్యాస్తమానం అవుతూంది. నీడలు పారాడు తున్నాయి. మతాచార్యుడు ఇంకా ఆ ప్రాంగణంలోనే పచారులు చేస్తున్నాడు. పసివాడు పీడర్ ఆయన చెయ్యిపట్టుకుని గబగబా నడవడానికి ప్రయత్నిస్తూ పక పక నవ్వుతున్నాడు.

మతాచార్యుడు కొత్తగా కట్టిన మట్టియింటిదిశగా నడిచాడు. ఆ యింట్లోంచి ఏవో మాటలు వినిపిస్తున్నాయి. ఆయనకళ్లు చీకటికి అలవాటు పడినమీదట ఒకగడ్డిమోపు మీద బెరెట్ పక్కన కూచుని ఉన్న పెర్హాంసా కనిపించాడు. పెర్హాంసా చెయ్యి ఆమెను చుట్టిఉంది. చిన్నపిల్ల అన్నామేరీ తండ్రితొడమీద కూచుని ఉంది.

"మధురమైన దివ్యశాంతి మీకు కలుగుగాక!" అన్నాడు మతాచార్యుడు. అని వెంటనే మళ్ళీ, "అందరు వెళ్ళిపోయిరి. అమ్మా! నేనీరాత్రికి నీయింటనే భోజనము చేయగోరుచుంటిని. నాకొక కప్పు మంచి కాఫీ చేసిపెట్ట గలవా?" అన్నాడు.

ఆయన కంఠస్వరం వినిపించేసరికి, బెరెట్ ఉలిక్కిపడి లేచి నిలబడింది. తాను చేసిన పనికి ఆమె భయపడుతున్నట్టు కనిపిస్తూంది. తా నాస్థితిలో మతాచార్యుడి కంటబడినందుకు సిగ్గుపడుతూన్నట్టుకూడా ఉంది తర్వాత ఆమె పీడర్‌ని ఎత్తుకుని, గబగబా ముద్దులు పెట్టేసుకుంటూంది. ఆ ముద్దులకు అంతులేకుండా ఉంది. ఆ కుర్రవాణ్ణి ఇంకా ఇంకా గట్టిగా హృదయానికి అదుముకుంటూంది.

"భద్రం బెరెట్ భద్రం!" అన్నాడు పెద్దాంసా ప్రతిమాలుకుంటున్నట్టు.

"ఏం నాబిడ్డని నేను ముద్దుపెట్టుకోకూడదా?" ఆమె అంది.

"ముద్దాడుతల్లీ! నీయిష్టము వచ్చినంతసేపు ముద్దాడుము. కాని, అట్టి ముద్దులుమూటగట్టెడి బిడ్డను నీకు ప్రసాదించిన భగవంతునికి కృతజ్ఞతా నివేదనచేయుట మాత్రము మరచిపోకుము. నీబిడ్డ మహాపురుషుడు కాగలడు," అన్నాడు మతాచార్యుడు.

బెరెట్ మఠాచార్యుని మాటలు శాంతంగా విన్నది తర్వాత, తానేమీమాట్లాడకుండా కొడుకుని చెయ్యిపట్టు కుని నడిపించుకుంటూ వెళ్లిపోయింది. పెర్త్రాంసా ఆగడ్డిమీదే కూచునిఉన్నాడు. ఆయనజుట్టు, గడ్డం బాగా నెరసిపోయి నట్టు కనిపిస్తున్నయి. ముఖం ముడతలు దేరింది. ముసలివా డయిపోయినట్టు కనిపిస్తున్నాడు.

మఠాచార్యుడు వెళ్లి ఆయన ప్రక్కన కూచుని, మెల్లగా ప్రసంగం ప్రారంభించాడు. "కథ అంతయు నాకు చెప్పాడు. ఒకడు ఎత్తలేని బరువును ఇద్దరు ఎత్తవచ్చును గద!" ఆయన కంఠం మృదువుగా, చల్లగా వినిపిస్తూంది.

పెర్త్రాంసా చెప్పడం మొదలుపెట్టాడు. అడుగడుగునా కన్నీళ్లు తుడుచుకుంటానికి ఆగుతూ, మళ్లీ చెప్పుకుపో తున్నాడు. అలాగే, మొత్తంమీద బెరెట్ ఈస్థితికి దిగ జారడానికి కారణమైన కథంతా చెప్పాడు. "ఇలాగే ఇంక కొంతకాలం ఉంటే ఆమెని ఇక్కణ్ణించి పంపించెయ్యాలి పోస్తుందని నాబెంగ," అని నిట్టూర్చాడు.

"ఆమెకు పూర్తిగ మతిభ్రమణమే కలిగెనందురా?" మఠాచార్యుడు అడిగాడు.

"ఎంత అయితే ఏమిటి లెండి! చిన్నపగులైనా, పెద్దపగులైనా, ఇక ఆగ్లాసు పనికివచ్చేది లేదుగద!"

పెర్త్రాంసా ఇంకా చెపుతున్నాడు: "ఇందులో నా తప్పూ ఉంది లెండి! నేనామె నిక్కడికి తీసుకొచ్చాను.

ఆమె కిది సరిపళ్లేదు. నేను పాపమే చేశానంటారా? ఒక మనిషి తనకు మంచి బ్రతుకు తెరువు కనిపించే చోటుకు వెళితే—ఆపని అతనిభార్య కిష్టంలేకపోతే, అతడు మానెయ్య వలసిందే నంటారా?''

''మానివేయకూడదు. కాని, ఉభయులకు ఐకమత్య ముండిన మంచిది.''

''ఔన్లెండి. చెప్పటం తేలికే! మాకు ఐకమత్యత లేక పోలేదు. ఆమె నామాటని కాదని ఎప్పుడూ అనలేదు; మేం ఇక్కడికి వచ్చింతర్వాత చాలారోజులవరకుకూడా. క్రమంగా చిత్రంగా మారిపోయింది. అంతవరకు మాకు ఏమీ పొర పొచ్చాల్లేవు. నిజానికి, మేమిద్దరం ఒకరికోసం ఒకళ్లం. చాలాబాధ పడుతూఉండేవాళ్లం. బహుశా అంతకన్న అన్యోన్యం ఇంకెక్కడా ఉండదనే నేననుకునేవాణ్ణి. అలాంటి సందర్భంలో చెప్పండి! మీరు బైబుల్ బాగా చదివిన మతగురువులు,—మీరే చెప్పండి-ఆస్థితిలో ఎవడుగాని ఏం చెయ్యాలి?''

''ఔను. మీరు చేసిన దానిలో తప్పులేదు. మానవుడు తన మనస్సు, హృదయము ఆదేశించిన చోటికి వెళ్ల వలసినదే; భగవంతుడు దానికి అభ్యంతర పెట్టినతప్పు. కాని, మీరు చాల పాపములు చేసినట్లు నేను వింటిని! భగవంతుడు చూపిన మార్గమందే పోవుచున్నను, ఈ చిక్కులు కలిగినట్లు ఇప్పుడు మీరు చెప్పుచున్నారు! ఈ కష్టములను మీరు

ఓర్పుతో, ప్రేమతో సహింపుడు! ఇదే మీరు ఇప్పుడు చేయవలసినపని,'' అన్నాడు మతాచార్యుడు.

''ఔనండి! అది చెప్పడం సులువే! మేం ఇక్కడ చెయ్యవలసినపనులు ఇంకా చాలా ఉన్నాయి. మనకు తెలియని విషయాలనుగురించి సలహా చెప్పడం చాలా తేలిక. ఏక్షణాన తల్లి తన బిడ్డలందరినీ చంపేస్తుందో అని ఆందోళనపడుతూ దినదినం గడిపే దుస్థితి మీరు ఎప్పుడైనా అనుభవించారా? పైగా ఆమె అలా తయారవడానికి తనే బాధ్యుడ నని తెలిసి...''

''భగవానుడా! అట్టి దారుణ పరిస్థితి ఇంతవరకు నేను విననైనలేదు. ఈ స్థితికి ఎట్లు వచ్చినది నాకు వివరముగ తెల్పుడు, దయచేసి,'' అన్నాడు మతాచార్యుడు మృదువుగా.

కొంతసేపటివరకు పెర్ల్మాంసా మౌనంగా కూచున్నాడు. తర్వాత ఆయన తలుపుదగ్గిరికి వెళ్లి చీకటిలోకి చూసి వచ్చి, చెప్పడం మొదలుపెట్టాడు. ఎందుచేతో అమెరికా ఆమెకు సరిపడలేదు. కొంతమంది చూడండి స్వగ్రామం, గృహం విడిచిపెట్టి ఉండలేరు. అయినా, ఆ కడసారి కానుపు, మా చిన్నకుర్రాడు పుట్టేవరకు అంతా బాగానే ఉంది. ఏమిటో, వాడు బ్రతకడని ఆమెకో పిచ్చి నమ్మకం ఏర్పడింది. వాడి కానుపుకి ఆమె చాలా కష్టపడింది. బిడ్డదక్కడనే అనుకున్నాం. వాడు పుట్టి బాగుండేసరికి నేనెంతో సంతోషపడ్డాను. ఆపైన అంతా చక్కబడిపోతుందనుకుని ఆశ

పడ్డాను. ఆ ఆనందంకొద్దీ వాడికి, "విజయుడు" అని రెండో పేరు పెట్టాం. ఎంచేతో, ఈ పేరుకూడా ఆమెకి నచ్చలేదు."

"నచ్చలేదా? అద్భుతమైన పేరుగద!" అన్నాడు మతాచార్యుడు.

"ఆ మాట మీరు నిజంగానే అంటున్నారా?"

"ఔను. నేను నామకరణము జరిపిన పిల్లలలో ఇంత మంచిపేరు మరొకటిలేదు."

పెర్హాంసాకి ఆనందంతో నోటమాటరాలేదు. ఒక నిమిషం అలాగే ఉండిపోయాడు. "అయితే, అది మంచి పేరే నంటారు?... అందులో భగవంతుడికి అపరాధం ఏమీ లేదన్నమాటేగా?" ఆదుర్దాగా అడిగాడు.

"ఏమీలేదు. ఇదికూడ మిమ్ము చాల ఆందోళన పెట్టుచున్నదన్నమాట!"

"అయితే బెరెట్ తోకూడ మీరు నాకు చెప్పినట్టే ఈ మాట చెపుతారా? ఔను ఆ పేరు పెట్టిననాటినించీ, ఇదొక బెంగనాకు."

"తప్పకుండ చెప్పెదను. ఆమె కాపేరు పెట్టుట ఎంత మాత్రము ఇష్టములేదన్నమాట!"

"అంతేకాదు! ఆపేరుపెట్టమని ఏపిశాచమో ప్రేరేపించిందనీ, ఆపిశాచం మమ్మల్ని ఆవహించి పీడించడానికే ఇలా చేస్తోందని ఆమె నమ్మకం. ఆపేరు చెవిని పడితే.

ఆమెకి పిచ్చెత్తి పోతుంది. అందుకే ఈవేళ మీరు వాడికి నామకరణం చేసేటప్పుడు అంత గొడవచేసింది.''

''ఇలాంటి ఆవేశం ఆమెకు ఎప్పటినుండి వచ్చుచుండెనో చెప్ప గలరా ?''

''ఆ. ఆమిడతలదండ్లు మొదటిసారి వచ్చినప్పటినించీ!'' ఆరోజున తాను ఇంటికి వచ్చేసరికి, బెరెట్ వాళ్ల పెట్టెలో పడుకుని ఉండటం,—ఆ కథంతా పొర్వాంసా వివరంగా చెప్పాడు. తర్వాత బెరెట్‌కి కలలో ఆమెతల్లి కనిపిస్తూండే దనికూడా చెప్పాడు. నిజానికి, అప్పటికే ఆమెతల్లి మరణించింది. కాని, ఆవార్త ఇక్కడికి కొన్నినెలల తర్వాతగాని చేరలేదు.

''మరణించిన వ్యక్తిని ఆమె చూచినట్లు చెప్పుచుండె నందురా ?'' మతాచార్యుడు ప్రశ్నించాడు.

''ఔను. ఆమెని చూడటమేకాదు, ఆమెతో మాట్లాడేది కూడాను! అప్పటికి ఆమె చనిపోయినమాటకూడా నిజమే. ఆమె తనప్రక్కనవచ్చి కూచుని ఉన్నట్టే ఆమెతో మాట్లాడేది.''

''ఆమె పసిపిల్లవాడికి హాని కలిగించుటకు ఎన్నడైన ప్రయత్నించెనా ?''

''అదికొంచెం తర్వాత ప్రారంభమయింది. ఆమె తల్లి ఆ'మనుమణ్ణి తనతో తీసుకు పోతానంటూంది' అనేది ఒకరోజున...ఏం చెప్పను ? నేనావిషయం నానోటితో చెప్ప

లేను. సమయానికి సారీనా రాకపోతే, ఎంతఘోరంకలిగేదో! అంచేత, పసిబిడ్డని ఆ వేసవికాలంఅంతా తనతగ్గర ఉంచుకొని పెంచమని నేను సారీనాని బ్రతిమాలాను. మొదట ఆమె సందేహించింది; కాని చివరికి ఒప్పుకుంది. దీనిలో కూడా,—నేను తప్పే చేశానో, ఒప్పేచేశానో! నాకు తెలియదు. బిడ్డదగ్గిర లేకపోయేసరికి, తనకు ఏమీా తోచనట్టు కనిపించేది బెరెట్. ఒకనాడు రాత్రికి రాత్రిలేచి, సరాసరి వాళ్లింటికి వెళ్లి బిడ్డని మళ్లీ తీసుకొచ్చేసింది. నేను ఏం చెయ్యాలి? చెప్పండి!''

''భగవంతుడు మీా బ్రతుకుపై పెద్ద బండరాతి నెత్తెను. ఆయనయే మరల దానిని దించివేయును...ఈవిషయముమాత్రము మరువవద్దు. ఆమెకిట్టి ఆవేశములు వచ్చుటకు మధ్యకాలములో ఆమె ఎట్లుండెడిది?''

''బాగానే ఉండేది. ఇంటి పన్లన్నీ మామూాలుగా చేసుకునేది. ఆమె సంగతంతా తెలియని వాళ్లకి మంచి మనిషిలాగే కనిపించేది. అయితే, చలికాలంమాత్రం ఆమె స్థితి అంతబాగుండేది కాదు. అస్తమానం మంచు కురుస్తూంటంవల్ల, ఇక్కడి ఒంటరితనంవల్ల మాకందరికీకూడా అలాగే ఉంటుందనుకోండి.''

''సరి! బిడ్డ నామెకు ఎడముచేయవద్దు. మీారు మాత్రము శ్రద్ధగ కనిపెట్టి చూచుచుండుడు. మొదట మీారామెను ప్రేమించినట్లు, అంత ప్రేమతోడను వ్యవహరింపవలెను. ఎన్నడు ఆమెను వదలివెళ్లవలదు. నేనీ రాత్రికి

ఇచట నేడుండి చూచెదను. రేషామెతో మాట్లాడుటకు ప్రయత్నించెదను. ఆమెను ప్రసన్నముగ జేయుటకు ప్రభువు మనకు తోడ్పడగలడు,'' అన్నాడు మతాచార్యుడు.

పెర్నాంసా ఏడుస్తున్నాడు. మనస్సు తేలికపడిన ఆనందంతో ఆయన ఏమీ మాట్లాడలేక పోయాడు.

''రండు పోవుదము!'' అన్నాడు మతాచార్యుడు. ''ఈ అంధకారమునుండి ఇంటగల వెలుగులోనికిపోయి, భోజనము ముగింతము. ఆత్మలకు వలెనే ఈ శరీరములకు కూడ ఆహారమవసరము గద!''

ఆ ముందు దొడ్డిలోంచి వాళ్లు నడిచివెళుతూండగా, ఓల్ పరుగెత్తుకుంటూ ఎదురొచ్చాడు. వాడి తమ్ముడు హాన్స్ దగ్గర్లోఉన్న ఒక చిన్నగుట్ట మీదికిపోయి, తిరిగి రాలేదని తండ్రితో చెప్పడానికి వచ్చాడు ఓల్. వాడు అక్కడకూచుని ఏడుస్తున్నాడని, తల్లికి భయపడి ఇంటికి రావటంలేదనీ కూడా చెప్పాడు.

''చూశారా! ఇదీ మా పరిస్థితి?'' అన్నాడు పెర్నాంసా మతాచార్యుడితో. అని, ''మీరు ఇంటికివెళ్లండి. నేనువెళ్లి ఇప్పుడే వాణ్ణి తీసుకుస్తా,'' అంటూ ఆగుట్టవేపు వెళ్లి పోయాడు.

ఆచీకటిలోపడి ఆయన ఆ చిన్నగుట్ట మీదికి వెళ్లాడు. కుర్రవాడి ఏడుపువిని వాడు ఉన్నచోటు కనుక్కున్నాడు. తండ్రి కనిపించగానే ''అమ్మ...అమ్మ...పెర్నాండ్ ని చంపే

సిందా...?'' హాన్స్ అడిగాడు. ''అమ్మకి మళ్లీ పిచ్చెక్కిందా నాన్నా ?'' అని మళ్లీ వెంటనే అడిగాడు.

''లేదు. ఏమీలేదు. అమ్మ బాగానే ఉంది. మంచి మంచి కూరలుచేసి, నువ్వింకా అన్నానికి రాలేదని ఎదురు చూస్తూంది. ఇక ఏడుపుకట్టిపెట్టి, రా పోదాం,'' అన్నాడు ప్రైవాంసా.

రాత్రి భోజనానికి బల్లచక్కగా అమర్చిఉంది. గదిలో అంతా ఆహ్లాదకరంగా కనిపిస్తూంది. బెరెట్ కి సాయంగా సొరీనా కూడా అక్కడే ఉంది, నవ్వుతూ పిల్లలతో ఆడుతూ. పసివాడు పెర్మాండ్ కి నిద్రవేళయింది. బెరెట్ పొయ్యిదగ్గిర, ఏవో పళ్లాలు కడుగుతూంది. ఆమె వెనక్కి తిరిగి ఒకసారి మతాచార్యుడివేపు చూసింది. అప్పటినించి అడపాదడపా వెనక్కితిరిగి ఆయనవేపు చూస్తూనే ఉంది. ఆయనముఖంలో ఏదో అసాధారణత ఉంది. చివరికి, భోజనం తయారయేలోగా మతాచార్యుడికి చిక్కని వేడి పాలు ఒకగ్లాసు నిండా తెచ్చి ఇచ్చింది.

మరికొంచెంసేపటికి ప్రైవాంసా కుర్రవాళ్లని తీసుకు వచ్చాడు. అంతా భోజనానికి కూచున్నారు. ఆడవాళ్లిద్దరు వొడ్డిస్తున్నారు. హాన్స్ముఖం కన్నీటి చారలతో, ఎర్రగా కందకడ్డలా ఉండటం మతాచార్యుడు చూశాడు. ఆపైన ఆయనభోజనం చెయ్యలేదు. ఇంకొకగ్లాసెడు పాలుమాత్రం అడిగిపుచ్చుకుని, మిగిలినవాళ్లంతా భోజనంముగించేవరకు

నిరీక్షించి, ఆపైన చేతులు మొగిడ్చి, నిరంతరం తనకు సన్నిహితుడై ఉంటున్న భగవంతుణ్ణి ప్రార్థనచేశాడు.

ఆయన ప్రార్థన చేస్తూన్నంతసేపూ మిగిలిన వాళ్లందరు వాళ్లు చేసేపన్లన్నీ మానేసి, చేతులు జోడించుకుని, ఆయన చెపుతున్నమాట మాటా శ్రద్ధగా వింటున్నారు. గదినిండా బంగారు వెలుగు వెల్లువలాగ ఉంది. పక్కమీద ఆడుతూన్న పిల్లలుకూడా క్రమంగా అల్లరి మానేసి బుద్ధిమంతుల్లా కూచున్నారు. పసివాడు పెర్మాండ్, మతాచార్యుని సౌహార్ద పూరితమైన కంఠస్వరం వినగానే పక్కమీంచి బయలుదేరి సరాసరి ఆయన దగ్గిరికి వచ్చి, ఎత్తుకోమన్నాడు. వాడు నిద్రదుస్తులు వేసుకుని ఉన్నాడు. బెరెట్ వాణ్ణి ఆపుచేద్దామనుకుంది. కాని, ఎందుచేతనో ఆమె కదలలేక పోయింది. మతాచార్యుడు ఏమీ చలించకుండా, ఆ కుర్రవాణ్ణి తీసుకుని తొడమీద కూచోబెట్టుకుని, తన ప్రార్థన కొనసాగిస్తున్నాడు. ఆయన ఎక్కడా ఆగకుండా మధురంగా, మృదువుగా మాట్లాడుతున్నాడు. తమ నందరిని జ్ఞాపకం ఉంచుకోని ప్రత్యేకదృష్టితో చూడవలసినదిగా భగవంతుణ్ణి ప్రార్థించాడు. తర్వాత, తన తొడమీద కూచునిఉన్న పసిపిల్లవాణ్ణి గురించి ఇలా అన్నాడు:—

“ముఖ్యముగ ఈబిడ్డను ప్రత్యేకదృష్టితో చూడుము భగవాన్! నీయభిమాన పుత్రులైన మహనీయులను చూచిన దయాదృష్టుల నీబిడ్డపై బరపుము. అతనిని వాస్తవముగ ప జయుని” జేయుము. అతడు తనపైనను, ఇతర ప్రపంచము

పైనను విజయము సాధించునట్లు చేయుము. ఇక నీశాంతి ఈగృహాంగణమున తాండవించుగాక! ఇక నీ ఆనందమయ శాంతిని ఈగృహమున సుస్థిరముగ నిలిపియుంచుము... శుభమస్తు!''

ప్రార్థన ముగిసిన తరువాతకూడా చాలాసేపు వాళ్లంతా నిశ్శబ్దంగా అలాగేకూచుని ఉండిపోయారు. మగ వాళ్లంతా కళ్లు మూసుకుని కూచున్నారు. స్త్రీలు కన్నీళ్లు పెట్టుకుంటున్నారు. మతాచార్యుడు సహజధోరణిలో పసి వాడు పీడర్‌తో ఆడుకుంటున్నాడు. వాళ్లిద్దరికి ఆ ఆట ఆనం దంగాఉంది. నిద్రకు వేళయేవరకు అలాగే ఆడుకుంటూ కూచున్నాడు. ఇంకెవరితో ఏమీ మాట్లాడలేదు.

ఆ మర్నాడు మతాచార్యుడు ఉత్సాహంగా ఉన్నాడు. ఆయన మాట్లాడుతున్నా, భోజనం చేస్తున్నా చూడముచ్చటగా ఉంది. ఆయన బెరెట్‌తో మాట్లాడ తానన్న సంగతి గుర్తుకువచ్చి, పెర్హ్సాంసా కుర్రవాళ్లను వెంటబెట్టుకుని పొలానికి వెళ్లాడు. మతాచార్యుడు మెల్లగా బెరెట్ దగ్గిరికి వెళ్లాడు. ఆమె తలవంచుకుని నేలవంక చూస్తూ కూచుని ఉంది. అలాంటి మనిషితో మాట్లాడటం కష్టమే! అయినా, ఆయన ప్రారంభించాడు.

''అమ్మా! యిటుచూడుము. నువ్వు నాకు కొంచెము సహాయము చేయగలవా? వచ్చెడి ఆదివారము తర్వాత, రెండు వారములకు నేను తిరిగి ఇచ్చటికి వచ్చెదను. అప్పుడు

నీయింటనే "భగవన్నివేద నోత్సవము" (Communion Service) జరుపవలెననియున్నది."

"ఇక్కడా? ఈ యింట్లోనా?"

"ఔను. నీవు నిత్యము వసించుచున్న ఈ గృహా మున! నీవు నీపాపములన్నిటిని భగవంతునికి నివేదించి, ఆయన కృపకు పాత్రురాలవు కాగోరుటలేదా?"

"అయినా, ఇక్కడేమిటి? వద్దు వద్దు, ఇక్కడవద్దు. ఈపాపిష్ఠి యింట్లో జరపకూడదు!" అంటూనే బెరెట్ ముఖం కందగడ్డ అయిపోయింది. ఆమె మాట్లాడడంమాని, మళ్లీ నేలవైపు చూస్తూ ఉండిపోయింది.

"ఈయింట పాపము లుండవచ్చును. భగవంతుడే ఈగృహమును తనకు అనుకూలమైన స్థలముగ జేసికొన గలడు. దానినిగురించి నీవు చింతించవలదు. ఈస్థలము భగవంతుని నెలవుగా చేయుటకే మనము ప్రయత్నము చేయ వలయును." అని అంతా నిశ్చయమైపోయినట్టే మతా చార్యుడు మాట్లాడేస్తున్నాడు. ఆమె మౌనాన్ని తాను గమ నించకుండా ఆపెద్దపెట్టె తమకు బాగా ఉపయోగపడగలదని ఆయన అనేసరికి, ఆమె ఊహాలు పరువులెత్తుతున్నట్టు ఆయన గ్రహించాడు.

"అది మానాన్నగారి పెట్టె...చాలా అందమైన పెట్టె...కాదండీ?" ఆమెముఖం పసిపిల్ల ముఖంలా అయి పోయింది, మళ్లీ,

మఠాచార్యుడు చెప్పదలచుకున్నది చెప్పేశాడు. ఆతర్వాత ఆయన ఆయింటిసించి దూరంగా వెళ్లిపోయాడు. ఆయన ఇంక ఎవరినీ కలుసుకో దలచుకోలేదు. పెర్హాంసాని అసలే కల్సుకో దల్చుకోలేదు. ఒక్కసారిగా బెరెట్‌లో ఏదో ఉత్సాహం పొంగివచ్చింది. క్రిందటిరోజున వాళ్లంతా కలిసి పాడిన ప్రార్థనగీతం పాడటం మొదలుపెట్టింది.

ఆ వేసవిలో అమెరికాకు వలసవచ్చే వాళ్లు చాలా మంది ఈ యిళ్లమీదుగా ఇంకా పశ్చిమానికి వెళ్ళారు. పెద్దపెద్ద పెట్టె బళ్లెన్నో అలా వెళ్లిపోయినయి. కొంతమంది ఈ వలసలోనే ఆగిపోయి, చిన్నచిన్న మట్టియిళ్లు కట్టుకున్నారు. ముఖ్యంగా సోనింగ్ కుటుంబం ప్రోత్సాహంవల్ల ఆలాంటి వాళ్లెందరో ఈ వలసలోనే స్థిరపడిపోయారు. ఈవిధంగా వలస అతివేగంగా పెరిగిపోయింది. మిడతల దండ్లు ఇంకా వస్తూనేఉన్నా, అవి అట్టేకాలం ఉండటంలేదు. ఈ సంవత్సరం గోదుమపంట, మిగతాపంటలు కూడా కొంత కొంత మిగిల్చి పోయాయి.

రైతులందరు ఏటేట కొంత వెనకేసు కుంటున్నారు. చాలామంది దగ్గిర వాళ్లకు కావలసినవన్నీ కొనుక్కున్నా, ఇంకా కొంత డబ్బు నిలవఉంది. కోళ్ల పెంపకంవల్ల కూడా బాగా కలిసి వస్తూంది. పశువుల మందలు పెరుగుతున్నయి. వాటివల్ల ఆదాయం మరికొంత పెరిగింది. పైగా, ఆ దగ్గిర్లోకి రైలుపడింది. ఇప్పుడు సూక్స్‌ఫాల్స్‌దాకా రైళ్లు వస్తున్నయి. ఇంక కావలసిం దేమిటి? అంచేత, ఏటేట ఎక్కువ

మంది కొత్త వాళ్లువచ్చి ఈ వలసలోనే స్థిరపడి పోతున్నారు. మొదట్లో వచ్చి నిలదొక్కుకున్న రైతులు పెద్దపెద్ద పెంకు టిళ్లు వేసుకున్నారు. హాన్సిఓల్సా పెద్దయిల్లు కట్టాడు. మొదటి యేడాది గడిచినతర్వాత ఆయన పశువుల పెంపకం ప్రారంభించాడు. దానివల్ల ఆయనకి బాగా కలిసివచ్చింది.

టాన్సెటెన్ కూడా పెద్ద పెంకుటిల్లు వెయ్యాలంటు న్నాడు. పనిమాత్రం మొదలుపెట్టడు. హెన్రీసోలం పెద్ద పశువులకొట్టు వేశాడు, తనుకూడా పశువులమంద పెంచా లని. వచ్చేయేడు, తనకి పెళ్లయింతర్వాత పెద్ద యిల్లు కడతా నంటున్నాడు. ఈ విధంగా ఆనిర్జన మైదానం అతివేగంగా మారిపోతూంది. అదంతా ఇప్పుడు వాసయోగ్యమైన ప్రదేశంగా మారిపోయింది. వాళ్లు నాటిన చెట్లు వేగంగా ఏపుగా పెరుగుతున్నాయి. ఆ చెట్లమధ్య వున్న ఇళ్లు బయటి మైదానంలోకి కనిపించడంలేదు.

ఆదివారంనాడు "భగవన్నివేదన కార్యక్రమం" యథావిధిగా, చక్కగా సాగింది. మిడతల దండ్లు పొలాల్లో పెట్టిన గుడ్లు పగులుతున్నట్టు కనిపిస్తూంది. మిడతలదండ్లు మాత్రం ఈ యేడాది ఇంకారాలేదు. మందపవనం వీస్తోంది. కొన్నిపక్షులు ఉత్సాహంగా పాడుతున్నాయి. చాలామంది ముందుగానే వచ్చి, పెర్హంసా ఆవరణలో కూచుని కులా సాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

మతాచార్యుడు గతరాత్రి పెర్హంసా ఇంట్లోనే పడు కున్నాడు. "భగవన్నివేదన" కార్యక్రమానికి సన్నాహాలు

చెయ్యడంకోసం ఆయన తెల్లవారక ముందే లేచాడు. అంతా, అంతకుపూర్వం ఎన్నడూ లేనంత పరిశుభ్రంగా ఉంది. బెరెట్ మైదానంలో దొరికిన పువ్వులన్నీ కోసుకొచ్చి ఇల్లాంతా అలంకరించింది. ఇంట్లో ఉన్నగ్లాసు లన్నిటిలో, లోటాలన్నిటిలో పూలగుత్తులు పెట్టి, అడుగడుగునా అమర్చింది. నిజానికి, అన్నిపూలు అంతటా కనిపించడం వెగటుగా ఉంది. చిన్నపిల్లలు చేసిన సింగారం లాగుంది. మతాచార్యుడు చుట్టూ ఆ పువ్వులకేసి చూడలేకపోయాడు.

బల్లమీద తెల్లనిగుడ్డ పరిచారు. పెర్హాంసా తయారు చేసిన ఆసనాలమీద కూడా అలాగే గుడ్డలు పరిచారు. మతాచార్యుడికి అవసరమైన కొవ్వొత్తుల సెమ్మా మొదలైన వస్తువులన్నీ బల్లమీద చక్కగా అమర్చడంతో, దానికి దేవపీఠం కళవచ్చేసింది. మతాచార్యుడు పనిచేస్తూన్నంత సేపూ పూర్తిగా మౌనం వహించాడు. ఇప్పుడాయన ఒకసారి చుట్టూ చూసి, అన్నాడు "నేనింక ఆకుటీరంలోకి వెళ్ళి దుస్తులు వేసుకుని వస్తాను. నేను తిరిగివచ్చిన తరువాత, దయచేసి నాతో ఎవ్వరూ మాట్లాడ వద్దు."

తరువాత, ఆయన దుస్తులు వేసుకోటానికి ఆచిన్న గుడిసెలోకి వెళ్ళాడు. అంతసేపూ ఆయన భగవత్ప్రార్థన చేస్తూనే ఉన్నాడు. సంపూర్ణ శక్తి విశ్వాసాలు అవసరమైన ఈ సమయంలో ఆయన ఎందుచేతనో నీరసంగా, ఓపికలేని వాడిలాగ కనిపిస్తున్నాడు. ఇక భగవంతుడే తనకు శక్తి ప్రసాదించాలి; స్వప్రయత్నంతో నిర్వహించగలననే ధీమా

ఆయనకు లేదు. చివరకు, కష్టంమీద లేచి నిలబడి బయలు దేరాడు. అప్పటికే ప్ెర్ల్హాంసా ఇల్లంతా నిండి పోయింది. అంతా నిశ్శబ్దంగా కూచునిఉన్నారు. ప్ెర్ల్హాంసా, బెరట్టూ బల్లదగ్గరగా ముందువరసలో కూచున్నారు. ముందుగా వారిద్దరికే భగవన్నివేదన జరపాలని, తరువాత బెరెట్‌ని ప్ెర్ల్హాంసా బయటికి తీసుకు వెళ్లాలని మతాచార్యుని ఆదేశం.

మతాచార్యుడు వెంటనే ప్రారంభించాడు ప్రబోధ వచనంతో. భగవంతుని దివ్యవైభవమునుగురించి చెప్పాడు. చెపుతున్నంతసేపూ ఆయన బెరెట్‌ని గురించే ఆలోచిస్తు న్నాడు. ఆమెకు, ఇంకా చాలామందికీ కావలసినవి భక్తి విశ్వాసాలు. అవే ఆమెకు ఈ ప్రవాసజీవితంలో ఆశ్వా సాన్ని, ఆనందాన్ని ప్రసాదించగలవు.

ఆయన మాట్లాడటం ప్రారంభించాడు. కాని, ఆయన అనుకున్నమాటలు స్ఫురించడంలేదు. వాటికి బదులు ఇంకేవోమాటలు, ఆయన చెప్పాలని అనుకోనివన్నీ వస్తు న్నాయి. తనభావాలను కూడదీసుకొనడంకోసం ఇంకా మెల్లగా మాట్లాడట మారంభించాడు. ఆయన ముఖమంతా కందిపోయింది. తల వేడెక్కింది. అయినా లాభం కనిపించ లేదు. ఎవరో తమ మాటలు ఆయన నోట పలికిస్తున్నట్టుంది. తను చెపుతున్న దేమిటో ఆయనకే తెలియడంలేదు. బైబులులోని ప్రజలను గురించి చెప్పాడు. వారు భగవ ద్వైభవమును ఎలా గ్రహించినది వివరించాడు. ఆ విషయం

అక్కడితో ఆపుచేయాలని ఆయన సంకల్పం నార్వేనించి వచ్చిన గ్రామీణులకి బైబుల్లోని విషయాలేమి తెలుసు?

ఒక్కసారిగా ఆయన విషయం మార్చి, నార్వేలోని ఒకనగరంలో తా నెరిగిన ఒక స్త్రీ వ్యక్తిని గురించి చెప్పడ మారంభించాడు. తన యెదుట కూచుని ఉన్న కష్టజీవులైన ఆ స్త్రీలను, పిల్లలను అందరినీ ఒక్కసారి చుట్టూకలయ జూచి, ఆ పైన మాతృప్రేమను గురించి ప్రసంగించాడు. తరువాత తన బిడ్డలైన ప్రజలపై భగవంతుని అపారప్రేమను ఆ మాతృప్రేమతో పోల్చాడు. ఎంత అద్భుతమైనది ఆప్రేమ! ఆ దివ్యప్రేమను, ప్రభువిభూతిని చవిచూడ గోరే వారందరు బల్లదగ్గిరికివచ్చి "భగవన్నివేదన" చేసుకోవచ్చునని ఆహ్వానించాడు.

జనం వరసగా వచ్చి, ఆయన ముందు మోకరిల్లి కూచున్నారు. చాలామందికి కనులనుండి అశ్రువులు రాలుతున్నయి. మతాచార్యుడు చాలాసేపు మాట్లాడటంవల్ల, సామాన్యప్రబోధానికి వ్యవధిలేకపోయింది. అందుచేత, మతాచార్యుడు భగవన్నివేదన కార్యక్రమం పూర్తికాగానే, "ఇక అందరు ఇండ్లకు వెళ్లి, ఈ దినమంతయు భగవచ్చింతనతో మౌనముగ గడపవలె"నని ఆదేశించాడు.

హాన్సెబిల్లా ఇప్పుడు మేడ కడుతున్నాడు. పగలు పనిచేస్తూన్నంతసేపు ఆయన కులాసాగా కూనురాగాలు తీస్తున్నాడు. ఇది బాగా పెద్ద భవంతి. ఒకవంటిల్లు, భోజనశాల, ఒక వసతిగదీ క్రింది అంతస్తులో ఉంటయి. ఇవిగాక

రెండు పడకగదులు క్రిందిభాగంలోను, మూడు పడకగదులు మేడమీాద ఉంటయి. మొదట అసలు క్రింద ఒక పడకగది కూడా కట్టదలచుకోలేదాయన. కాని, ఎన్నడూ దేనికీ పట్టుపట్టని సారీనా కిందకూడా గది ఉండాలని పట్టుపట్టింది. చివరికి, హాన్సఓల్సా ఒప్పుకున్నాడు. దానివల్ల, అదనపు ఖర్చు తగిలింది.

తర్వాత మెల్లగా వెల్లడించింది సారీనా ఆయనకి,— శుభవార్త. ఇన్నాళ్లకి వాళ్లకి మళ్లీ సంతానం కలగబోతూంది! ఆమె క్రిందపడకగది కావాలన్నది అందుకే. ఇక ఇప్పుడామె ఏవరం కోరినా ఇచ్చేస్తాడు ఓల్సా. ఆయనకి అన్నీ కలిసివస్తున్నయి. ఏటేట ఇంకా ఎక్కువభూమి పండిస్తున్నాడు. పశువులదొడ్లో మంద పెరిగిపోతూంది. ఇప్పుడు పుట్టబోయేపాప బహుశః మగబిడ్డే కావచ్చు.

ఇప్పుడాయనకి విచారం కలిగించే విషయమల్లా ఒక్కటే.—తన మిత్రుడు పెర్హాంసా బాధపడుతున్నాడు; పాపం, ముసలివాడై పోయినట్టు కనిపిస్తున్నాడు; ఆ బెరెట్‌తో ఆతనికి అగచాట్ల బ్రతుకయింది. పోనీ పెర్హాంసా కొడుకుని తను తెచ్చి పెంచుకుంటే! అది మంచి పనో కాదో ఓల్సాకి తెలియదు. తనకీ, తన భార్యకీ అభ్యంతరంలేదు. కాని పెర్హాంసా ఒప్పుకోటంలేదు. బెరెట్ నిజంగా ఎంత దారుణమైన స్థితిలో ఉన్నదీ తన మిత్రుడికి తెలియదేమో, అని ఓల్సా భయం. వేసవిలో మళ్లీ మిడతలదండువస్తే, ఆమె ఏం అఘాయిత్యంచేస్తుందో! అయినా, పసిబిడ్డని, తల్లి

దండ్రులకి ఎడంచెయ్యవచ్చా? ఏమో! ఆ విషయంలో హాన్సబేల్సాకి స్పష్టంగా ఏమీ తేలలేదు. ఏమిటో, స్నేహితుని దుర్భర దురదృష్టాన్ని తలచుకున్నా, తన అదృష్టాన్ని తలచుకున్నా ఆయన హృదయం బరువెక్కిపోతూంది.

తరువాత కొన్నాళ్ళకి బెరెట్ పాతమట్టియింట్లో కూచుని ఉంది. పెర్హాంసా కొన్నాళ్ళక్రిందట ఆ ఇంటిని చిన్న కొట్టానాగా మార్చేశాడు. ఆనాడు వాతావరణం మనోహరంగా ఉంది. ఆమె కుట్టుపనిచేసుకుంటూ, తరచు తల పైకెత్తి చూస్తూంది. పిల్లలు పొలానికి వెళ్ళారు. పెర్హాంసా ఆ ప్రక్కనే కొత్తగా కడుతున్న పశువులపాకకు కప్పు వేస్తున్నాడు. ఆమె చూపుల్లో మతాచార్యుడికి కనిపించిన ఆ చిన్నపిల్లల అమాయికత, కలలుగంటూన్నట్టు కనిపించే ఆ అస్పష్టదృష్టి అలాగే ఉన్నాయి.

ఆమెకు ఈవేళ బాగా ఉత్సాహంగానే ఉంది, కాని చాలా అలసిపోయినట్టుంది. మతాచార్యుడు తన హస్తం ఆమె తలపైన ఉంచి, ఆమె పాపాలన్నీ క్షాళనమైపోయాయని చెప్పిననాటినించీ, ఆమెకి ఇలాగే ఉంటూంది. బాగా అలసిపోయినట్టు, ఏదో బరువుదింపేసినట్టు — తేలిగ్గా ఉంటూంది. ఆమె పాపాలన్నీ నివృత్తిఅయినయ్యనే ఇప్పుడామె విశ్వాసం.

ఈ మతాచార్యుడు తాము నార్వేలో చర్చిలలో పాడుతూండిన భక్తిగీతాలన్నీ అద్భుతంగా మళ్ళీ ఇక్కడ ఈ మట్టికొంపలోనే అందరిచేతా పాడించిన సంగతి ఆమెకు

జ్ఞాపకం ఉంది. అయినా, ఇక్కడ ఎప్పుడు ఏం జరిగినా జరగవచ్చు. దీనివల్ల తమకు ఏమీ నష్టం కలగలేదు.

తరువాత, మళ్లీ ఆమె ఆలోచనలు తన తల్లి వేపు మళ్లినయి. ఆమె త్వరలో తనను చూడటానికి వస్తుంది. కాని, ఈసారి ఆమె పెర్నాండ్ తనకు కావాలని అనదు. వాడు పెద్ద మతాచార్యుడు కాబోయేవాడుగద! తన కుటుంబంలో ఒక మతాచార్యుడు! ఎంత అద్భుతం!

నార్వేలో అయితే ఇదేమీ ఉండేది కాదు. ఆసంగతి ఈసారి తను తల్లితో చెపుతుంది. ఇక్కడ ఏది జరిగినా జరగవచ్చు. తర్వాత, తనయింట్లోనే ఒకరోజున చర్చి ఏర్పాటుచేసినట్టుకూడా తల్లితో తను చెపుతుంది. వాళ్లమ్మ మొదట్లో నమ్మదు, నిజమే! అయినా, తను అన్నివిషయాలు గబగబా చెప్పేస్తుంది,—ఆమెకి నమ్మకం కలిగేవరకు. తమ పాతపెట్టె దివ్యవేదికగా ఉపయోగపడిందనీ, మతాచార్యుడు దానిమీద నిలబడి తన పాపాలన్నీ క్షమించబడినాయని ప్రకటించాడనీ,—అన్నీ తల్లికి చెప్పేస్తుంది.

బెరెట్ కుట్టుసామాన్లు కిందపెట్టి చేతులు ఒళ్లో పెట్టుకొని, శూన్యదృష్టులతో మౌనంగా అక్కడే కూచుంది. ఇంతలో ఆమెకి దొడ్లో అడుగులచప్పుడు వినిపించింది. ఎవరో వచ్చి పెర్హాంసాతో మాట్లాడుతున్నట్టున్నారు. హాన్స్ఓల్సాన్లాగున్నాడే!...ఔను, ఆయనే! మెల్లగా పిల్లిలాగ పశువులపాకదగ్గరకు నడచివెళ్లింది బెరెట్. గోడ

ప్రక్కన ఒదిగి నిలబడివింటూంది. తననిగురించే వాళ్లు మాట్లాడుకుంటున్నారు.

పెర్మాండ్‌ని తను తీసుకువెళ్లి జాగ్రత్తగా పెంచుతానంటున్నాడు హాన్సబిల్సా. "బెరెట్‌కి మళ్లీ అలాంటి ఆవేశంవస్తే, ఆమె ఏంచేస్తుందో!" అన్నాడాయన. బెరెట్ క్రిందికి వంగి పశువులపాక వెలపలఉన్న ఒక కొయ్య ముక్కను తీసి గట్టిగా పట్టుకుంది. ఇప్పుడిక పెర్హాంసా మాట్లాడుతున్నాడు.

"వద్దు వద్దు," అన్నాడాయన మెల్లగా, "ఆమె పెర్మాండ్ తల్లి. వాడు ఆమెదగ్గిరే ఉండాలి. వాడు దగ్గర ఉండగా ఆమెకు నయం కాకపోతే, వాణ్ణి దూరం చేస్తే ఆమెకి అసలే నయం కాదు."

బెరెట్ కొయ్యముక్క అవతల పారేసి నిటారుగా నిలబడింది. ఆమె ముఖం ఎర్రగా కందిపోయింది. కళ్లు పెద్దవి చేసిచూస్తూ నిలబడింది. చెవిలో చర్చిగంటలు మోగుతున్నట్టుంది ఆమెకు.

మళ్లీ హాన్సబిల్సా మాట్లాడుతున్నాడు, "ఊఁ! నువ్వల్లా అంటే నేనేంచెప్పగలను?"

"ఔను. అంతకన్న ఇంకోదారిలేదు. ఎన్నాళ్లనించో నేనీవిషయం ఆలోచిస్తున్నాను. నాబెరెట్‌కన్న మంచి మనిషిని ఇంతవరకు భగవంతుడు సృష్టించలేదు, ఆ సంగతి నాకు తెలుసు. తప్పు ఏదైనా ఉంటే, అది నాలోనే

ఉంది,—ఆమె నిక్కడికి తీసుకురావటం. ఈ జీవితం ఆమెకు సరిపడలేదు. ఆమె పుట్టక మంచిది. ఇక్కడి మొరటు బ్రతుకు ఆమె సహించలేదు. ఇక్కడికి వచ్చినప్పటినించి, పాపం అన్నీ కష్టాలే పడింది...ఏమైనా, పిల్లవాణ్ణి ఆమె దగ్గిరే ఉండనియ్యటం మంచిది.''

బెరెట్ ఆపైన వినలేదు. ఏదో సుఖ స్వప్నంలో నడుస్తున్నట్టు అడుగులు తేలిపోతూ వెళ్లిపోయింది. ఎటు, ఎక్కడికి వెళుతున్నదీ కూడా ఆమెకి తెలియదు. ఆకాశం నిండా తెల్లని పింజమబ్బులు ఊగుతూ పోతున్నయి. ''ఇదే భగవంతునిదయ!'' తనలో తనే అనుకుంది ఆకాశంలోకి చూస్తూ. ఇంతలో ఇంట్లో పసిబిడ్డ ఏడుపు వినిపించింది. దాంతో ఆమె ఆస్వప్నంలోంచి తేరుకుని, లోపలికి వెళ్లింది. సరాసరి పెర్మాండ్ ప్రక్కదగ్గిరికి వెళ్లి వాణ్ని ఎత్తుకుని గట్టిగా హృదయానికి హత్తుకుంది. వాడితో ఆడుతూ, పకపకా నవ్వుతూ అలా ఎన్నోసార్లు హత్తుకుంది. ఆముద్దులకి ఆ మురిసిపోవడానికి, ఆకౌగిలింతలకి అంతులేదు. పెర్మాండ్ కూడా పకపకా నవ్వుతూ సంతోషంగా ఇదంతా సహిస్తున్నాడు.

అలావాడితో ఆడుతూ ఉండగానే బెరెట్‌కి మళ్లీ బడలిక వచ్చేసింది. ఆమెకి తెలియకుండానే పడుకుని నిద్ర పోయింది. ఆనిద్రలో అందమైనకల. అందులో మనోహర మైన వెచ్చని ఎండ కాస్తున్నాడు సూర్యుడు. ఆకాశమంతా నీలంగా స్వచ్ఛంగా ఉంది. వెచ్చగా మృదువుగా గాలి

పిస్తూంది. ఆమె ఎంతోసేపు నిద్రపోలేదు. లేచి చూసేసరికి పెర్నాండ్ ఇంకా ఆమె ప్రక్కనే కూచుని ఉన్నాడు. వాణ్ణి ఎత్తుకుని తనతొడ మీద కూచోబెట్టుకుంది. ఏమిటో అంతా వింతగా, కొత్తగా కనిపిస్తూంది.

"నాకు తినడానికి ఏమైనా పెట్టమ్మా!" అన్నాడు పెర్నాండ్.

బెరెట్ లేచింది పాలు తీసుకురావాలని. కాని, గది మధ్యలో ఆగిపోయి, చుట్టూ చూసింది. ఆమెకి అంతా కొత్తగా ఉంది. వాడికోసం ఒకగ్లాసుతో పాలు అట్టే పెట్ట లేదూ? చెంచా ఎక్కడ ఉన్నట్టు? రొట్టె?...పాలివ్వడానికి ముందు వాడికి కొంచెం రొట్టె పెట్టాలే! కొత్తగా వచ్చిన అతిథిలాగ ఆమె ఇల్లు నాలుగు మూలలా చూస్తూంది. మరి కొంతసేపటికి అన్నీ కనిపించినయి. రొట్టెతిని పాలుతాగే సరికి పెర్నాండ్ మళ్లీ ఉత్సాహంగా కనిపిస్తున్నాడు.

తక్కిన వాళ్లంతా ఏమయినట్టు! ఇందాకేగా తను భర్తను చూసింది? మళ్లీ వాకిట్లోకి వచ్చింది, వెచ్చగా హాయిగా వీస్తూన్న గాలిపీలుస్తూ, చుట్టూ చూస్తూ. అదుగోతన భర్త! అక్కడే ఉన్నాడు...ఇంకా హాన్సబోల్సా మాట్లాడుతూనే ఉన్నాడు. తర్వాత ఆయన వెళ్లి పోయాడు. పెర్హంసా ఆమెవేపు వస్తున్నాడు. అయ్యో ఆయన ఎంతగా మారిపోయాడు! తలంతా, గడ్డమంతా నెరసిపోయిందే!

"అదేమిటండీ ఏమిటలా ఉన్నారు?" బెరెట్ అడిగింది. పెర్గాంసా నిశ్చేష్టుడై, నిర్ఘాంతపోయి చూశాడు. తూలి క్రిందపడి పోతానేమో అని పిస్తోంది ఆయనకి. బెరెట్ మాట్లాడుతూనే ఉంది. "వంట్లో బాగుండలేదా? ఏమిటో అస్తమానం రెక్కలు విరుచుకొని పనిచేస్తారు. వంటిసుఖం చూసుకోరు. ఏం మెల్లగా చేసుకోకూడదూ పని?"

పెర్గాంసా ఏదో అనాలని ప్రయత్నించాడు. కాని, నోటివెంట మాటరాలేదు. బెరెట్ ఆందోళన ఇంకా ఎక్కువ యింది. "రండి, లోపలికి రండి. కాసినిపాలు తెచ్చిస్తాను," అంటూ గబ గబ ఇంటివైపు నడిచింది. పెర్గాంసా మెల్లగా ఆమె వెనక వెళ్లాడు. "భగవంతుడిదయ! నాబెరెట్ ఇలా మాట్లాడడంవిని ఎంతకాలమయిందో!" అనుకున్నాడు.

బెరెట్ కాసినిపాలు వేరేతీసి కుంపటిమీద పెట్టింది. భర్తకి జలుబుచేసిందని ఆమెకి తెలుసు. వేసవిలో చేసిన జలుబు తొందరగా వదలదు. మిరియాలు చితకగొట్టి ఆపాల లోవేసింది. ఆయన వెచ్చగా ఇంట్లో పడుకుంటే బాగుండును. ఆమె ఇల్లా తొందరగా పనిచేస్తూండగా గోడమీద అద్దంలో ఆమె బింబం కనిపించింది. అందుకేమరి ఆయన తనవేపు అలా వింతగా చూశారు. తను శుచిగా, శుభ్రంగా కనపడటం ఎప్పుడూ ఆయనకిష్టం. ఛీ! తనింత చింపిరి సివంగిలా కనపడ టమేమిటి? గబ గబవెళ్లి ముఖం రుద్దుకుని, తలదువ్వేసు కుంది. బట్టలుమార్చి తను ఆదివారం వేసుకునే దుస్తులలో

కళ్లా అందమైనవి వేసుకుంది...ఇప్పుడామెలో ఎంతో మార్పు కనిపిస్తూంది.

పెర్హాంసా మెల్లగా లోపలికి వచ్చాడు, ఎవరో అపరిచితుల ఇంట్లోకి వస్తూన్నట్టు. బెరెట్ మిరియాలపొడుం వేసిన వేడిపాలు తెచ్చి...బల్లమీద ఆయన ముందుపెట్టి, ఆపాలు ఒక్కచుక్క మిగల్చకండా తాగెయ్యమంది. పెర్హాంసా పసివాడు పెర్మాండ్‌ని మృదువుగా తీసుకుని తొడ మీద కూచోబెట్టుకున్నాడు. తర్వాత, భార్యయిచ్చినపాలు తాగేశాడు. అప్పటికీ ఆయన ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. ఆయన పాలుతాగుతూంటేగా, బెరెట్ నవ్వుతూ, ఈరోజున ఆమెకన్నీ చిత్రంగా అందంగా కనబడుతున్నాయని చెప్పింది. ఇందాక తను ఒక్కక్షణంసేపే నిద్రపోయింది. లేచి చూసేసరికి, తను ఎన్నాళ్లకో తిరిగి తన యింటికి వచ్చినట్టు కనిపిస్తూంది, అంది.

ఈమాటలు వింటూన్న పెర్హాంసా చెక్కిళ్లవెంట కన్నీటి ముత్యాలు దొర్లుతున్నాయి. మాట్లాడుతూనే ఆమె ప్రేమ మధురమైన చూపంతా ఆయన మీదేఉంది. ఇదే తన ప్రియురాలు బెరెట్‌చూపు. చిరకాలం క్రిందట ఆయనకు సుపరిచితమైనచూపు. ఆయన పాలు తాగెయ్యగానే, ఇక వెళ్లి పడుకోమని శాసించింది. తనువెళ్లి ఆయనకి వంటినిండా శాలువకప్పి వచ్చింది.

పెర్హాంసా గోడవైపు తిరిగిపడుకున్నాడు. కళ్లవెంట నీరు ఆగిపోయేవరకు అలాగేపడుకుని ఉన్నాడు. నిజంగా తనకు

అంత అదృష్టమా! చివరికి, ఆయనకు కొంచెం తేలిగ్గా ఉంది. వెంటనే లేచాడు. "అప్పుడే లేస్తున్నారా మళ్లీ?" అంది ఆందోళనగా, బెరెట్.

"బాగానే ఉంది! ఈ వేసవిలో మనం పెద్దిల్లు కట్టుకోవాలంటే, ఇప్పట్నించీ చేయవలసినపని బోలెడు ఉంది. ఎంత కాలమని ఇల్లా గుడిసెలో బాధపడతాం?" ఆయన ఆమె వేపు నడిచివస్తున్నాడు. ఆ నడక వెనకటి ప్రేమికుడైన, ఆనందావేశపూరితుడైన పెర్హాంసా నడక. "నేను బయటికి వెళ్లడానికిముందు, ఇందాక నువ్విచ్చిన అమృత కషాయం మళ్లీ కాస్త తయారుచేసియ్యి చాలు!" అన్నాడు. అని, పెర్మాండ్‌ని ఎత్తుకుని, పైకి ఎత్తుగా ఎగరేసి పట్టుకున్నాడు; మళ్లీ మళ్లీ అదేపని చేస్తున్నాడు, చివరికి ఆ కుర్రవాడు నవ్వటం మానేశాదాకా.

బెరెట్ మళ్లీ పాలుకాచి, తీసుకువచ్చింది, తండ్రి కొడుకుల ఆటచూసి, "బాగుంది! బాగుంది! ఏమిటిది! మన మందరం ఇవేళ ఇలా చిత్రంగా మారిపోయాం!" అంది.

---

## ఎనిమిదవ భాగం

### ౧

ఆ రోజులలో ఆ మైదానంలో జరిగిన సంఘటనలను గురించి, ఆ మిడతలదండ్ల ఉపద్రవాన్ని, వలసదారుల ఆకలి మంటలను, అగ్నిప్రమాదాలను, మంచు తుపానులను— గురించి ఎన్నో కథలు చెపుతారు. ఒక శీతకాలం వరసగా ఎనభై రోజులు ఎడ తెరిపి లేకుండా—అక్టోబరు మధ్యలో ప్రారంభించి, ఏప్రిల్ నెల సగపడేవరకూ—మంచు కురిసింది. అక్కడి సంసారులు ఇళ్ళల్లోంచి పశువుల పాకల్లోకి, స్నేహితుల ఇళ్ళల్లోకి నేలసొరంగాలు తవ్వుకున్నారు. ఆ తర్వాత ఆ మంచంతా కరిగి, ఆవరదతో పొలాలన్నీ ధ్వంసం అయినయి, ఆ శీతకాలం ఎందరినో కడుపున బెట్టుకుపోయింది.

స్ప్రింగ్ క్రీక్ వలసలో ఉన్నవాళ్ళకి ఆహార పదార్థాలు నిండుకున్నయి. కట్టెలు కరవైనయి. పశుగ్రాసంగా ఉపయోగపడవలసిన గడ్డిని వంటచెరకుగా వాడేసుకున్నారు. చాలా పశువులను ఆమంచే పూడ్చిపెట్టింది. మనుష్యులు

కూడా ఎందరో మంచుసమాధి అయిపోయారు. ఆ శీత కాలంలో చనిపోయిన వాళ్లను పూడ్చిపెట్టడానికి వీల్లేక దొడ్లల్లోనే మంచులో కప్పిఉంచారు, మళ్లీ వసంతం వచ్చే వరకూ. ఆవిధంగా జబ్బులుచేసీ ఎందరో మరణించారు.

౨

హాన్స్‌ఓల్సా తనభూమిలో కొంతమేర కంచెవేసి, తనపశువుల మందమేయడానికి బీడుగా అట్టే ఉంచాడు. వేసవిలో వాటినిగురించి ఆయన ఏమీ శ్రమపడనక్కర లేదు. శీతకాలంకోసం, తాను పోగుచెయ్యగలగడ్డి అంతా పోగుచేసి, పశువులకు నిలవనీడకోసం ఆ చీకట్లోనే పెద్దపాక వేశాడు. అంచేత శీతకాలంకూడా తన పశువులకు ఏమీ ఇబ్బంది ఉండదనుకున్నాడు. కాని, ఫిబ్రవరిలో ఇంకా శీత కాలం అప్పుడే ప్రారంభమయినట్టు కనిపించేసరికి, ఇంకా చాలా చేయవలసివచ్చింది.

ఫిబ్రవరిలో ఒకరోజున, గాలి విపరీతంగా వీస్తూంది. అమితంగా మంచు కురుస్తూంది. బీటిపాకలో పశువు లేమై పోతున్నయ్యో అని భయంవేసింది హాన్స్‌ఓల్సాకి. చూసి రావాలని బైలుదేరాడు, మొండిధైర్యంతో. తీరా అక్కడికి వెళ్లి చూసేసరికి, ఆయనకి చేతినిండా పనితగిలింది. ఆమంచు తుపానుదెబ్బకి పశువులపాక సగం కూలిపోయింది. మళ్లీ గుంజలు నిలబెట్టాలి. కప్పు ఎగిరిపోయినచోటనల్లా గడ్డి

కప్పాలి. నేలమీద అంతట గడ్డిపరవాలి. ఆయనే ఈపన్లన్నీ చేసేసరికి చీకటిపడింది.

మళ్లీ ఆ పశువులన్నిటినీ పాకలోకి తోలుకొచ్చి కట్టెయ్యాలి. ఈపని మరీ దుస్సాధ్యంగా కనిపిస్తూంది. గడ్డిమేటిచాటున నిలబడి ఉన్నంతసేపూ వాటికి గాలిదెబ్బ తగలడంలేదు. అంచేత అవి, అక్కణ్ణించి పాకలోకిరావడానికి మొరాయిస్తున్నాయి. హాన్సేబిల్సా బలవంతాన ఒక్కొక్క దాన్నే లాక్కురావలసొచ్చింది. ఈపనికి చాలాసేపు పట్టింది. ఎడాపెడా మంచుదెబ్బలు తిన్నాడు హాన్సేబిల్సా. చలిగాలి ఆయనచుట్టూా సుళ్లు తిరిగింది. అయినా, పట్టినపట్టు విడవకుండా పశువులన్నిటినీ పాకలోకిచేర్చాడు. అప్పటికి అంతా గాఢాంధకారం అయిపోయింది. ఆ అలసటతో ఆయనకు చెమటలు పోస్తున్నాయి. ఇంటికి పోవాలని బయలుదేరాడు. నాలుగడుగులు నడిచేసరికి, ఆ తుపానులో, ఆ గాఢాంధకారంలో ఈపని తనకు సాధ్యంకాదని తేలిపోయింది.

పైగా, ఆయనకి వెన్నువెంట పెద్దచలిపెట్టుకొచ్చింది. వళ్లంతా నలగబాడిచినట్టు నెప్పులు ప్రారంభమయినయి. అడుగుతీసి అడుగువెయ్యటం అసంభవమయింది. ఇక చేయవలసినపని, ఆరాత్రి అక్కడే ఆ పశువులమధ్య వెచ్చగా పడుకుని, వెలుగురాగానే ఇంటికిపోవాలి. రెండు పశువుల మధ్య వెచ్చగా పడుకుని వెంటనే నిద్రపోయాడు.

కాని, ఆపాకలో ఉన్న ప్రతిసందునించి గాలి, మంచూ రంయిమని వచ్చి కొడుతున్నాయి. మళ్లీ కొంతసేపటికి

హాన్స్ఓల్సా ఉలిక్కిపడి లేచాడు. ఎంతో కష్టంమీద, లేచి నిలబడేసరికి, ఆయనమీద దట్టంగా పేరుకున్న మంచు దబ్బాల్ని నేలమీదపడింది. ఆయన కాళ్లు స్వాధీనంలో లేవు. పెద్ద ప్రయత్నంచేసి నడవబోయాడు, నిద్రబోతూన్న పశువుల మీద తూలిపోతూ, గాలి దెబ్బకొట్టినప్పుడల్లా క్రిందపడుతూ, లేస్తూ. ఒక చెయ్యి కొయ్యబారిపోయింది. దానికి ఉపాయం ఆయనకి తెలుసు. ఇంత మంచు తీసి ఆ చేతిమీద వేసి గట్టిగా రుద్దాడు. దాంతో చెయ్యి మళ్లీ కాస్త స్వాధీనంలోకి వచ్చింది.

ఆతర్వాత కాళ్ల పని పట్టించాడు. ముందుగా బూట్లూ మేజోళ్లు కోసితీసేశాడు. ఆవట్టి కాళ్లతో చేతనయినంత వరకు చుట్టూ పరిగెత్తాడు. తర్వాత కాళ్లమీద మంచు వేసి రుద్దాడు. మళ్లీ మేజోళ్లు, బూట్లు తొడుక్కొని, వాటిని ఆపాకలో ఉన్న తాళ్లతో కాళ్లకు కట్టుకున్నాడు. తను ఆరాత్రి తెల్లవార్లూ ఆపాకలో గడపడం అసంభవమని నిర్ధారణచేసుకున్నాడు. ఏమైనా సరే! ఇంటికి వెళ్లడానికి ప్రయత్నంచెయ్యాలి. "ఇక్కడ ఉండి చలితో నీలుక్కుపోయే కంటె, దార్లో కూలిపోయినా మంచిదే!" అనుకుంటూ ఆ అంధకారంలోకి బయలుదేరాడు.

ఆరాత్రి ఆయనపై మృత్యువు గట్టిదెబ్బ తీసింది. ఉదయం ఇంటి గుమ్మంమీద బెళ్లబెట్టుగా పడిపోయాడు. ఆ గుడ్డలు విడవడానికి కూడా ఆయనకు సత్తువలేదు. ఆరాత్రంతా సారీనా మేలుకునే ఉంది. హాన్స్ ఓల్సా ఇంక

తనకు కనబడదనే ఆమె అనుకుంటూంది. అయినా, కిటికీలో కొవ్వొత్తి దీపం పెట్టుకుని అలాగే కూచుని ఉంది. దైవం రక్షించి ఆయనవస్తూ ఉంటే ఇల్లు ఆనమాలు తెలియాలని.

హాన్సఓల్సా ఇంటికి చేరగానే సారీనా ఆయనకి ఉపచారాలు ప్రారంభించింది. మిరియాలపొడి వేసిన వేడివేడి పాలు గ్లాసువెంట గ్లాసు తాగేశాడు ఓల్సా. ఆ తర్వాత గొంగళిపైన గొంగళి కప్పుకుని పడుకున్నాడు. అప్పటికీ తెగవణికి పోతున్నాడు. ఆ వణుకుకి మంచంమంతా కదిలి పోతూంది. పైగా ఎడతెరపి లేకుండా దగ్గుతున్నాడు. అది గుండెలు పగిలిపోయేటట్లు వస్తూన్న పొడిదగ్గు. రెండు రోజులు అహో రాత్రులు సారీనా భర్త మంచం ప్రక్కన అలాగే కూచునిఉంది. ఓల్సాకి కొంచెం నయంలాగ కనిపిస్తూంది.

చివరికి తుపాను కొంచెం తెరప ఇచ్చింది. సోఫీ ఆ మంచులో జారుడు కర్రలమీద ఎలాగో పెర్హాంసా ఇంటికి వెళ్లి ఈసంగతంతా చెప్పింది. వెంటనే పెర్హాంసా ఆమెతో బయలుదేరి వచ్చేశాడు. సారీనా బాగా అలసినట్లు, చిక్కి-పోయినట్టు కనిపిస్తూంది. పెర్హాంసా కనిపించగానే ఆమెకు ప్రాణం లేచివచ్చినట్టయింది. ఆయన్ని పడక గదిలోకి తీసుకువెళ్లింది. పరిస్థితి ఏమీ బాగున్నట్లు లేదు.

ఐర్లెండునించి వలసవచ్చిన వాళ్ల ఇళ్ల ప్రక్కన చిన్నగుడిసెలో ఒక ముసలమ్మ ఉంది. ఎవరికైనా జబ్బు చేస్తే, వెంటనే ఆమెకి కబురంపడం అక్కడ మామూల

యింది. జబ్బు మనుష్యులకి ఆమె అద్భుతమైన వైద్యం చేస్తుంది. మిత్రుడు ఎంత నీరసస్థితిలో ఉన్నదీ గ్రహించ గానే, పెర్త్రాంసా అక్కడికి పరుగెత్తి, ఆమెను వెంటబెట్టు కుని వచ్చాడు.

ఆమె ఏవేవో ఉపచారాలు చెయ్యమని సారీనాకి పుర మాయించింది. ఏవో మంత్రాలు పెట్టింది. అక్కడ ఎవరికీ అర్థంకాని ప్రార్థనేవో చదివింది. ఒకసిలువ తీసుకువచ్చి వాళ్ల యింట్లో పెట్టింది. తను చెప్పినప్రకారం అన్నీ చేస్తూండమని ఆసిలువకోసం తాను మళ్లీ వస్తాననీ చెప్పి వెళ్లిపోయింది.

పెర్త్రాంసా తన పనులతోపాటు, హాన్సెబిల్లా పను లన్నీ చేసిపెడుతున్నాడు. జరిగిన సంగతంతా బెరెట్‌తో చెప్పేసరికి, ఆమెకూడా వెళ్లి సారీనాకి సాయంచేస్తూంది. బెరెట్‌కి స్వస్థత కలిగినప్పటినించీ ఆమె మతనిష్ఠ మరీ ఎక్కువ యింది. ఆమె ప్రార్థన వచనాలు చదువుతూ, రోగికి వెచ్చగా ఉండటానికి అవసరమైన ఉపచారాలుచేస్తూ, హాన్సెబిల్లా మంచందగ్గిరే కూచునిఉంది. ఆసమయంలో టాన్సెటెన్ చూడటానికి వచ్చాడు. హాన్సెబిల్లాని ఉత్సాహపరచడానికి, అతడు ఆవలసపల్లెలో సంగతులు, పిచ్చాపాటీ ఉత్సాహంగా మాట్లాడేస్తున్నాడు, బెరెట్‌కి మతనిష్ఠ ఎక్కువైనప్పటినించీ, ఆమెకి, టాన్సెటెన్‌కీ ఏమీ పడటంలేదు. అతడురాగానే తన ప్రార్థనలు కట్టిపెట్టి అక్కణ్ణించీ లేచిపోయింది బెరెట్.

టాన్సెటెన్ వెళ్లిపోయిన తర్వాత, ఆగదిలో వాతా వరణమంతా మైలపడినట్టు కనిపించింది బెరెట్‌కి. అంతా

పరిసుభ్రంగా, శుచిగా ఉండవలసిన జీవితంలోకి కాలుష్యం ఎలా ప్రవేశిస్తుందో ఆమె కిప్పుడు స్పష్టంగా బోధపడింది. ఇక్కడ ఒక పెద్దమనిషి మృత్యుసమ్ముఖంలో పడిఉన్నాడు. నీచవిషయాలు, నికృష్టమైన హాస్యకథలు తప్ప టాన్సెలెవ్ కి ఇంకోవిషయం తోచదు. ఆ కలుషిత వాతావరణాని, పరిహరించడంకోసం మళ్లీ ఆమె ఒక ప్రార్థనవచనం చదవడం ప్రారంభించింది, మెల్లగా, మృదువుగా.

ఆరాత్రి తెల్లవారేవరకు ఆమె ఓల్సా మంచం ప్రక్కనే కూచుని ఉంది. ఆయనకి కొంచెంసేపు నిద్రపట్టింది. తర్వాత లేచి దగ్గి దగ్గి నెత్తురు కక్కాడు. దాంతో, ఆయనతో చాలా ముఖ్యమైన విషయం మాట్లాడాలని బెరెట్ తెల్లవారి, మళ్లీ ఆయనకు మెలకువ వచ్చేవరకు అక్కడే ఉండిపోయింది. "ఇక మీరు తొందరగా ఏర్పాట్లు చేసుకోవాలి. ఈదగ్గుని ఇకమీరు ఆట్టేకాలం సహించలేరు?" అంది.

అలసిపోయిఉన్న ఓల్సా ఆమె మాటలను అర్థం చేసుకోలేదు. "ఇలాంటి దగ్గులు చాలామందికి నయమయినై గా!" అన్నాడు.

"కాదు మీ జీవితపుణ్యకాలం దాదాపు పూర్తి కావస్తూంది."

హాన్సఓల్సా మళ్లీ కళ్లుమూసుకుని, కొంతసేపటి వరకు మాట్లాడకుండా పడుకున్నాడు. "నామాట ఈయనకు

రుచించలేదు. కాని, చెప్పవలసినమాట చెప్పాను. అదే నాకు సంతృప్తి. ఈయన ఇక జీవించడు,'' అనుకుంది బెరెట్.

కొంతసేపటికి హాన్స్ఓలస్సా అన్నాడు, ''ఆపరమపిత ఎందరో పాపుల్ని దయజూశాడు. రవంతదయ నామీద కూడా ప్రసరించకూడదూ...''

బెరెట్ చైతన్యం మళ్లీ మేల్కొన్నది, ''మీరు పశ్చాత్తప్తులైతే, ఆ కృపాళువు మిమ్మల్ని కరుణిస్తాడు,'' అంది.

ఇంతలో హాన్స్ఓల్సాకి మళ్లీ దగ్గుతెర వచ్చింది. తెరిపిలేకుండా దగ్గి దగ్గి, మళ్లీ వెల్లికిల పడుకుని నిద్ర పోయాడు. బెరెట్ ఆయనకు గొంగళికప్పి, ఆయనవేపే చూస్తూకూచుంది. తనకూ, ఓల్సాకీ జరిగిన సంభాషణంతా మళ్లీ జ్ఞాపకంవచ్చింది. ''లాభంలేదు. ఈ డకోటాసీమలోని వాళ్లలో ఎవరికో నూటికి కోటికి ఒకళ్లకైనా స్వర్గప్రవేశం దొరుకుతుందో దొరకదో! స్వర్గంలో తిరిగి హాన్స్ఓల్సాని కలుసుకునే అవకాశంలేదు. ఎంతదారుణం! ఆయన తల్లి తండ్రి అక్కడ ఆయనకోసం ఎదురు చూస్తూఉంటారు. ఎప్పుడో ఒకరోజున నేను వాళ్ల ఎదటికిపోయి, ఇక్కడ జరిగినదంతా చెప్పి, తమకుమారుడు ఎన్నటికీ అక్కడికి రాలేడని చెప్పాలేమో! ఈ పాపిష్టిదేశంలో శనిగాడే రాజ్యం చేస్తున్నాడు. ఎందుకూ? నాయింట్లో నాకే ప్రత్యక్షంగా కనిపిస్తూంది. ఇక్కడ! ఈయన మరణశయ్యమీద ఉండి,

ఆ టౌన్సెన్ చెప్పే చోల్లు కబుర్లు సంతోషంగా వింటు న్నాడు !''—అనుకుంది.

చలి నెగడిలో రెండుపుల్లలు వేసింది బెరెట్. హాన్స ఓల్సాకి మళ్లీ మెలకువవచ్చి, ఆమెవేపు తిరిగాడు. ''బయట ఎల్లాఉంది ? డాక్టరుకి కబురుపెట్టడానికి వీలయిందా ?''

''డాక్టరికా ? తెల్లవారిన తరువాత చూద్దాం. మతా చార్యుడికి కబురంపడం సంగతి ?''

''మతాచార్యుడికా ?''

''ఔను. ఇప్పుడు మీకు సహాయపడవలసింది ఆయనే! మీరు 'భగవన్నివేదన' చేసుకోవడం మంచిది.''

''భగవన్నివేదనా?'' అన్నాడు రోగి, ''ఔను.. మంచిదే అనుకుంటాను.''

''భగవన్నివేదనచేసుకోక సజీవంగా శనిగాడికి వశమై పోవటం అన్యాయం!'' అంది బెరెట్ విచారంగా. ''ఇక్కడంతా పాపం తప్ప మరొకటి కనిపించడంలేదు.. భగవంతుణ్ణి నిమంత్రించి నివేదనచేసుకుంటే, మన పాపాలన్ని నివృత్తిఅయిపోయినా యని ఆయన అభయమిస్తాడు. మనకు స్వర్గద్వారాలు తెరుచుకుంటయి. ఆత్మకు శాంతి, విశ్రాంతి లభిస్తయి.''

హాన్సఓల్సా గోడవేపు తిరిగి బలవంతంగా దగ్గాడు. బెరెట్ కి మరింత విచారం కలిగింది. ''నాజీవితంలో అడుగడు

గునా నేను అనుకుంటూనే ఉన్నాను; చిట్టచివరికి, భగవంతుడికి ఆత్మార్పణంచేసి, శాంతిపొందాలని!''—అన్నాడాయన.

బెరెట్ సంతోషానికి అంతులేదు. ఆమె చెంపలమీద అశ్రువులు జారుతున్నాయి. ''మరి భగవన్ని వేదనకు మీరు సంసిద్ధులై ఉండాలి. స్వర్గంలో ఆయన సన్నిధికి చేరడానికి పూర్వం, ఈ లోకంలోనే ఆయన దర్శనం సిద్ధింపజేసుకోవాలి. మీపక్షాన నేను ప్రార్థనచేస్తాను,'' అంటూ, ఆమె మోకరిల్లి ప్రార్థనచేయడం ప్రారంభించింది. సరిగ్గా అదేసమయానికి పొరుగుసంసారి ఒకాయనవచ్చి, బెరెట్‌నిగురించి వాకబు చేస్తున్నాడు. ఆయన భార్యకు పురుడువచ్చేటట్టుంది. సహాయంచేయడానికి ఇంక ఎవ్వరూ లేరు. ఇదికూడా శనిగాడిపన్నాగమే, అనుకుంది బెరెట్. పశ్చాత్తాపపడబోతున్న పాపిని వదిలిపెట్టి తను వెళ్ళిపోవలసినపరిస్థితి కల్పించింది— తప్పకుండా శనిగాడే! తను వెళ్ళక తప్పదు.

ఆ దారుణ వాతావరణంలో ఇరుగుపొరుగువాళ్లు ఒకళ్లకొకళ్లు సాయపడాలి. హాన్స్‌ఓల్సా పని అయిపోయింది. ఆయన పరిస్థితి దిగనాసిలుతూంది. దగ్గు క్రమంగా ఎక్కువైపోతూందిగాని, తగ్గడంలేదు. ఆయన మనస్సుకూడా చెదురుతూంది. పెర్హాంసాని ఆ రాత్రికి అక్కడే ఉండమన్నాడు.

సొరీనా పడుకుని నిద్రపోయింది. హాన్స్‌ఓల్సా తన ప్రియమిత్రుణ్ణి పిలిచి, తను కళ్లు మూసుకున్నాక జరగవలసిన వ్యవహారాన్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టాడు. తను

చెల్లించవలసిన బాకీలు ఉన్నాయి. తనకు రావలసినవి కొన్ని ఉన్నాయి. తర్వాత తన పొలాలసంగతి చెప్పాడు. వాళ్లకు మంచి మేనేజరు ఎవరన్నా దొరికితే, సారీనా పిల్లల్ని పెట్టుకుని ఇక్కడే ఉండిపోవడం మంచిది. మధ్యలో దగ్గుతూ, మళ్లీ చెపుతూ ఎలాగో అన్నివిషయాలు చెప్పేశాడు.

తర్వాత కొంతసేపటికి మళ్లీ మొదలుపెట్టాడు. మంచు, వాతావరణం ప్రస్తుతం ఎలా ఉన్నదీ అడిగాడు. బయట ఎంత దారుణంగా ఉన్నదీ ప్రెర్రాంసా చెప్పాడు. ఎక్కడికీ కాలు కదపడానికి అవకాశంలేదు. ఆ మాట వినగానే హాన్సెల్సా ముఖం వెలవెలబోయింది. ఆయన నుదుటిపైన స్వేదబిందువులు పొటమరించినయి.

"నీకు కావలసింది ఏమిటో చెప్పు," ప్రెర్రాంసా అడిగాడు.

"అయితే మతగురువుకోసం వెళ్లివచ్చే వీల్లేదంటావా?"

"ఆయన తప్పకుండా రావాలా?"

"సజీవంగా శనిగాడి వశమైపోనా మరి?......ఇంత బ్రతుకూ...బతికి!" అని మళ్లీ గట్టిగా దగ్గటం ప్రారంభించాడు. "అయిపోయింది, ఇది ఆఖరుదశే!" అనుకున్నాడు ప్రెర్రాంసా. అయితే, మరి కాసేపటికి దగ్గుతగ్గి పడుకుని నిద్రపోయాడు హాన్సెల్సా. ఆ పడుకుంటం పడుకుంటం మళ్లీ తెల్లవారేవరకు లేవలేదు. ఆయనకు మెలకువ వచ్చేసరికి, ప్రెర్రాంసా ప్రయాణసన్నాహం పూర్తిచేసుకుని సిద్ధంగా

ఉన్నాడు. మరి ఆయన చక్కబెట్టుకోవలసిన పనులు చాలా ఉన్నాయి. హాన్స్ఓల్సా తన స్నేహితుణ్ణి చూసి, నీరస కంఠంతో అన్నాడు, "ఇప్పటికీ...బయటికి వెళ్లే...వీలు లేదన్నమాటేనా?"

"నువ్వు మాట్లాడకుండా పడుకో! ఊరికే ఏది పట్టుకుంటే—అదే ఆలోచనా? పడుకుని హాయిగా నిద్రపో! తగ్గిపోతుంది. నేను తర్వాత మళ్లీ వస్తాను," అన్నాడు పెర్హాంసా.

హాన్స్ఓల్సా ఇదేమో విననట్టే నటిస్తూ, "అయితే, లాభం లేదన్నమాటేగా!"

తన స్నేహితుడికి ఎలా సమాధానం చెప్పవలసిందీ పెర్హాంసాకి తెలుసు. "ఇక కట్టి పెట్టి పడుకో! లాభమో, నష్టమో నాచావు నేను చస్తాను! తెలిసిందా?"—అన్నాడు.

"పెర్హాంసా! నిజంగా నీలాంటి మనిషి లేడురా!" అన్నాడు ఓల్సా.

పెర్హాంసా ఇంటికి చేరుకునేసరికి ఆయన శరీరంలో దమ్మిడీసత్తువ మిగల్లేదు. ఆయనకు భోజనంపెట్టడానికి నిరీక్షిస్తూంది బెరెట్. పెర్హాంసా ఆమెనింకా చిన్నపిల్లను చూసినట్టే చూస్తున్నాడు, ఆమెకి స్వాస్థ్యం కలిగినా. ఆమెమతాచారాలుకూడా ఆయనదృష్టిలో చిన్నపిల్లల చేష్టలే. ఆమెకి ఇప్పుడు 'మతపిచ్చి' పట్టుకుందని ఆయన అభిప్రాయం. అయితే, ఆమాట ఆమెకు చెప్పలేదు. ఎందుకూ! చిన్న

పిల్లతో వాదించి ప్రయోజనం? అయినా ఆమె మతనిష్ఠల వల్ల తనకు ఇబ్బందిమాత్రం కలుగుతూంది. ముఖ్యంగా ఆమె తన కోసంచేసే ప్రార్థనలు, తనంత మహాపాపిష్ఠి లేడన్నట్టు ఉంటున్నాయి. అయినా, పాపం ఆయన ఏమీ అన లేదు. వాళ్ళిద్దరి మధ్య ఒకానొకప్పుడు ఉండిన అరమరిక లేని సయోధ్య ఇప్పుడులేదు. అంచేత, పెర్సిగా భోజనం చేస్తూనే ఆమెతో అనేశాడు, పరిస్థితులు ఏమీ బాగుండ లేదని.

భోజనమయింతర్వాత కిటికీ దగ్గరకుపోయి బయటికి చూస్తూ అన్నాడు, "అతను మతగురువుని గురించి తప్ప ఇంకోమాట మాట్లాడ్డంలేదు. ఏమిటో ఆపిచ్చి, నాకు అర్థం కాకుండా ఉంది..."

బెరెట్ ఆనంద మంద్ర స్వరంలో అంది, "నాకు అర్థమవుతూనే ఉంది! వెంటనే ఎవరో ఒకరు మతాచార్యుడి కోసం వెళ్ళాలి. మీరు ఇంకెవరినైనా తోడు తీసుకువెళ్ళడం మంచిది. మీరు గుర్రంమీద వెళ్ళవచ్చుగా?"

"గుర్రంమీదా? ఈ మంచు తుపానులోనా?"

"తప్పించడానికి వీలువుండి కూడా, ఆయన నరక కూపంలో పడిపోతూంటే చూస్తూ ఊరుకోటం న్యాయం కాదు."

"ఆయనవెళ్లేది నరకానికే అయితే, భయంలేదు! ఇక్కడి స్నేహితులు చాలామంది వెళతారు అక్కడికి—ఆయనకు తోడు!"

అంతకన్న నీచమైన మాట తాను జన్మంలో విన లేదనుకుంది—బెరెట్. "మానవుడు స్వర్గం కోసం ఎంత తపించేదీ మీకు అర్థంకాదు. ఔనా?"

"ఔను. నిజం! నాకసలు ఏదీ అర్థంకాదు ఇప్పుడున్న పరిస్థితిలో ఒకమనిషి ఇక్కణ్నించి ఈ అంతులేని మైదా నాన్నిదాటి, ఆజేమ్స్‌నదీ తీరానికి వెళ్లి ప్రాణాలతో ఎలా తిరిగి రాగలడో కూడా నాకు అర్థం అవదనుకుంటాను. ఇక హాన్స్ ఓల్సా విషయం విను! మతగురువు మంత్రాలు అక్కర్లే కుండానే భగవంతుడు అతన్ని క్షమిస్తాడు. ఆ యోగ్యత అతనికి ఉందని నాకు తెలుసు," అన్నాడు పెర్హాంసా.

"ఆ శనిగాడే మీచేత ఇల్లా మాట్లాడిస్తున్నాడు," బెరెట్ అంది.

"చాలించు! నేను బ్రతికుండటం నీకిష్టంలేదా?"

"ప్రయత్నం చెయ్యవచ్చుగదా! మీకు తోడుగా ఎవరినైనా తీసుకువెళ్లండి. హెన్రీ రావచ్చుగా...కనీసం మీరు ప్రయత్నంచేసినవా రవుతారు. ప్రయత్నమైనా చేస్తే భగవంతుడు మనల్ని క్షమిస్తాడు."

అమితకోపంలో పెర్హాంసా జవాబు చెప్పలేకపోయాడు; మొగపిల్లలిద్దర్నీ పిలిచాడు, వాళ్లని తీసుకుని బయటికి

వెళ్ళిపోయాడు, ఉదయం మామూలుగా చేయవలసిన పన్లు చూసుకోటానికి. బెరెట్ ఒక్కతే ఉంది ఇంట్లో,—తమ సంభాషణంతా మళ్ళీ పునశ్చరణ చేసుకుంటూ.

పెర్హాంసాకి తగనికోపం వచ్చింది. తనకు పిచ్చెత్తి పోతుందేమో!—అనుకున్నాడు. తనకుటుంబం సుఖంగా బ్రతకాలని తాను రెక్కలు విరుచుకుని రాత్రింబగళ్ళూ కష్టపడినందుకు ప్రతిఫలం ఇది!–ఏదీ అర్థంచేసుకోలేని మహా పాపి అని చివరికి తనకువచ్చిన బిరుదు! కాని, కుర్రవాళ్ళతో మాట్లాడుతూ పనిచేసుకుంటంలో, ఆయన ఆవేశం కొంత ఉపశమించింది.

పని పూర్తికావచ్చేసమయంలో, మంచు జారుడు కర్రలమీద సొరీనా వచ్చి, "మీస్నేహితుడు మిమ్మల్ని పిలుచుకురమ్మన్నా"డని చెప్పింది. ఆమెకూడా పెర్హాంసా వెళ్ళి రావాలనే కోరుతూంది.—కాని, ఆమె ఉద్దేశం ఆయన వెళ్ళి డాక్టరును తీసుకురావాలని. పెర్హాంసా ఏ పనైనా చేయగలడని,—వీళ్ళందరి ఉద్దేశం లాగుంది! కాని, ఈ వాతావరణంలో తను వెళితే, ఒకటికి రెండు చావులు అవుతాయని తనకి గట్టిగా తెలుసు.

రాత్రి భోజనాలసమయంలో పెర్హాంసా, బెరెట్ ఏమీ మాట్లాడుకోలేదు. భోజనంకాగానే, పెర్మాండ్‌తో ఆడుకోటం మొదలు పెట్టాడు పెర్హాంసా. బెరెట్‌కి ఏం చెయ్యడానికీ తోచలేదు. చలికోటుతీసి తొడుక్కుని, మంచు

కఱ్ఱజోళ్లు తెచ్చుకోటానికి వెళ్లింది. "చెయ్యాదగినపని ఎవళ్లో ఒకళ్లు చెయ్యాలిగద!" అంది. ఆమె తల పగలగొట్టేవాడే పెర్హాంసా! కొట్టలేదు. వెంటనే బట్టలు వేసుకుని, బెరెట్ గమనించకముందు—బయటికి వెళ్లిపోయాడు.

పెర్హాంసా సరాసరి మంచుకొయ్యాజోళ్లు మంచివి తయారుచేసే ఒక కొత్త వలసదారుని ఇంటికి వెళ్లాడు. దూరప్రయాణానికి పనికివచ్చే రెండు మంచుకొయ్యాజోళ్లు అద్దెకు తీసుకొచ్చాడు. ఇంటికిరాగానే, తాను దూరప్రయాణం వెళుతున్నాననీ, మళ్లీ ఎప్పటికి వచ్చేది తెలియదనీ— కొడుకులకి చెప్పాడు. "ఇంటిపనన్నీ మీరు చూసుకోగలరుగా?" అన్నాడు. చూసుకోగలమన్నారు కుఱ్ఱవాళ్లు, ధైర్యంగా.

బెరెట్ కిటికీలోంచి చూస్తూంది. భర్త బయలుదేరడానికి పూర్వం ఆయనకు ఇవ్వడానికి వేడివేడి కాఫీ తయారుచేసింది. ఆయన అన్నమాటలకు తనకు కోపమేమీ లేదని తెలియజెయ్యాలని ఆమె సంకల్పం. పెర్మాండ్‌ని పంపించింది, కాఫీ సిద్ధంగా ఉందని తండ్రికి చెప్పిరమ్మని.

పెర్మాండ్ బయటికి వచ్చేసరికి, పెర్హాంసా కాసేపు వాణ్ణి ముద్దులాడి, మళ్లీ ఇంట్లోకి పంపేశాడు, "వస్తాలెమ్మని చెప్పు మీఅమ్మతో!" అని. కాని, ఆయన ఇంట్లోకి వెళ్ల లేదు. మళ్లీ ఇంటివేపు తిరిగిచూడకుండా, మంచుకఱ్ఱజోళ్లు వేసుకుని బయలుదేరి వెళ్లిపోయాడు.

బెరెట్ కిటికీలోంచి ఆయనను చూస్తూంది. ఆయన లోపలికి రావడంలేదా? వీల్లేదు, ఆయన అలా వెళ్ల కూడదు! ఆయన ప్రయాణానికి తను అన్నీ చక్కగా అమర్చి పెట్టింది. ఆయన్ని పిలవటానికి ద్వారంవద్దకు పరుగెత్తింది. లాభంలేదు. అప్పటికే ఆయన దూరంవెళ్లిపోయాడు. గాలి విరుసుగా ఆమె ముఖానికి కొట్టింది. పెద్ద పెద్ద మంచు తెరపలు గాలిలో పిల్లి మంత్రాలుకొడుతూ లోపలికికూడా వచ్చిపడుతున్నయి.

పెర్వాంసా తల ముందుకు వంచి, ఆగాలిని, మంచును చీల్చుకుంటూ పోతున్నాడు. పోతున్నంతసేపు ఆయన యింటిని గురించే,— ముఖ్యంగా పసివాడు పెర్మాండ్ ని గురించే— ఆలోచిస్తున్నాడు. తనబిడ్డ గొప్పవాడు అవుతాడు. ఆవిషయంలో ఆయనకు సందేహంలేదు. క్రమంగా, చీకటి గాఢాంధకారం అయిపోతూంది. గాలి జోరు మరీఎక్కువవుతూంది. మంచు తెరపలు ఇంకా పెద్ద పెద్దవి గాలిలో కొట్టుకొస్తున్నయి. ఆయన తోసుకుని ముందుకి వెళుతూనేఉన్నాడు. త్వరగా వెళ్లాలి...వెళితే...మళ్లీ త్వరలో ఇంటికిచేరుకోవచ్చు.

3

వసంతం వచ్చింది. జేమ్సునది వలసదగ్గిర ఒకచేలో ఇద్దరుపిల్లలు ఆడుకొంటున్నారు. ప్రక్కగుట్టమీద పాతగడ్డి మేటివుంది. ఆగడ్డి బాగుండక పోవడంవల్లనేమో అక్కడి వలసదారులలో ఒకరైతు దాన్ని అలాగే వదిలేశాడు.

ఆ పిల్లలిద్దరు ఆగడ్డిమేటి దగ్గిరికివచ్చి, అక్కడే నిశ్చేష్టులై నిలబడిపోయారు. ఆగడ్డిమేటికి ఒకప్రక్కన, దానిని ఆనుకుని ఎవరో మనిషి కూచుని ఉన్నాడు. ఆ మేనెలలో వెచ్చగా హాయిగాఉన్న ఆరోజునకూడా ఎంచేతో మంచుమీద నడిచే కర్రజోళ్లు తొడుక్కుని ఉన్నాడు. పైగా ఇంకో కర్రజోడు వీపుకి కట్టుకున్నాడు. ఆయన మళ్లీ మంచుమీద నడిచేకాలం కోసం ఎదురుచూస్తూ, విశ్రాంతికోసం అలా కూచున్నట్టు కనిపించింది ఆ కుర్రవాళ్లకి. చలికాలపుదుస్తులు ఆయన వంటి మీద బిగిసిపోయి ఉన్నాయి.

ఆయనముఖం పాలిపోయి, పూర్తిగా అలసిపోయి నట్టుంది. కళ్లు పశ్చిమదిశకు తిరిగిఉన్నాయి.